సరస్వతీ గ్రంథమండలి

నాటకానుబంధము 3

శ్రీ

# మీ వా రు ప త న ము

# THE DOWN FALL OF MEWAR



గ్రంథకర్త

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు బి. ఎ. ఆనర్సు



ప్రకాశకులు

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడు
సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

1926



వెల 1—:—

DEDICATED

TO

**THE HALLOWED MEMORY**

OF

THE LATE LAMENTED

# DESABANDHU CHITTARANJAN DAS

Poet, Politician, Patriot, Philosopher, Prophet

AND

The illustrious Tribune of

HIS FATHERLAND

*As a Humble Token of ineffable admiration*

*For His Colossal Self-abnegation,*

*Unswerving Devotion to Mother India,*

*Unstinted Love of His Country-men*

AND

Unparalleled Service

TO HUMANITY

BY

**His Student-friend**

**J. S. MOORT[illegible].**

# కృతిసమర్పణము

సీ. ఏపుణ్యధీశక్తి యెల్లవారినిగూడ
వసుధలోనకృజం పడగఁజేసె
ఏశూరవర్యుఁ డహీన వైభవమీఁగి
దేశ హితార్థమై తిరిసెమొత్తె
ఏభక్తుఁడై దేండ్లు హితవారఁగమహాత్ము
దక్షిణస్కంధమై తనరియుండె
ఏపూజ్య సత్కీర్తి హిమసేతుపర్యంత
విశ్వమండలము వ్యాపించియుండె

గీ. అట్టిసద్గుణసాంద్రు మహానుభావు
భారతీబాంధవుని సత్కృపాసముద్రు
చిత్తరంజనదాసు సుశీలుస్మృతికి
ఈకృతిప్రసవాంజలినిత్తు భక్తి.

# పీఠిక

భారతభాషలం దాంధ్ర మగ్రస్థానము నలంకరించియుండ, రమారమి యేఁబది వర్షములలో వంగభాషకు ద్వితీయస్థానము నొసంగిన విశేషజ్ఞులగు మనీషావంతులలో ద్విజేంద్రలాల్‌రాయి ముఖ్యుఁడు.

పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడై కొన్ని వత్సరము లైరోపా ఖండమందు వసించి, ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య మహార్ణవంబును మథించి అందలి యమృతమును గ్రోలి, సరససాహిత్య సంపాదనాభిలాషుల కనిర్వాచ్యోత్కర్షప్రదాయకంబులైన మహానాటకముల రచించి, వివిధవిషయరత్నముల బహుళంబుగ వాని కలంకరించి తన సర్వశాస్త్రకూలంకష ప్రజ్ఞఁజూపి, నాటకకవి సార్వభౌముఁడై, వంగనాటక రంగమునకుఁ గ్రొత్తవన్నె నొసఁగి, "భారత షేక్స్పియరు" రనఁబరఁగి యాతఁడవినాశకమైన ప్రతిభనందెను.

ప్రస్తుత మాంధ్రనాటక సాహిత్యము ద్విజేంద్రునకుఁ బూర్వమం దుండిన వంగనాటక సాహిత్యము భాతినున్నది. స్వాదుభాష యని పేరుబడసి, ప్రాచ్యలాటినని(The Latin of the East) వాసిఁగాంచిన మన యాంధ్రము విశేషంబుగఁ బద్యకావ్య బహుళంబై యుండుటచే, నాధుని కాంధ్రకవి తల్లజులైన చిన్నయసూరి, వీరేశలింగము, లక్ష్మీనృసింహారావుగార్లు తమ యపూర్వరచనా విదగ్ధతఁజూపి, హృద్య గద్యకావ్యముల లిఖించి, మన వాఙ్మయమందలి కొఱంతఁ గొంత తగ్గించిరి.

గణయతిప్రాస కఠిన ఛందోనియమశృంఖలాబద్ధము గామి, గద్యము పద్యముకంటె నతిసులభముగ భావప్రకాశ మొనరింపఁ గలుఁగును. ఆంగ్లగద్యమువలెనే యాంధ్రగద్య మలంకారాది మనోహర ప్రయోగముల కనువైనది. అట్లయ్యు, గద్యరచనము పద్యరచ

నము చాడ్పున యశఃప్రదము కాదని భావించి, మన యాంధ్రసోద రులు పూర్వమునుండి త్రొక్కుచున్న పుంతఁదక్క నవ్య పథమునఁ గాలిడఁ గడంగక, మన మాతృకకు గొప్పలోపముఁ గలిగించిరి.

అట్టి లోపమును బాప నభిజ్ఞుఁడనయ్యు, నేను పెక్కు గద్యనాటకముల వంగభాషనుండి, పరివర్తన మొనరించి మనభాషా యోషామణి కపూర్వ భూషల సమర్పింప నూహించి ప్రథమమున, నిరంకుశ పాండిత్య ప్రకర్షగల ద్విజేంద్రుని నాటకముల హృద్యముగనుండు తెలుంగునఁ దెలుఁగున వ్రాయఁ బూనితిని. భాషాసేవకులగు సుధీవరులు నాయుద్యమమును బహూకరించి, నాకుఁ దగు ప్రోత్సాహ మొసంగి వచనవాఙ్మయమును, సన్మాన పురస్సరముగ నాదరింతు రంచాశించుచుంటి.

పైనవ్రాసిన తెలుంగున, ప్రస్తుతాంధ్ర నాటకములవలె వంగ నాటకములు ద్విజేంద్రునకుఁ బూర్వము పౌరాణికములై, కేవలము గాథారాజితో నిండియుండ, నక్కవి సార్వభౌముఁ డైతిహాసిక వచన నాటకముల రచించి, మహాత్ములగు భారతీయుల సత్వగుణమున నగ్గలంపు నేర్పున నుగ్గడించి, తన మాతృభాషా భక్తితోబాటు మాతృదేశానురక్తిని గూడ వెల్లడించి నిజవాఙ్మయమున కద్భుతోత్కర్షనొనఁగూర్చినట్లు మన భాషకుఁగూడ మిగుల మేలుగూర్పఁ గలండంచు విశ్వసించి, నేనమ్మనీషు నాంధ్రప్రపంచమున విడుచుచుంటి. ప్రథమమున నేను ద్విజేంద్రుని నాటకములఁ బరివర్తించుట కిదియే హేతువని చదువరులు గ్రహింతురుగాక.

ద్విజేంద్రునకును షేక్స్పియరునకును పోలిక లనేకము లున్నవి. షేక్స్పియరు పదముల పగిదినే ద్విజేంద్రుని పదములును భావగర్భితములై యుండును. షేక్స్పియరు పాత్రలవలె ద్విజేంద్రుని పాత్ర

లుసత్యములు—భిన్న పాత్రో కల్పితములు కావు,(They are true but not fictitious) వర్ణనము (The delineation of different characters) లందుఁగూడ వారిరువురకుఁ బోలికగలదు. అజయసింహ మానసుల బొందు హేమ్లెట్టు వోఫీలియా వోథెల్లో డెస్డి మోనాల పరస్పర పవిత్ర ప్రణయమును దలపింపక మానదు. ఔరంగజేబు శౌర్యమియాగో, మేక్బెత్, రిఛార్డ్, మెడ్మండులను, జర్మనీసీమ కవీంద్రుఁడైన గెటేయొక్క మెఫిస్టొఫిలీస్ను జ్ఞప్తికిఁ దెచ్చును. సుజాము రాదులు గానరిల్ రీగాను లను, జాహనారా కార్డీలియాను, షాజహాన్ లియరును దలపింతురు.

ముఖ్యపాత్రలు కాని వానికిఁ (Minor characters) గూడ నీ కవిద్వయంద్వము ప్రాముఖ్యత నొసఁగెను. 'హేమ్లెట్టు' నందలి రోజెన్క్రాంజ్, గిల్డెన్స్టెర్న్లవలె నిన్నాటకమందలి షాజహాను అబ్దుల్లా మొదలైనవారు పాఠకుల లక్ష్యమును దాఁటిపోరు. ద్విజేంద్రుని "చంద్రగుప్త"ను జదివి, మాతృప్రణయము నెఱిఁగిన చదువరులు షేక్స్పియరు "కొరియోలేనస్" ను దలంపక మానరు.

షేక్స్పియరు కామిడీలను' (సుఖాంతములు) ట్రేజిడీలను(విషాదాంతములు) ప్రత్యేకముగ రచించినను, బెన్ జాన్సన్ మొదలైన యూది భాషా లేఖకుల(Classical writers)ననుకరింపక 'ట్రేజిడీ'లందక్కడక్కడ గామిడీ దృశ్యములుఁగూడ విషాదగర్భితంగు నీమీవారుపతనమున' నక్కడక్కడ హాస్యమయములగు నట్టి దృశ్యములు సూపట్టును. నభిరాలోచనపాత్రము (Reflective characters E. E. Hamlet, లుభయకవీంద్రుల నాటకములందును గన్పట్టును ఈకవిశిఖామణు లిరువురును, పెక్కు చారిత్రవిషయిక నాటకముల లిఖించిరి. తమనాటకము నుండి చదువరులే నీతిని గ్రహింపవలెనని వీరివురియభిప్రాయము.

పై నుదహరించిన పాత్రలయందు గొంతపోలిక కన్పట్టినను, అనుకరణలేదని మనము తలంప నగును. భిన్నసమయములందు భిన్న

సీమలందు, భిన్నస్థితులందు, భిన్నజాతికవివరులు రచించిన గ్రంథములందు భిన్నాభిప్రాయములుండక మానవు. ఇట్టిభేదాభేదములఁ బ్రత్యేకనాటక భూమికయందును, ఆయాపాత్రల గురించి చర్చించునవసరమున విస్పష్టముగఁ దెలుపయత్నింతును.

ధిషణాధురంధరుండగు ద్విజేంద్రుని నాటకములాంధ్ర గద్య వాఙ్మయము నుజ్జీవింపజేయునంచు దలంచి, నాయందుప్రమోదసమన్వితరచనాభారమును మోపి, ముద్రాభృతిభారమును వారుభరించి, నాకు ప్రేమతోమిగులఁ బ్రోత్సాహముం గూర్చిన భాషాభిమానులగు శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికిని, ఈపొత్తము నాంధ్రములోనికిఁ బరివర్తనమొనరింప సత్యాదరముతో నాకు ననుమతి నొసంగిన దిలీప్‌కుమార్ రాయ్‌గారికిని సదాకృతజ్ఞుఁడనై యుందును.

ద్విజేంద్రునిపల్కులఁ జిల్కలీలబల్కినను, ఈయువకుని వచన రచనయందనేక దోషములు గాన్పింపవచ్చును. గుణగ్రహణ పారీణులగు కోవిదులు కృపాపూర్వకముగ వానిదెల్ప బ్రార్థితులు.

కలకత్తా

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

౨౯-౮-౨౯

# ఈ రూపకమున వచ్చు ముఖ్యపాత్రములు

పురుషులు

రాణా అమరసింహుఁడు—మీవారు రాణా

సగరసింహుఁడు—అమరసింహుని పెద్దతండ్రి

మహబత్ఖాను (మొగలు సేనాధిపతి)—సగరసింహుని తనయుఁడు

అరుణసింహుఁడు (సత్యవతిపుత్రుఁడు)—మహబత్ఖాను మేనల్లుఁడు

గోవిందసింహుఁడు—రాణా అమరసింహుని సేనాపతి

అజయసింహుఁడు—గోవిందసింహునికుమారుఁడు.

హిదాయెత్ అలీఖాన్ అబ్దుల్లా—మొగలు సైన్యాధ్యక్షులు

మహరాజ్ గజసింహుఁడు—మార్వార్ దేశాధిపతి

హుస్సేను—హిదాయెత్ అలీఖానునధీనమందుండు నుద్యోగి

స్త్రీలు

రాణీరుక్మిణి—రాణా అమరసింహుని పత్ని

మానసి—రాణా అమరసింహుని తనయ

సత్యవతి—సగరసింహుని దుహిత

కల్యాణి—మహబత్ఖానునని గోవిందసింహుని కుమారి.

[illegible] వీరును కొందరు సైనికులు మొదలగువారును.

శ్రీ ర స్తు.

శ్రీపరమాత్మనేనమః

# మీ వా రు ప త న ము

## (The Down-fall of Mewar)

### ప్ర థ మాం క ము

ప్ర థ మ ద్రు శ్య ము

గోవిందసింహుని కుటీరము—మధ్యాహ్నసమయము

పుత్రసమేతముగ గోవిందసింహుఁడు నిలచియుండెను.

గోవిందసింహుఁడు—అజయా! మొగలాయిసైన్యము మీవారునాౘ్రమింపనరుదెంచుచుండెనని రాణాకెవరు దెలిపిరి?

అజయసింహుఁడు—అల్లైవరెఱిఁగించిరో నేఁదెలుపఁజాలను.

గోవింద—రాణాయేమనెను?

అజయ—సంధిసలుపుటయే తనదృఢేచ్ఛయని వచించెను, దానంజేసి మెల్లిప్రభాతమున జరుగఁబోవుసభకాతఁడు సామంతాదులనందఱి నాహ్వానించెను. నిన్నుగూడరమ్మని రాణావేఁడియుండెను.

గోవింద—నన్నురమ్మని బలవంతపెట్టుటెందులకు.

అజయ—మంత్రణంబొనర్చుటకు.

గోవింద—సంధివిషయమై కాఁబోలు ?

అజయ—అవును. తండ్రీ !

గోవింద—పూర్వ మెన్నఁడును నేను సంధిమంత్రణముఁ గావించియుం డలేదు! పంచవింశతివత్సరములాదిగ యుద్ధరంగమునఁ గ్రుమ్మరుచుంటి. ఖడ్గఝణంఝణారవములన, నశ్వహేషలన, భేరీభైరవనినదంబుల, నిశితవిశిఖపరంపరపరాక్ర్యధితసైనిక బృందహాహాకారంబుల, భద్రేభయూథబృంహితములమాత్రమే యెఱుంగుదుఁ గాని సంధివిధానమెఱుఁగను. ఆమాట యర్థమైన నాకుఁ జిత్తగోచరముగాదు.

(అజయసింహుఁడు—నీరవుఁ డయ్యెను.)

[నతోత్తమాంగుఁడై గోవిందసింహుఁడు క్షణకాల మేదియో యాలోచించి—"కుమారా! సంధిఁగావింపఁ దా నేల యిచ్ఛగించెనో రాణా నీకుఁ దెలిపెనా?"

అజయ—కతిపయవత్సరములనుండి మీవారురాష్ట్రము ధనధాన్యప్రపూర్ణమై, సుశ్యామలసస్యసమన్వితమై, సౌఖ్యాకరమై, జగచ్ఛోభాయమానంబై యుంటంజేసి. సమరసంక్షోభ మంకురింపఁజేసి, నే డారాష్ట్రమును రుధిరస్రవంతులఁ బ్లావిత మొనరింప జేఁడియ్యకొనుటలేదు.

గోవింద—అట్లని మొగలుపాదుషా పాదుకలఁ గైకొని యూదలఁ దాల్పవలయునా? తనయా! స్వర్గీయుఁడైన ప్రతాపసింహుని స్వేచ్ఛావృత నిష్కళంక ప్రదేశములను, విలాసామోదములు, బలిమిని లోఁబఱచుకొన్నపుడే మీవారుపతన మచిరకాలములో జరుగనున్నదంచుఁ దలంచితి. ఆత్మజుఁడైన యమరసింహుని కాలమున మీవారు పరిఖ మొగలాయి చరణవిక్రీతమగునని మరణసమయమున నామహాపురుషుఁడు వాక్రుచ్చెను. మొగలులిపుడు బలగర్వోన్మత్తులైయుండిరి. ఇత్తఱి సర్వాంబంతరించుట నిక్కువము.

అజయ—శక్తిమంతులైన మొగలుల నెదుర్కొనుట యసాధ్యమని తెలిసిగదే, మీవారు సీమయందు వృథా రక్తపాతమేల కావింపవలెనని రాణాపలికెను.

గోవింద — అజయా! నీయుద్దేశ్యముకూడ నట్టిదేయని దోఁచెడిని. ఓటమి గలుగునంచెంచి దాస్యశృంఖలాబద్ధుఁడ వగుట కియ్యకొందువా? కొలదినెఱుంగక ప్రాణములఁబాయ నిజగళమున రజ్జువుఁ దగుల్చుకొనెదవా! అజయా! మొగలాయి ఢిల్లీశ్వరుఁడని యెఱుంగుదును. తేనికిఁ బ్రతికక్షినై విద్రోహములు సలుపుట పాపంబని యెఱుంగుదును. కానిమీవారు రాజ్యమింకను, అన్యాక్రాంతము కానికతన సజీవుఁడై యున్నంతదనుక మహత్తరమైన స్వాతంత్ర్యమును విక్రయింప నీగోవిందసింహుఁ డిచ్ఛగింపఁడు. ఏడుశతాబ్దములనుండి భీషణవజ్రాఘాతముల నెన్నిటినో తుచ్ఛముగనెంచి, భయంకరఝంఝామారుతమును దిరస్కరించి దుర్గమంబైన మీవారుదుర్గప్రాకారమున సదర్పముగ నేరక్తధ్వజము నిలచి యుండెనో — నేఁడది తులువలైన మొగలులు రక్తారుణనేత్రముల విలోకించినంతమాత్రమున భూపతితమగునా! అట్లగుట యసంభవమని రాణాకెఱింగింపుము.

(అజయసింహుఁడు వెడలిపోవును)

అజయసింహుని ప్రస్థానానంతరమున గోవిందసింహుఁడు భిత్తికపై వ్రేలాడు కోశబద్ధకరవాలమును నిజకరములఁగైకొని యొరనుండి వెలికిఁదీసి దానినుద్దేశించి—"ప్రియసహచరా! నీవు నాకరమునందున్నంతకాలము మహారాణా ప్రతాపసింహున కపయశము రాకుండుగాక. ప్రియతమా! ఇన్నిదినములనుండి నిన్నుమఱచితిని. దానంజేసియే కాఁబోలు నీవు త్రుప్పువట్టి యుంటివి! మిత్రమా! యుద్రేకమునొందకుము. నిన్నిమాఱు మీవారుసమరరంగమునకు నిమంత్రణమొనరించెదను. మొగలుల యుష్ణరుధిరమును బానమొనరింతువుగాక! ప్రాణాధికమా నన్నుమన్నింపుము! నన్నాలింగనమొనరించుకొమ్ము!" అనిపలికి దాని నతఁడు నిజవక్షోభాగమందిడుకొని, బిదపఁ బైకెత్తి, ఝుళిపింప గమ

కించి) "ఇదేమి! కృపాణమా! కరములు కంపించుచున్నవి! ముదుసలినైన కతననింక నీగౌరవ మేనుగాఁపాడఁ జాలకుందునేమో" అని ఖడ్గమును పార్శ్వతలమునం దుంచి, విచారించుచు గూర్చుండెను. అతని నేత్రములనుండి యశ్రుబిందువులు రాలుచుండును. అపుడాతని కూతు రచటికివచ్చెను.

కల్యాణి—తండ్రీ! అదేమట్లుగూరుచుండిరి?

గోవిందసింహుఁడు—కల్యాణీ! నీవువచ్చి యెంతసేపైనదమ్మా!

కల్యాణి—నాయనా! నేనిపుడేవచ్చితిని. నేఁడేలమీరు సమీపమునఁ గరవాలముంచుకొని యుండిరి? దానినిజూచిన నాకు భయమొదవు చున్నది. మీమూర్తి నన్ను మిగుల బెగ్గిల్లజేయుచుండెను. తరవారి నొరయందుంచి వైచుడు.

కరుణాదృక్కులఁ గృపాణముపైఁ బఱపుచు, గోవింద సింహుఁడు తనయ నుద్దేశించి,—"అమ్మా! భయమేల? అదిసుంద రమై గన్పట్టుచుండుటలేదా? అక్కరవాల మేమి గోరుచుండెనో యెఱుంగుదువా?"

కల్యాణి—దేనిని గోరుచున్నది?

గోవింద—రుధిరపానమును?

కల్యాణి—ఎవరి రుధిరమును?

గోవింద—మునల్మానుల రుధిరమును.

కల్యాణి—జనకా! మునల్మానులపై మీకింత కినుకయేల?

గోవింద—ఎందుకా! ఎందుకో నీజన్మభూమియైన మీవారునడుగుము. ఏడువందల వత్సరములనుండి మనరాష్ట్రము నాక్రమింప రక్కసుల భంగి మనపై దాడివెడలుచు, శైలాపహతనీరధితరంగముల చాడ్పునఁ బరాహతులై ముష్కరులైన మునల్మానులు తరలిపోవు చుండిరి! మీవారొనరించిన యపరాధమెట్టిది! దురహంకారము

కనుల గప్పివైచుతఱి న్యాయపథము గన్పట్టఁజాలదు. తత్పథమును దృగ్గోచరమొనరింపదగు సాధన మీ యాయుధమే!—కాని ప్రియపుత్రీ! నేనిపుడు మిగుల వృద్ధుఁడనై పోతినిగదా [అట్లని యతఁడొక నిట్టూర్పును విడచెను. పితృవచనముల నాలించి కల్యాణి వెక్కి వెక్కి యేడ్వదొడంగెను.]

గోవిందసింహుఁడు—కల్యాణీ! విలపించుచుంటివేల? భీతిల్లితివా యేమి? కరవాలము నొరయందుంచి వైచుచుంటిని. భయమొందకుము. తల్లీ! లోనికరుగుము. నేనిప్పుడ వచ్చెదను.

[వెడలిపోవును.]

కల్యాణి—యశశ్చంద్రికలు! ముసల్మానులు!! రాజ్యలక్ష్మి!!! మీ వారు!!!!

(నిష్క్రమించును)

## ద్వి తీ య దృ శ్య ము

### ఉదయపురపథము—అపరాహ్ణ సమయము

చారణీసమేతయైన సత్యవతి యీగీతిరునగాన మొనరింపఁగాగెను.

### గీ తి.

ఏడునూఱుల వర్షము ల్దాడివచ్చు
పగఱనందఱఁ దఱుముచు బవరమందు,
సర్వకాలములందును జనులు పొగడ,
విజయభేరిని మ్రోగించి విశ్వమందు,
పద్మినీ బప్పల యశమ్ముఁ బరగనెల్ల
సీమల వెలుంగఁజేసి దుశ్శీలురైన

మ్లేచ్ఛశిరాపల దునుమాడి, స్వేచ్ఛాధ్వజము
నిలువఁబెట్టెను రసపుత్ర నివహమిలను.
బరవసంబున రణశిఖిజ్వాలలందు
లంఘనం బొనర్చిన వీరసంఘములును
నింగినంటెడు పర్వత శృంగములును
వింతగానము సల్పు శకుంతములును
చెలువు నొనగూర్పగా యశ స్తిలకమగుచు
సౌరభ మొసంగు, చల్లని మారుతమును
పర్వఁజేయుచు దుర్గపు పరిఘపైన
దివ్యజ్యోత్స్న ప్రదీప్తమై దిశల వెలిఁగి,
సుందరంబైన జవ్వని చందముననుఁ
గమ్యమైయుండె మీవారు రాజ్యమిలను.

(ఈసమయమున నజయసింహుఁడు ప్రవేశించెను)

సత్యవతి—నీవొక రాజసైనికుఁడవు గావా?
అజయ—అవునమ్మా! నేను మీవారు సైన్యాధ్యక్షుఁడను.
సత్యవతి—కొంచెము సేపు నిలువుము. నిన్నొక విషయము ప్రశ్నింపఁ దలఁచుచుంటిని. నేను వినినదంతయు నిజమా.
అజయ—జననీ! ఏమివింటివి ?
సత్య—మొగలుసైనికులు మీవారు నాక్రమించుకొనిరని.
అజయ—ఇంకను ఆక్రమించుకొనలేదు. కాని రాణా సంధిఁ గావిం కున్నచో వారలు నిక్కువముగ న ట్లొనరించెదరు. రాణా యాహవమునకుఁ దొడఁగునో లేకసంధిఁగావించునో యెఱుంగ వెం గలు సేనాధిపతి మాతనొకనిఁ బుత్తెంచెను.
సత్య—మీరలందఱు సమరసంసిద్ధులై యుంటిరా?

అజయ—మేము రాణాయాజ్ఞానువర్తులము. రణమైనను, లేక సంధియైనను తేనిముదలననుసరించియే గదా జరుగును!

సత్య—రాణా పోరుసలుపునో లేక పొందుసలుపునో నీ వెఱుంగుదువా?

అజయ—సంధిఁ గావింపవలయుననియే రాజుతలంపు. ఆవిషయమున నాలోచన సేయుటకై మాజనకునిఁగొని రమ్మని రాణా నన్నంపెను.

సత్య—నీజనకుఁ డెవరు?

అజయ—మీవారు సేనాపతియైన గోవిందసింహుఁడు.

సత్యవతి—అట్లా! గోవిందసింహుఁడు నీజనకుఁడా? అతని యుద్దేశమేమియో యెఱుంగుదువా?

అజయ—ఖండన మొనరింపవలయుననియే!

సత్యవతి—బాగుబాగు! అజయా! మీకువిజయము సేకూరుఁగాక! ఇఁక నీవరుగవచ్చును.

[అజయసింహుఁడు వెడలిపోవును.]

సత్యవతి—సంధియా! రాణాప్రతాపసింహుని పుత్త్రుఁడు నిక్కువముగ మొగలాయీలతో సంధిఁగావింప గమకింపఁగలఁడా! అసంభవ మసంభవము! నిశ్చయముగ నిది భ్రాంతియని దోఁచెడిని. చెలికత్తెలారా! మీరలీచెట్టుక్రింద నాకొఱకై వేచియుండుఁడు. నేనిప్పుడమగుడి యరుదెంచెదను.

[సత్యవతియు పాటకత్తెలిరుకెలంకులకు నిష్క్రమించిరి.]

## తృతీయదృశ్యము

ఉదయపురమందు మీవారు రాజసభ—ప్రభాతకాలము రాణా ప్రతాపసింహుఁడు సింహాసనాసీనుఁడై యుండెఁ; ఉభయపార్శ్వములందు

సామంతు లుచితాసనములపై నాసీనులై యుండిరి. గోవిందసింహు డొక ప్రక్కగా, నిలువంబడి యుండెను.

అజయసింహుఁడు—రాణా! మొఁగలాయీలు మీవారుద్వారమున సమీపించినప్పుడు, రసపుత్రులందు నభిప్రాయభేద మేమియునుండ నేరదు. గాన భండన మొనరించుటే మనకర్తవ్యము!

రాణా—జయసింహా! భారతాధిపతియైన జహాంగీరుపాదుషావారి యనంతసేనాసమూహముల సమ్ముఖమున మన జానపదానీకము నిలువంబడి యుద మొనరింపఁగలుగునా? అందులకుఁదగు సాహసమేది?

కేశవరావు—ప్రభూ! సాహసమేదంటిరా! క్షత్రియవీరులకు సాహసము కొదువయా?

కృష్ణదాసు—నృపా! స్వర్గీయులైన భవజ్జనకు లెట్టి సాహసమున మొగలుశూరులఁ దునుమాడ నుంకించిరో మఱచితిరా?

రాణా—ప్రతాపసింహుఁడు మానవమాత్రుఁడని తలఁపకుము.

శంకరుఁడు—మర్త్యుఁడు గాకేమి! ఆయశశ్శాలి రసపుత్రకులసంజాతుఁడేకదా!

రాణా—శంకరా! కాదు! ప్రతాపసింహుఁడు. రసపుత్రకులోద్భవుఁడుకాఁడు. భగవచ్ఛక్తి భంగి—అభ్రవజ్రసంపాతములీల—పృథ్వీకంపముకరణి—మహార్ణవసలిలోచ్ఛ్వాసము పగిది ఆ విక్రమశాలి మనకులమం దవతరించెను. ఎందుండివచ్చెనో, యెందరిగనో యేరును దెలుపఁజాలరు. శంకరసింగూ! ఎల్లరు ప్రతాపసింహులు కాఁజాలరు.

కృష్ణదాసు—అందఱుఁ బ్రతాపసింహులు కాఁజాలరనుట నిక్కవమే. కాని ప్రతాపసింహుని యాత్మజుఁడు తనజనకుని యడుగుజాడల ననుసరింపఁ జాలఁడని నేఁ దలంపను. ప్రతాపసింహుఁడు

మీవారు స్వాతంత్ర్యరక్షణార్థమై తనప్రాణముల విడిచెను. నేఁడ తని పుత్రుఁడుపోరు సలుపకయే దాస్యమునుస్వీకరించునా?

రాణా——కృష్ణదాసూ! తండ్రిగా రనుభవించిన వన్నియుఁ దనయులకు సాధ్యము లగునా! కొన్నియేండ్లనుండి మీ వారు రాష్ట్రీయులు సుఖసంపన్నులై గాలము పుచ్చుచుండిరి. రాజ్య మంతయు శాంతిధామమై యుండెను. తండ్రిగారి కష్టభూయిష్టజీవితము ననుసరించుటకై నామమాత్ర శుల్క మొసఁగినచో శత్రువు యుద్ధమునుమాని వెనుదిరిగిపోన సమ్మతించునపుడు శాంతినికేతనమై తనరు మీవారు సీమను రణసంక్షోభిత మొనరించిన రక్తనదుల కాలవాలముసేయ నాయుల్లమొల్లకున్నది.

శంకరసింగు——ప్రభూ! శుల్క మియ్యనియ్య కుందురా? శుల్క మొసఁగు టెవరికి? మొగలాయీలకా? మొగలాయీ లెవరు? ఎందుండి వచ్చిరి? ముష్కరతురుష్కుల సజాతు లేయధికారమున రఘుకులోద్భవులకడనుండి సుంకముఁ గొన సాహసింతురు?

రాణా——శంకరా! ఒకించుక విత్తమొసఁగి శాంతిరక్షణ మొనరించు టుత్తమమా లేక దాని నీయనొల్లక దేశము నల్లకల్లోల మొనరించు టుత్తమమా? గోవింద సింహా! నీవేమిచెప్ప నూహించితివి.

(గోవిందసింహుఁడు చమకితుఁడై గంభీరస్వరమున నిట్లు పలుకసాగెను) "రాణా! చెప్పుట కేమున్నది? ఇత్తఱి యుక్తియోచనములు నాకు సాధ్యములుగావు. శాంతిస్వచ్ఛందత లేవియో నే నెఱుఁగను. దుఃఖ మొక్కటియే నాకవగతమై యుండె! శైశవమాదిగ నార్తితోడనే నేను సఖ్యము నలిపితిని? విషాదోత్సంగమునందే నేను లాలితుఁడ నైతిని. పంచవింశతి వత్సరములేను ప్రతాపమూర్తియైన ప్రతాపసింహు ననుగమించి, రేబవళ్లు ఘూకసూ కర్త

హార్యత్. కరాళవ్యాళ భయంకర గహనాభ్యంతర సీమలందున భీకరశైల శిఖరములందును, దుస్సహక్షుత్పిపాసాతపవర్షములక లోనై, నిద్రారహితుడనై సంచరించితిని. ఆ యిరువదియైదు వర్ష ములు నేనామహాత్ముని చరణప్రాంతమున నుపవిష్టుండనై దా ద్ర్యవ్రత మొనర్ప నభ్యసించితిని. ఆకాలమున దుఃఖజనిత పరమ సుఖము ననుభవించితిని. అదెట్టి సుఖము! పరార్థానుభూతదుఃఖా పాదిత సౌఖ్యమెంత యనిర్వాచ్యమైనది! కర్తవ్యార్థమై దారిద్ర్య తిని వరించుటెంత ప్రమోదదాయకము! దారిద్ర్య నిలయంబులై గుటీరోపరిభాగములందు, ప్రభాతారుణస్వర్గకాంతి ప్లావితమై ప్రగాఢప్రణయసలిలము మఱెందును గానరాదు. ప్రభూ? నేనట్టి యాలయంబులనేకాలముం బుచ్చితిని!"

జయసింహుఁడు—గోవిందసింహా! ఊరకుంటివేమి? నీపలుకు లుద్రేక మును జనింపఁ జేయుచున్నవి. వచింపవలసిన దంతయు వచిం పుము.

గోవిందసింహుఁడు—జయసింహా! యింక నేను వచింపవలయును తదుపరి—సురనికేతనములైన మీవారు సుఖావసథముల విధ్వం సాసురునకెరఁ గావించి, తత్ప్రదేశముల దుర్జనులు నాట్యభవనము లను నిర్మించిరి! అమ్మహాత్ముని మందిరము జూర్ణీభూతమైపోయి నది. తద్గృహాంతర శుభ్రప్రస్తరఫలకము లున్నతప్రాసాద శృంగా రవేదిక లయ్యెను! ఆదిగంత విశ్రాంత కీర్తిమంతుని మహాత్యాదా ర్య ప్రతాపాది సద్గుణముల నుద్ఘోషించు జయధ్వానములచే ముఖ రితములైన, ధరాధరదరీద్వారపరిసరస్థానములందును, శైలశీతచ్ఛా యాలంపును, వికాసనికుంజ వనములకుఁ దోడు విలాసమంది రము లెన్నియో యిప్పటున గన్పట్టుచుండెను! నాతీక్ష్ణదృక్కులకు ఆమహాత్వము క్షీయమాణమై యభసీమఁ దాకుచున్నట్లు

దోఁచుచుండెను! సర్వంబంతరించెను! జయసింహా! యిఁకేమున్న
దిః? ఇత్తఱిఁ బ్రాచీనమహిమ తేజశ్శేషము మాత్రము దృగ్గోచర
మగుచుండెను!—అంతరించుచున్న యశము మృత్యుశయ్యా
శాయియై మనపై నిష్ఫలకరుణ దృక్కుల సారించుచు నిప్పట్టు
న రుద్ధశ్వాసావస్థయం దుండెను!

కేశవరావు—గోవిందసింహా! నీవు సజీవుఁడవై యున్నంతకాల మా
మహిమము మ్లానము కాఁజాలదు!

గోవింద—సజీవుఁడనే! కాని యిప్పుడేనేమి కావింపఁగలను! పూర్వదిన
ములు గడచిపోయినవి. ముదుసలినైతిని! జరావికంపితమగునా
పాణితోఁ గృపాణ మవలీలగ లేచుటలేదు. అస్థిపూర్ణమైన యీ
శరీరపంజరము కంపించి పోవుచుండెను! నిలుచియుండుట నాకసాధ్య
ముగఁ గన్పట్టుచుండె! ఏమని వక్కాణింతును! నిదాఘభాస్క
రోజ్జ్వల దివాలోక మిఁక నీచ్ఛాయాధూసరిత జగంబును దీప్తము
నరింపఁ జాలకుండెను! అట్లయ్యు నీవారు దేశమాతకొఱకై
మాధుర్యదుఃఖము ననుభవించుచు, భ్రాతృబృంద సేవార్థమై చిత్త
తాపమొందుచు, ఆశైలకందరములందు, ఆమహీధరోపత్యక
లందు, ఆసాంద్రప్రాంతగసీమలందుఁ బరిభ్రమణ మొనర్ప నేని
పుడు కూడ నుష్వేళులూఁచుచుంటి! (నభంబువైపుగ దృష్టిసారించి)
నిర్మలప్రభావిభవుండవగునో జగదీశా! నాదుఃఖసహనశక్తినే, నీవు
క్షీణ మొనరించుచుంటివేమి?

(గోవిందసింహుఁడు నీరవుఁడు కాఁగనే సభికులందఱుఁ గొంత
పు స్తబ్ధులై యుండిరి.)

రాణా—కాని గోవిందసింహా! ఆర్యావర్తమంతయు మొగలుచక్రవర్తి
మకుటమున మోకరించి యుండెను! రాజపుత్రస్థానమం దీక్షుద్ర

మీవారుజనపదం బొక్కటి విశ్వజైత్రములైన మొగలు ముల ముందు నిలచి యేమొనర్చును? ఏమనెదవు గోవిందసిం

గోవింద—నేఁ జెప్పఁదలఁచిన దంతయు నీవరకే చెప్పివైచితిని. ఇ నేఁ బలుకున దేమియు లేదు.

రాణా—సామంతులారా! రణము నిష్ఫలమని నాకుఁ దోఁచుచున్న ది. మొగలాయి సేనాధిపతితో సంధికై యోచన మొనరింతము. దౌవారికా! మొగలుదూత నిటకుఁ బిలువుము.

[దౌవారికుఁడు వెలుపలకు వెడలును.]

గోవిందసింహుఁడు—ప్రతాపసింహా! రసపుత్రకులసింహా! స్వర్గమం దున్న నీకర్ణములందీ వచనములు చొరకుండుగాక! వజ్రమా! భయంకర నిర్ఘోషమున సింహనోచ్చారణము మిళితమై పోవుగా మీవారు రాజ్యసతీతిలకమా! మొగలుప్రభుత్వ శాసనమును స్వీ రించుటకుఁ బూర్వ మీవాక భీషణ భూకంపమున ధ్వంసమైపో దువు గాక!

(మొగలుదూత ప్రవేశము)

రాణా—మొగల్ సైనికుఁడా! మేము సంధిఁ గావింప సంసిద్ధులమై యుంటిమని నీవు మీసేనాధిపతి కెఱింగింపుము.

[తొందరగాఁ బ్రచ్ఛన్న వేషధారిణియై సత్యవతి సభాస్థలమునఁ బ్రవేశించును.]

సత్యవతి—అట్లుగాదట్లుగాదు! సామంత మహీపతులారా! సంధిసం పుటకుబదులు సమరము సలుపసంసిద్ధులరైయుండుఁడు. ఆహ వరంగమునకు మిమ్ముఁ దోడ్కొనిపోవ తేఁ డిచ్చగింపనిచో సేనా పత్యమువహించి నేనే మిమ్మచటకుఁ గొంపోదును!

గోవిందసింహుఁడు—రసపుత్రరమణీవతంసమా! నీవెవ్వతెవు!—నీనా మమేయ్యది? ఈఘనాయమానాంధకారమున స్థిరవిద్యుల్లతవమువు

నిచ్చోటి కరుదెంచిన నీవు రసపుత్రాంగనవంచు దలంపరాదు— మమ్ముద్ధరింప దివినుండి యవతరించిన దేవకాంతవా యేమి! వజ్ర ఘోషసంకాశకంఠధ్వానముగల నెలంత వీవెవతెవు?

రాణా—ఈమె నిక్కముగ దివ్యాంగనవోలెఁ గన్పట్టుచుండెను. (సత్యవతినుద్దేశించి) రమణీమణీ నీవెవ్వతెవు?

సత్యవతి—మీవారుభర్తా! నేను దేవకాంతనుగాను— గాయనిని! మీవారు రాష్ట్రస్థితజన పదారణ్యసీమలందును, గిర్యుపత్యకాప్రదేశములందును మనరాజ్యలక్ష్మిం గూర్చి గానమొనరించుచుఁ బరిభ్రమణ మొనరించుచుందును. చారణిసని మాత్రము మీర తెఱింగి నఁ జాలును.

సామంతులు—ఆశ్చర్యమాశ్చర్యము!

సత్యవతి—క్షత్రియశూరులారా! తేఁకుదయసాగర ప్రసాదోద్యానలతానికేతనములందలి హంసతూలికాతల్పములందు శయనించి విలాసస్వప్నములఁ గాంచినఁ గాంచనిండు! కాంతనయ్యు, మిమ్ముల నేను గదనరంగమునకుఁ దోడ్కొనిపోదును.

గోవిందసింహుఁడు—ఇదేమియాశ్చర్యము! నవ యౌవన తేజము మరల నాశరీరమునఁ గన్పట్టుచున్నది! ఆహా! ఎంతయానందము. ఏమి యీ యుత్సాహము!—"శూరశిఖామణులారా! ప్రతాపసింహుని పుత్రుని నపయశోనల జ్వాలలనుండి రక్షింపుఁడు! విలాసమునంతయు దూరీకృత మొనరించుఁడు. శృంగారఖేలనల, నంత మొనరింపుఁడు" అనిపలికి యొక యినుపముక్కను దీసి, మందిరమందున్న పెద్దయద్దముపై విసరివైచెను. అద్దము ముక్కలై పోయెను. గోవిందసింహుఁడు "సామంతులారా! సింగార మంతరించుచున్నది. శీఘ్రముగ శస్త్రాస్త్రాదులఁ గైకొని, ఖండనభీములై కదనభూమిఁ దూకరండు.

రాణా—గోవిందసింహా! ప్రథమమున నే నట్లు లంఘింప గమకించెదను! మొగలుదూతా! మేము సంధిగావించుకొనము. పోరొనర్చెదము! సామంతులారా! అశ్వములఁ గైకొని రణార్థమై రండు!

సత్యవతి—జయ్! మీవారు రాణాకు జయ్!!

సామంతులు—జయ్! మీవారు రాణాకు జయ్!!

(పిదప కరతాళధ్వనులతో సభ ముగిసెను.)

---

I quote with advantage the perallel passage from the Annals of Mewar:

"A magnificent mirror of European fabrication adorned the embryo palace. Animated with a noble resentment at the inefficacy of his appeal to the better feelings of his prince, the chieftain of Saloombra (Viz. Govinda Sinha) hurled 'the slave of the Carpet' (a small brass ornament placed at the corners of the carpet to keep it steady) against the splendid bauble, and starting up seized his sovereign by the arm and moved him from the throne. "To horse, chiefs!" he exclaimed and preserve from infamy the son of Pertaps." A burst of passion followed the seeming indignity, and the patriot chief was branded with the harsh name of traitor, but with his sacred duty in view, and supported by every vassal of note, he calmly disregarded the insult. Compelled to mount his steed, and surrounded by the veterans and all the chivalry of Mewar, Umra's (Amarasinha's) passion vented itself in tears of indignation. In such a mood the cavalcade descended the ridge, since studded with palaces, and had reached the spot where the temple of Juggernath now stands, when he recovered from this fit of passion: the tear ceased to flow, and passing his hand over his moustache (This is signal both of defiance and self-gratulation), he made a courteous salutation to all, entreating their forgiveness for this omisson of respect, but more especially expressing his gratitude to Saloombra, he said,

చతుర్థదృశ్యము

ఆగ్రాయందు మహాబత్ఖానుగృహము—ప్రభాతకాలము. (సేనాధిపతియైన మహబత్ఖాను మొగలుసైన్యాధ్యక్షుఁడైన యబ్దుల్లాతోఁ బ్రసంగించుచుండెను. ఇరువురు నిలచియే యుండిరి.)

మహాబత్ఖాను—హిదాయత్ క్రొత్తగా సేనాధిపతి యయ్యెనా?

అబ్దుల్లా—అవును.

మహాబత్—హిదాయతే! నీ వావిషయమును నిక్కువముగ నెఱుంగుదువా ?

అబ్దుల్లా—నిక్కువముగనే యెఱుంగుదును. చక్రవర్తియేఁ బదివేల సైనికుల వాని యధీనమం దుంచెను.

మహాబత్—హిదాయత్ సేనాధిపతి యగుటయా! ఆశ్చర్య మాశ్చర్యము! ఇక్కాలమున సామర్థ్యమునకుఁ బురస్కార మలవడుట లేదు తిరస్కారము గలుఁగుచున్నది. విసర్జితార్ద్ర పదార్థముల నుండి విశేషముగ మృత్తిక బయల్వెడలుతెఱంగున నికృష్టులై యుండు మనుజులు మాన్యత నొందుచుందురు!

---

"lead on, nor shall you ever have to regret your late sovereign" Elevated with every sentiment of generosity and valour, they passed on to Dewier, where they encountered the royal army led by the brother of the Khankhanan, as it entered the pass, and which, after a long and sanguinary combat. (This is referred to in this very Act), they entirely defeated (S. 1664, A. D. 1608). Referring to this Victory Tod says "A feverish exaltation was the fruit of this victory, which shed a hectic flush of glory over the declining days of Mewar, when the crimson banner oncemore floted throughout the province of Godwar."

అబ్దుల్లా—స్వామీ! మీరు నిజము బలికితిరి. హెదాయతలీఖానున కుత్కృష్టపద మలవడుటకు గారణము లేకపోలేదు—అతఁడు చక్రవర్తి భగినీపుత్రుఁడు. మఱియు—

మహబత్—ఔశ్లేకానిమ్ము! కాని మొగలువాహినుల నడపుట సుకరమగు కార్యముగాదు—అతని శౌవమరఁదియైన యేనాయత్ఖాను వాని ననుసరించి పోవుచుండెనా?

అబ్దుల్లా—పోవుచుండెననియే శ్రోచెవిని.

మహబత్—ఏనాయత్ఖాను యుద్ధనిపుణుఁడగుట నిక్కువము. చక్రవర్తి హెదాయత్ఖానును నామమాత్రము సేనాధిపతిగఁజేసెను కాని యెనాయత్ఖానే నిక్కువముగ సైన్యమున కధిపతియయ్యెనని నమ్మెదము.

అబ్దుల్లా—పేరునకుమాత్రమే సేనాపతియైయున్నను, రణఘోషము చెవులఁబడినప్పుడు పరువిడకుండ నిలువంబడి యుండవలయుఁగదా;

మహబత్—తాఁదలఁచిన దైవోయెను. కానున్నది కాకమానదు—మీవారురణమున నేమిజరుగనున్నదో యది మొదటనే తెలియ వచ్చుచుండెను.

అబ్దుల్లా—మీవారుకదనమునకు రమ్మంచు జక్రవర్తి మీకు మునల నొసఁగలేదా?

మహబత్—ఒసఁగెను సాహేబూ.

అబ్దుల్లా—కాని ఘోరసమర్ప మీరు పోలేదేమి?

మహబత్—మీవారు నాజన్మభూమి. వంగ, విహారకళింగ దక్షిణాత్య కాబూలు మొదలగు రాజ్యములపై దాడివెడలఁ జక్రవర్తి నన్నాజ్ఞాపించియుండినచో, నేనట్టియానను ల్లంఘింపకుండెడివాఁడను—కాని మీవారుపై దండెత్తుటకు నాయుల్ల మొల్లకున్నది.

అబ్దుల్లా — మీవాసవాసులగు మీరట్లు దలచుట సహజమే. ఖాన్ సాహేబూ! చాల విలంబనమాయెను. ఇఁక నేను సెలవు గైకొందును — సలాము. సలాము.

మహబత్ — సలాము.

[అబ్దుల్లా వెడలిపోవును.]

మహబత్ — హెదయదలీఖానువంటి భీరువు సేనాధిపతియగుట మిగుల వేడుకగ గన్పట్టుచున్నది! చూడఁజూడ నీచందమంతయు భిక్షువునొకనిఁబట్టి తెచ్చి యలంకృత సైంధవరాజముపై నాసీనుఁ జేయు చందమున నున్నది! (నిష్క్రాంతుఁడగును)

పంచమదృశ్యము

మొగలుశిబిరము — మధ్యాహ్నకాలము

[మొగలు సైన్యాధ్యక్షుఁడైన హెదాయదలీఖాను, హుస్సేను సైనికునితో శిబిరప్రాంతమున బ్రసంగించుచుండును.]

హెదాయత్ — హుస్సేనూ! ఈ కాఫరులను, దునుమాడుట లడ్డులను మ్రింగుటకంటె సులభము కాదా?

హుస్సేను — మీ రనుకొనుచున్నట్లదంత సుకరమైన కార్యముగాదు. గడచిన యేనూఱేండ్లనుండియు నీచిన్న జనపదమే బహువిస్తీర్ణ తురుష్కసామ్రాజ్యముతో సమముగఁ దలయెత్తుకొని యున్నది. ఎవ్వరుగాని దానికిఁ దలవంపుఁ గూర్పనేరరైరి. బలోపేతుఁడైన యక్బరుచక్రవర్తికిఁగూడ నక్కార్య మసాధ్యమై జూపట్టెనన్న నక్కజ మేమియు లేదు.

హెదాయత్ — అక్బరుచక్రవర్తియా! బలోపేతుఁడా! బాగు బాగు! అతని సేనానులందఱు శూరులుగాక భీరులైయుండ నాకార్య మతనికి సాధ్య మెట్లగును! అప్పట్టున శ్రీహెదాయదలీఖాను

వంటవాఁడు—బాబూ! బాగుగానే తయారుగావించితిని!

హిదాయత్—తయారుగియారు కాదు. రణమొనరింపవచ్చెదవా?

వంటవాఁడు—బాబయ్యా! నాకేమియు రణబాధలేదు! నాకేమియు మందునలదు! నాకీ బ్రదుకుపై నాసలేదు!

హిదాయత్—(నవ్వుచు) పోరొనర్చెదవా?

వంటవాఁడు—అప్పుడేవచ్చి చెప్పినదా! అయ్యగారూ! నాయందే దోషములేదు. ముందుగఁ బోర్లాటఁ బెట్టినదదియే! ఇఁకన న్నింట నుండనీయదఁట! దానికేమియు జాలిలేదు! ఛీ,చీపురుకట్ట! అయ్యా! చూడండివీపు! దీనికేమిలెండీ! క్షమించండీ! పులావుగూడఁ జేసినాను! బేగిరండి!

[బధిరుఁడైన సూదుని పలుకులకు గడుపుబ్బనవ్వుచు]

హిదాయత్—ఓపరాక్రమశాలీ! పులావును తయారుగావించితివా. సంతసము సంతసము!—ఇఁక మేముకూడఁ బులావును లావుగఁ దయారొనరించెదము. నీవిఁక వెడలిపొమ్ము—నేనిదె వచ్చుచుంటి.

[వంటవాడు వెక్కి వెక్కి యేడ్చుచు వెడలిపోవును.]

హిదాయత్—హుస్సేనుసాహేబూ! ఈపర్యాయము పులావుగావింతుముగాదా?

హుస్సేను—ఏమిపులావు?

హిదాయత్—ఏమిపులావందువా? రసపుత్రులను పులావు! నరపలలముచేఁ బచితమగు పులావు రుచియెంతయో నీవీవరకు నెఱుంగవుగాఁబోలు!

హుస్సేను—స్వామీ! నన్ను మన్నింపుఁడు. ఈవిషయమున మీరు తలఁచినట్లు నేఁదలంపఁజాలను.

హిదాయత్ — హుస్సేనూ! నీవింకను అశిక్షితుఁడవై యుంటివి ఈయొక్కమారే నీవు నన్నునుగమించితివి. యుద్ధమున నేమో యాపర్యాయమైన బాగుగనెఱుంగుము. మున్ముందు జాల నవసరముండవచ్చును!

హుస్సేను — ప్రభూ! చిత్తము చిత్తము! మీబోఁటి మేటి వీరులకు రసపుత్రుల నిర్జించుట దుష్కరముగాదు! కాని మత్తమాతంగములే మసీయుచుండ మశకములపని యేమికావలయునో యనిచింతించిన వారల మగుదుము!

హిదాయత్ — హుస్సేనూ! నీవసమ్మాననూచక ప్రలాపము లాడుచుంటివి. నేను సేనాధిపతినం చెఱుంగుము! ఇచ్చవొడమిన నీశిరము ను వేయి వ్రక్కలుగఁ బగులఁగొట్టింపగలుగుదును!

హుస్సేను — స్వామీ! మీకట్టిసామర్థ్యమున్నదని నేనెఱుంగుదును. వాహినీపతులగుటచే మీరేకార్యమునైనఁ జేయఁగలుగుదురు

హిదాయత్ — అవును. నేను వాహినీపతిని. ఆవిషయమై విస్మృతి నొందకుము!

హుస్సేను — ప్రభూ! అట్లే! కాని మీవారు ఆక్రమణము—

హిదాయత్ — ఛీ! నోరు మూసుకొనుము! మరల మీవారాక్రమణ మనుచుంటివేమి? హుస్సేనూ! నీవు నాయనుఁగుసంగడికాఁడవగుటంజేసి జెప్పుచుంటిని—మీవారు నాక్రమణ మొనరించుట కర నిముసముకాలమైనఁ బట్టదు! హుమ్మంచు నొక్కమారులంఘించిన, దుర్గాభ్యంతరమున కరుగఁగలము!

హుస్సేను — అట్లయిన, నాలంఘనమాంజనేయలంఘనమై యుండఁ గలయునని దలఁచెద!

హిదాయత్ — (పరధ్యానమనస్కుఁడై విని) యీకార్యఫల మెఱుం

గుట కింజన మవసరము లేదు. తలఁచుకొనుటయే తడవు! ఇఁక నీవరుగుము. నేను భోజనమునకై పోవలయును.

[హుస్సేను ప్రస్థానోద్యుక్తుఁడగును. హేదాయతు వానిపై దన వాఁడిచూపులఁ బఱపి, కొంతదూరమరిగినపిదప వానిని వెనుకకు బిలచి,]

"హుస్సేనా! నేను సేనాధిపతినను విషయమును నీవు మఱచి పోకుముసుమీ!"

హుస్సేను—ప్రభూ! చిత్తము చిత్తము!

హేదాయత్—ఇఁకఁ బొమ్ము.

హుస్సేను—(తనలో) "సేనాపతివో లేక సైతానుపతివో నేనెఱుఁగక పోలేదు. పలలాన్నరాసుల భాగుగ మెక్కుటయు దీవు వానిఁగాంచితివి! నీకుఁ బ్రాయశ్చిత్త మచిరకాలములోనే జరుగు"

[అనుకొని వెడలిపోవును.]

హేదాయత్—ఈకాఫరులను జయించు టేపాటికార్యము! భేరీనినద మొకించుక కర్ణగోచరమైనమాత్రమున రసపుత్రులంద ఱు దమ కాళులకు బుద్ధిసెప్పి నిమేషమాత్రమున నదృశ్యులగుదురు! ఇఁక నిట్టి బగుగులతో బవరము సలుపుటేల!

[నిష్క్రమించును.]

షష్ఠదృశ్యము

(ఉదయపురోదయసాగరతీరము—ప్రభాతకాలము. మీవారు
రాజకన్యయైన మానసి యేకాకినియై విహరించుచు
నీవిధంబుగఁ బాడఁదొడంగెను.)

గీతి.

విమల తేజో మయూఖముల్ విశ్వమెల్ల
భాసమానముగాఁ జేయు, పవనుఁ డెప్పు
డల్లనల్లన తావుల జల్లుచుండ,

చేతమున దివ్యశాంతంబు చెంగలింప,
ఆననంబున ప్రవిమలాహ్లాద మొలుక
మందహాసము సలుపుచు మధురముగను
ప్రణయగీతముఁ బాడుచు భక్తిమీఱ
హర్షమున, బ్రియుఁడరుదెంచునంచుఁ దలచి
హృదయమున దుఃఖమింతైన బొడలనీక
రమ్యమేవాడసీమ యారామభూమి
హృది నజయసింహునే స్మరియించుకొనుచుఁ
దిరుగు దేను బికారియా తెఱవరీతి.

(ఒక యంధబాలకుని వెంటనిడుకొని బికారిణి యొకర్తు ప్రవేశించును.)

బికారిణి—అమ్మా! బిచ్చము పెట్టుము.

మానసి—అవ్వా! యీబుడుతఁడు నీమనుమఁడా?

బికారిణి—కాదు నాసోదరిపుత్రుఁడు. కుఱ్ఱవాఁడు పుట్టుగ్రుడ్డి. వీనికి దల్లిలేదు.

మానసి—తండ్రియున్నాఁడా?

బికారిణి—అతఁడు దేశాంతరమున కరిగెను!

మానసి—పాపము! వీనియవస్థ మిగులఁ బాడుగనున్నది. జన్మాంధుఁ గాంచిన నేరికి దయబుట్టదు! అవ్వా! యీకుఱ్ఱవాని నాకీయగలవా?

బికారిణి—అమ్మా! తల్లిపోయినప్పటినుండియు వీని నాచేతులతోఁ బెంచితిని. నన్నువిడచి యొకపూటైన నుండఁజాలడు.

మానసి—అట్లైన వీనిని నీకడనే యుంచుకొనుము. కాని ప్రతిదినము నాయొద్దకుఁ దీసికొనివచ్చుచుండుము. ఇప్పుడే బియ్యమును దీసికొనుము.

[బిచ్చము పెట్టును.]

బికారిణి—జననీ! జయమగుగాక!

[బాలకుని దోసిట్లోని బికారిణి వెడలిపోవును.]

మానసి—"జయమగుగాక" నంచు యాభిక్షుకురా లొసఁగిన దీవన యెంతమోదముఁ గలిగించెను! అది జయభేరీధ్వనికంటెఁ బ్రబలమై తల్లియాశీర్వాదముకంటె స్నిగ్ధమై, శిశుప్రథమోచ్చారణ వాక్కుకంటె మధురంబై యుండె!

(అజయసింహుఁడు ప్రవేశించును.)

అజయ—మానసీ!

మానసి—ఏమి రసపుత్రకిశోరమా! నీదర్శనంబు కతన నీమానసి యనిర్వచనీయప్రమోదవారాశినిమగ్నమానసయయ్యెను! సుందరా! నాసుఖభారమును నీవొకించుక వహింపుము.

అజయ—ఇంతసుఖ మెట్లొదవెను?

మానసి—నిన్నుఁ గాంచుటవలననే! అదిపూర్ణసుఖము—శరత్కాల నదీ సలిలముకంటెఁ బరిపూర్ణమైనది. బిచ్చకత్తె యొకతె నన్నాశీర్వదించెను.

అజయ—మానసీ! ప్రణయపురస్సరముగ నిన్నాశీర్వదింపని వారెవరు! సర్వప్రదేశములందును నిత్యమేను నీసంస్తుతినే వినుచుందును.

మానసి—నేనట్టిప్రశంస నెన్నఁడు వినలేదేమి?

అజయ—ఒకమారిల్లువిడిచి వెలుపలకు వెడలిన వినగలవు.

మానసి—నేనెల్లపుడారామసీమలందుఁ జరించుచుందును... అజయసింహా! నేనిచట కనతిదూరమున నొక యతిథి మందిరమును స్థాపించితిని. ప్రత్యహమందేను స్వహస్తములతో నతిథ్యభ్యాగతులకు భక్ష్యభోజ్యలేహ్య చోష్యాది రుచ్య పదార్థములతో భోజనము బెట్టుచుందును. నాచేతులతో వడ్డించినగాని నాకుఁదృప్తి దీఱదు.

అజయ—మానసీ ! ధన్యురాలవగుదువుగాక ! నేఁ డేను నీకడ సెలవుఁ గొనుటకై యిచటి కరుదెంచితిని.

మానసి—ఎచటకుఁ బోఁదలంచుచుంటివి ?

అజయ—రణరంగమునకు.

మానసి—అట్లా ! ఎప్పుడు పోయెదవు ?

అజయ—ప్రభాతమున.

మానసి—ఎప్పుడు మరలివచ్చెదవు ?

అజయ—చెప్పఁజాలను. మగుడిరాఁగలుఁగుదునో రాఁజాలనో యిప్పుడు దెలుపనేరను.

మానసి—ఎందువలన ?

అజయ—సంగరరంగమున హతుఁడనగుచో—

మానసి—అట్లా—(నతముఖియయ్యెను.)

అజయ—మానసీ !—మగుడిరానిచో—

మానసి—అటులైన—

అజయ—దుఃఖితురాలవగుదువు కాఁబోలు.

మానసి—దుఃఖింప కూరకుండఁ గలుగుదునా !

అజయ—గేస్తురాలవగుదువుగాన నిన్ను ప్రేయసీ యని పిలువ నిత్తువా ?

[మానసి ముఖబింబము మందహాసరుచులతోఁ బ్రకాశించెను.]

అజయ—ప్రేయసీ ! నిన్ను నేఁ బ్రేమించుచుంటినని యెఱుంగవా ?

మానసి—ఎఱుఁగ కేమి.

అజయ—నీవుకూడ నాయందనురాగము చూపుచుంటివా ?

మానసి—నిక్కువముగఁ జూపుచుంటిని.

అజయ—నీవారలఁగూడఁ బ్రేమించుచుంటివి కాదా ?

మానసి—మనుష్యమాత్రులనే ప్రేమించుచుంటిని.

అజయ—నీ వట్లొనర్ప వచ్చునా!

మానసి—కృపాళూ! నీపై ననురాగముఁ జూపుచుంటినని నేనొరు లేరివి ప్రేమింపఁ గూడదా? నీ వొక్కరుండవు నాహృదయమును భుక్తమొనరించుకొనఁ దలంచుచుంటివా! రాకుమారా! యిది స్వార్థపరత్వముగాదా!

అజయ—మానసీ! నీవు మానిసివేనా?

మానసి—శాంతమూర్తీ! నీ వట్లు కినియుచుంటివేమి! నేనేమి యపరాధమొనరించితిని! మానవులఁ బ్రేమించుటయం దేమి తప్పున్నది! అపరాధ మున్నచో నన్ను దండింపుము. నీకుఁ దోఁచిన శిక్షవిధింపుము.

అజయ— నిన్ను దండించువాఁడను నేనా!

మానసి—అవును (కొంచెము సేపూరకుండి.) శూరశిఖామణీ! నేఁ డీ రణమొనరింప నేగుచుంటివి. రణస్థలమున నీహత్యాకృత్యములు హెచ్చుకొలఁది, ప్రజానీకముఁ నీకొలందికలరి, నీపరాక్రమమును వేయినోళ్ళఁగొని యాడి, నీకీర్తినిగుఱించి యెన్నెని గీతముల రచింతురు. కాని నీపై గాఢానురాగముఁ జూపుకొలఁది యపరాధారోపణకు నాకుఁ దావు గన్పట్టుచుండెడి!

అజయసింహుఁడు—ప్రేయసీ! నన్ను మన్నింపుము. నీ యుదార హృదయకుహరాంతరాళమున విశ్వంబునంతయు నిమిడ్చివైచుము. కృపామతివై సర్వప్రాణుల నాలింగన మాచరించుకొమ్ము. మూఢత్వము కతన నీ చిత్తమునకు నొప్పిఁ గలుఁగ జేసితిని. చింతాభరస్వాంతుఁడైన యీ యపరాధిని బాలింపుము. అభ్రసంకాశమగు భవద్విశాలహృదయమును నాస్వల్పవక్షస్థలమునఁగదా బద్ధ మొనరించుకొన గమకించి నామూర్ఖ్యమును బ్రకటించుకొం

టేని. దానఁ జేసి బుద్ధిమతివైన నీవీ మందబుద్ధిని మన్నింపవలయును. ఇఁక నాకు సెలవొసంగుము.

మానసి—రాకుమారా! నీహృదయమును, ఆ తలంపుచేఁ దల్లడిలఁ జేయకుము. రణమంద జేయుఁడవై నీనామము సార్థకమొనరించుకొనుము. అన్యాయాత్యాచారము లెన్నియో పృథివియందుఁ బ్రబలియున్నవి. దురితజనకంబులైన వానినెల్ల దూరీకృతమొనర్చుటకై యుద్ధమనివార్యమై యుండును. కాని కదనము క్రౌర్యభూయిష్టమై, హత్యాసమన్వితమై యుండును! శాత్రవజిగీషచే నిర్దయుఁడవై నిష్కారణతత్పరుఁడవుగాక, సాధ్యమైనంత దనుక రిపువీరులపైఁ గరుణఁజూపుము. ఇఁక పోయి విజయుడవై మగుడిరమ్ము!

[అజయసింహుఁడు నిష్క్రమించును.]

మానసి—రసపుత్రకుంజరమా! డాలువలె శుభేచ్ఛ నిన్ను సమరక్షేత్రమునఁ గాచుగాక! రణనిహతవీరులఁ గుఱించి యేమితలంపను! నావలెనే వారల జాయాసుతులుకూడ వారలకు మంగళము సేకూర్ప భగవానుఁ బ్రార్థింతురు! వారి ప్రార్థనలన్నియు నిష్ఫలంబులగుఁ గదా! ఆ కాంతల వాంఛలన్నియు భగ్నములై చనునుగదా! యీ ఘటనల కెట్టి ప్రతివిధానమును లేదా!

[సజలనేత్రయై, క్షణకాలమూర్ధ్వదిక్కుఁగఁ జూచుచు నిముసము సేపు నిలువంబడెను. మరల ముఖము వికసింప సంతోషముతో తనలో]

"బహుళ సంతోషసంరంభపూరిత హృదయనై పవిత్రంబైన కర్తవ్యం బాచరించెద. ఆహవమున నసువులఁ బాసిన వారల జీవింపఁ జేయఁజాలను. కాని గాయపడినవారికిఁ దగు శుశ్రూష సలుపఁగలను. కాన నేనట్లొనరించెదను—కలఁతపడిన చిత్తముల

కూలఁటఁ గోల్పనుంకించు నన్నెవ్వరడ్డుపెట్టగలరు. రణము గాయపడిన వీరుల సంతాపమును బోగొట్టునదో్యగినినై వెళంబనేఁజనియెద!"

(రాజ్ఞియైన రుక్మిణి ప్రవేశించును)

రాణి—తనయా! వింటివా?

మానసి—అమ్మా! యేమది?

రాణి—నీజనకుఁడు పోరుసలుపనరిగెను.

మానసి—అవును. ఆవిషయమునువింటిని.

రాణి—యుద్ధము మొగలాయీలతో సుమీ!

మానసి—అది యీవరకే యెఱుగుదును.

రాణి—"వింటిననియు" "యెఱుంగుదు" ననియు నీవింత తేలికగఁ బలికితివి. సమరము సలుపుట బిండివంటలఁ గుడుచుటగాదు! రణమందనేకులు మరణింతురని యెఱుంగుదువా!"

మానసి—అట్లు మరణించుటసంభవమే?

రాణి—సంభవమేమి? నిశ్చయము! అంతియగాక నీయుద్ధము చక్రవర్తి చమూసమూహములతో—ఈమా అంతయు సంతమొందును. ఈరణముఁ గావించువారందఱు వీరస్వర్గము నలంకరించుట నిక్కము!—పోరొనర్పకుండువారి గతియేమి కానున్నదో దెలుపఁజాలము.

మానసి—భయవిహ్వలులమై ప్రయోజనమేమి?

రాణి—అంతియుఁ బ్రయోజనమే! మానసీ! నీకుఁ బరిణయముఁ గుదిర్చితిమి. నిర్ణీతతిథి సమీపించుచున్నది. ఈరణసంక్షోభమం దెట్లు పరిణయము సంభవమగునో దెలియకున్నది.

మానసి—సంభవము కాకుండుటేమేలు!

రాణి—మేలేమి! పెండ్లికాకున్ననెట్లు—

మానసి—ఎట్లేమి! బాగుగనుండును!

రాణి—అమ్మా! బాగుగనుండుననెడవేల! కాంతలు వివాహమాడ కుండ నుండవచ్చునా! నిన్ను యోధపురరాజతనయున కిచ్చి పెండ్లిసేయ నిశ్చయించినారము. నిన్ను వరించుటకు మారుగ నా రాకొమరుఁ డిప్పుడు మృత్యుకన్యను వరింప వచ్చెను. నాయభీష్ట ము సిద్ధింపదేమో యని వెఱగొందుచుంటి. పరిణయ నిర్ణయము భండనానంతరము సలిపిన యుక్తముగ నుండెడిది. నీతండ్రి నాపలు కులన్నిటిఁ బెడచెవిఁబెట్టె.

మానసి—అమ్మా! నాపరిణయార్థము నీవంత తొందరఁబడుచుంటి వదేల? వివాహముమాట నటుంచుము—నేనొక మహత్కార్య మాచరింప నిశ్చయించితిని.

రాణి—అదేమి కార్యమో నాకుఁ దెలుపుము.

మానసి—కదనభూమియందు సలుపవలసిన కార్యము.

రాణి—తనయా! అదేమట్లనుచుంటివి?

మానసి—జనని! యేమట్లబ్బుర పడుచుంటివి! సంగరభూమిపై శిథిల కాయులై పడు శూరశిఖామణులకు శక్తివంచనలేక శుశ్రూషగా వింప నిశ్చయించితిని.

రాణి—ఏమినీసాహసము? అజయసింహుఁడు నీచిత్తమునన్ట్టి భావము నుదయింపఁజేసెఁ గాఁబోలు.

మానసి—కాదు. ఆరాకొమరునం దేదోషములేదు. రణస్థలమున కజ యసింహుఁడు శత్రువుల వధింపనేగెను. నేను రక్షింపనేగెదను.

రాణి—అమ్మా! పిన్నతనము కతననీకువివేచనాశక్తి యావంతయు లేదు. చేటుఁగలిగించు పనులఁ జేయదొరకొనకుము.

మానసి—సిలుఁగులఁబడువారికి సేమముఁ గూర్చుటచెడు పనియా!

రాణి—మానసీ! నీతోనేను వితండవాదము సలుపఁజాలను. నాయాన నుల్లంఘించి నీవచ్చోటికిని బోరాదు.

మానసి—తల్లియాజ్ఞ యనుసరణీయమైనదే కాని అట్టియానతినిజ కర్తవ్యమునకుఁ బ్రతికూలముగఁ గన్పట్టునేని శంకారహితస్వాంతనై దానినుల్లంఘింప దొరకొందును. ఇవ్విషయమున నన్నెవ్వరును బ్రతిఘటింపఁజాలరు. నాదృఢనిశ్చయము నీకీవరకే దెలిసియున్నది. దానంజేసి నేనిప్పుడగడనభూమికిఁ దరలిపోవుచుంటిని. నీవింటికి పొమ్ము.

రాణి—నీవెవరివెంట వెడలెదవు?

మానసి—అజయసింహుని పరివారము ననుసరించి పోయెదను.

రాణి—నేఁదలంచినట్లులే యయ్యెను. రాణాకూడ నిత్తరి వెడలిపోయెను. ఇపుడు నీకన్య్యే రెరుబోధసేయఁగలరో తోపకున్నది.

మానసి—జనకుఁడిప్పట్టున నిచ్చోటనుండిన, నన్ను వారింపక యే యుందును. నేనునాతండ్రి చిత్తమెఱుంగక పోలేదు. అతఁడు మిగులఁగ ను ణాఢ్యుఁడు.

రాణి—ఆతఁడే కార్యమందును నీకడ్డు చెప్పకుండుటచే నీవిట్టులైతివి. తల్లిమాటవినని తనయవీవొకర్తుకవే గన్పట్టుచుంటివి! నిక్కముగ నేదియోయరిష్టము రానున్నది!

మానసి—జననీ! రసపుత్రరమణివైన నీవిట్లు విచారింపరాదు. పరార్థమై స్వార్థత్యాగము సలుపవలెనను విషయమును నీకే నెఱింగింప నక్కఱలేదు. నీడెందంబునఁ గొంకలంబునకుఁ దావీయకుము. ఆనంధపయోధి నిమగ్నమానసనై సేమంబుగ నే నిలుసేరఁగలను.

రాణి—(నిట్టూర్పు విడచుచు) కలికాలమహిమ !

[నిష్క్రమించును.]

మానసి—ఈశుభేచ్ఛచే నాచిత్తమంతయు తేజోమయమైపోయెను. ఆహా! దానిజ్యోతి యెట్లనిర్వాచ్యమైయున్నది! సద్వాంఛాజనితాహ్లాదమునకు సద్యోద్యః ఫలముండకమానదు. ఈసుఖంబునకుఁబరిణా

యసుఖంబునకును స్వర్గమునకుఁ బాతాళమునకున్నంత భేదము గలదు.

## సప్తమదృశ్యము

మీవారుయుద్ధక్షేత్రము సంధ్యాకాలము.

(హెదాయత్ హుస్సేనులిరువురు శిబిరాభ్యంతరమునఁ బ్రసంగించుకొనుచుండిరి. వెలుపల యుద్ధకోలాహలము జరుగుచుండెను. ద్వారప్రాంతమున నిరువురుసైనికులు కృపాణపాణులై నిలువంబడియుండిరి).

హెదాయత్—హుస్సేనా! రసపుత్రసైనికులు దాదాపుగ నెందఱుందురు?

హుస్సేను—రమార మేఁబది వేలు.

హెదాయత్—అట్లా! ఎందఱైనను, వారందఱు భీరులేకదా! ఇంకను, పలాయన మొనరించుటలేదేమి?

హుస్సేను—రసపుత్రులు పలాయన మొనరించువారు కారు.

హెదాయత్—ఎట్టివారో యెఱుఁగనుకాని, భయముగదురునట్లు పొద్దుటినుండియు వారలు కదన మొనరించుచుండిరి. వారు పలాయన మొనరించిన బాగుండునుగదా!

హుస్సేను—అలాగునా! పలాయనశబ్దము రసపుత్రుల నిఘంటువునందు గన్పట్టదు. జయలక్ష్మిఁగాని, మృత్యుకన్యఁగాని వరింప వారు కృతనిశ్చయులై యరుదెంచిరి.

హెదాయత్—నేనువచ్చినదికూడ జయలక్ష్మిని బడయుటకే!

హుస్సేను—(తనలో) నీవు నేను వరించునది జయలక్ష్మి కాదు చాఁకలి లక్ష్మి!

హెదాయత్—హుస్సేనా! ఈరసపుత్రులొకించుక కదనశిక్షఁ బొందినవారని తోఁచుచున్నది.

హుస్సేను—దేవరవారాసంగతి నిప్పుడే తెలిసికొంటిరి కాఁబోలు.

హిదాయత్—ఇదిగో రాజపుత్రుల రణధ్వని వినవచ్చుచున్నది! వారి వలె మనసైనికులెవ్వరును సింహనాదము సలుపుచుండుట లేదేల? మనవీరులు, భీరులభంగి శత్రుఖడ్గాహతులకు వెఱచి కాందిశీకులైరా యేమి?

హుస్సేను—లేదు-సమరము సలుపుచునే యున్నారు. సేనాధిపత్యభారము వహించినవారగుటచే, మీరొకమారు శిబిరమునువిడిచి వెలుపలికరుగుట మంచిదిగాదా!

హిదాయత్—సేనాధిపతినయ్యు నాకే యవసరమున శిబిరము దాఁటి వెలుపలకు బోవు నవసరమేమియు లేదు. నాబావమరది యెనాయత్ఖా నొక్కరుఁడే శత్రుసైన్యములఁ బరిమార్పఁగలఁడు. పిఱికిపందలైన రసపుత్రశాత్రవులతోఁ బోర నేఁగూడఁ బోవలయునా!

హుస్సేను—మహాశయా! మీరనినది నిక్కువమే! శూరులకును పిరికిపందలకును పోరుపొసఁగదు. కాన మీ రియ్యెడనే భద్రముగ నుండుఁడు. (ద్వారమువైపునకు దృష్టి నిగుడించి) అదిగో రసపుత్రుల యుద్ధకోలాహలము మరల వినవచ్చుచు, మన శిబిరమును సమీపించుచున్నట్లున్నది—స్వామీ! అపాయము వచ్చునేమో యని భయపడుచుంటిని.

హిదాయత్—ఒకమారు వెలుపలికేగిన నీ భయము తగ్గునేమో యని తోఁచుచున్నది. అట్లరిగెదవా యేమి!

హుస్సేను—స్వామీ! వెలుపలకుఁ బోవలయుననియే యున్నది. మీ రందుల కియ్యకొనిన మిగుల సంతసించెదను.

హిదాయత్ (తనలో) అయ్యయ్యో! నోరుజారి యంటిఁగదా! (ప్రకాశముగా) హుస్సేనా! నీవు పోవలదు. నీవు నాయొద్దనే యుం

డుము. చిన్ననాటనుండియు నొంటరిగ నుండుట నా కభ్యాసము లేదు. అది చెడ్డ యలవాటునుమా!

హుస్సేను—అది నిక్కువమే సుడీ!

హెదాయత్—ఏమి యీ కలకలము! ఇది దిక్కులం బిక్కటిల్లం జేయుచుండెను!

హుస్సేను—ఈమూజింకను సమీపమునందు వినంబడుచున్నది!

హెదాయత్—అవును! అదిగో భేరీ మురల మ్రోగుచున్నది!

హుస్సేను—స్వామీ! ఏదియో యుపద్రవము వాటిల్లెనని తోంచుచున్నది!

హెదాయత్—అయ్యయ్యో! ఇంక నేమి గతి! అల్లా!! అల్లా!! అయ్యో! అయ్యో!! (అని యతండు హుస్సేను నాలింగన మాచరించుకొని యేడ్వ దొడంగును.)

హుస్సేను సేనాపతిని మెల్లగ వదలించుకొని, వాని నొకచో నాసీనుం గావించి, యా శూరశిఖామణి సూపు ధైర్యమునకు నివ్వెరం జెందుచుండెను. (సైనికుండొకడు ప్రవేశించును.)

హెదాయత్—ఏమివార్త?

సైనికుండు—స్వామీ! సైన్యాధ్యక్షుండైన సామశేరు హతుండయ్యెను.

హెదాయత్—ఏమి! హతుండయ్యెనా! హా!

హుస్సేను—తక్కిన సైన్యాధ్యక్షు లేమైరి?

సైనికుండు—యుద్ధ మొనరించుచుండిరి.

హెదాయత్—ఎనాయత్ఖాను జీవితుండై యున్నాండుకదా?

సైనికుండు—ప్రభూ! జీవితుండయ్యే యున్నాండు.

హెదాయత్—సరే పొమ్ము.

(సైనికుండు నిష్క్రమించును)

హెదాయత్—హుస్సేనా! నిజముగ నీవనినట్లు విపత్తు ఘటిల్లె నేమోసుమీ?

హుస్సేను—తినఁబోవుచుఁ రుచియడుగు టెందులకు! మున్నొకమారు మీవారు నాక్రమించుకొనుట, యనలీలగ దుముకుటయేయని యంటిరి! అట్లగుచోనది హనుమంతుని లంఘనమై యుండవలెనని నేఁ బల్కితిని. స్వామీ! అప్పుడేనుపలికిన పలుకు లసత్యములు గావని యిపుడు మీరు గ్రహించితిరా?—అదిగో రణఘోషమింక సమీపమున వినంబడుచున్నది!

హెదాయత్—అవును! యుద్ధమం దేమిజరుగునో చెప్పశక్యముకాదు సుమీ!

హుస్సేను—ఇపుడు మనపనియేమగునో చెప్పశక్యము కాని మాట నిజము.

(ద్వితీయసైనికుఁడు ప్రవేశించును)

హెదాయత్—ఏమి సమాచారము?

సైనికుఁడు—హుజూర్! మన సైనికులందఱు చెల్లాచెదరై బవరము నుండీ పరువిడుచున్నారు.

హెదాయత్—అదేమి?

హుస్సేను—ఈకోలాహలమందుచేతనే కాఁబోలు.

సైనికుఁడు—హుజూర్. అవును స్వామీ!

(నిష్క్రమించును)

హుస్సేను—సేనాపతీ! మీరొకమారీశిబిరమండలిశయ్యను వదలి వెలుపలికిఁ జనుఁడు. మిమ్ముఁ గాంచిన, సైనాధ్యక్షులుత్సాహవంతులు కాఁగలరు. ఇఁక తడవుసేయకుఁడు. నేఁ గూడ మిమ్మనుసరించివచ్చెదను—మీరు సైన్యాధిపత్యము వహించిన శూరులను విషయము మఱచిపోకుఁడు.

అజయ—మొఁగలుసేనాధిపతివా! సేనాధిపతి యీసమయమునఁ గద నరంగమందుండక శిబిరంబున మూల్గుచున్నాఁడేమి?

హెదాయత్—నేనా! —అవును—నే!—నేను! ఆఁ—అవు—నేనే అ- అ- ఆఁ—అందుకు చా చా లా—కారణము—ముంది!—ని! వివరంగా యి—యి—యిప్పుడు చెప్పలేను!—జ్ఞాపకమువచ్చుటలే!—లేదు!—బాబూ! నన్ను చంపకుఁడు న!— న!— నన్ను బ్రదుకనింపు! అల్లా! అల్లా!! (డగ్గుత్తికతో నేడ్చును.)

అజయ—అల్లో బ్రదుకుము! ఇట్టి శౌర్యముఁ జూపుటకే కాబోలు మీవారిని జయించెదనని వచ్చితివి! ఏడ్వకుము! భయములేదు. నిన్ను వధింపను! జయజయధ్వానములచే రాజపుత్రస్థానమంతయు ముఖరితమగుగాక!

హెదాయత్—అల్లో కానింపు! నన్నుమాత్రము జంపకుఁడు! నన్ను నేనే! నేను! కొత్తగా—పె! పెండ్లాడితిని! అల్లా అల్లా!!

[సైన్యసమేతుఁడుగ నజయసింహుఁడు నిష్క్రమించును.]

హెదాయత్—అమ్మయ్యా!. బ్రదికితిని!!—దాహము!—దాహము!! అయ్యో! దాహము!!—

దృశ్యాంతరము.

ఆహవరంగము—అంధకారనిశీథము.

చచ్చిప్రోఁగులై పడియున్న తురగపదాతిసమూహములమధ్య కతిపయ సైనికులతో మానసి సంచరించుచుండును. కొందరు సైనికులు చేతులందు కాగడల ధరించియుందురు.

మానసి—సైనికులారా! మీలోఁ గొందఱా వైపున కరుగుఁడు—మేమీదిక్కునఁ జూచెదము.

[రాజపుత్రులు కొందఱు సైనికసహితులై వెడలిరి.]

మానసి—ఆహా! యేమి యీ భయాశీలదృశ్యము! రుధిరప్రవాహము లెట్లు ఈరణరంగమును భీషణప్లావిత మొనరించుచున్నవో! హత్యాదేవి నలుగడల దాండవమాడుచున్నదే! హాహాకారములతో దిక్కులు పిక్కటిల్లుచున్నవి. పలలార్థమై గృధ్రశకునములెల్లెగసి వచ్చుచున్నవో! జంబుకారవము లెట్లు భీతిఁగొల్పుచున్నవో! పరమేశా! నరుఁడు నరునివధించుట నీరాజ్యనియమమా యేమి! భయమొనర్చు హింసాపిశాచి యీపృథివినుండి తొలఁగిపోదా యేమి! దయామయా! భయరహితుండై మానిసి మఱొండు మానిసిని హత్యఁగావించుచుండఁ జోద్యముఁ జూచుచుంటివా! నీల నభమును భేదించి విశ్వమందు వ్యాపను భీషణ విజయహుంకారముల నలుపుచుండ, నీవు దాని నంతమొనరింప కూరకొనుచుంటివేమి? ఆహాహా! ఈరంగస్థలమెంత భయావహముగ నున్నది! యీదృశ భయానకదృశ్యము నేనెన్నఁడుఁ జూచియుండలేదు. ప్రేవులప్రోవులు చరణములకు నగులుకొనుచున్నవి! ఇదిగో దెబ్బతిని పడినవారు మృత్యుబాధచేఁ గుందుచు, మూల్గుచుండిరి! ఆహా! ఈదారుణ హింసారంగమున నీక నిలచియున్నచో హృదయము విదారితము గాక మానదు!

గాయములతో నిండిన కాయముఁగల సైనికుఁడొకఁడు "అయ్యో! యేమియీబాధ!" అని మూల్గుచుండ వానిని సమీపించి మిత్రమా! నీకుబాధ యెచ్చట గలుగుచున్నది! అయ్యో! పాపము నీశరీరమంతయు రక్తమయమై యున్నది!

మఱొండు సైనికుఁడు—అమ్మా! నీవెవ్వతెవు? ఇటురమ్ము తల్లీ!

మానసి—("మాటలాడకు" మని ప్రథమ సైనికునికడకరిగి, వాని గాయములపై నేదియో మందిడి, చిన్నవసనముచే దానిఁగట్టుచు

"వీరపురుషా! విచారింపకుము. భయమొందకుము! స్వస్థుఁడవు గాఁగలవు. ఈయౌషధముఁ ద్రావుము (అతఁ డాయౌషధమును లోనికిఁ బుచ్చుకొనెను.) దగ్గఱ గాయములతో బాధపడుచున్న సైనికుఁ డార్తనాదముఁ గావించువానిని సమీపించి,

మానసి—"సైనికా! స్థిరముగఁ బడియుండుము. నీశుశ్రూషకొఱకై తగు నేర్పాటుఁ గావించెద" [అని నిజభృత్యున కేదియో సంకేతము నొసరింప, నతఁడు వెలుపలి కరిగెను. పడియున్న వేఱొక సైనికుఁ గాంచి]

మానసి—"అస్థిరుఁడవుగాకుము. నేనిప్పుడె వచ్చెద"

[మరల నొక వ్రణితుఁడు—అయ్యయ్యో! యేమి యీ వేదన! మృత్యువు మృత్యువేమంచిది! ఓ! ఏమి యీ యాతన! అని కేకలు వేయును.]

మానసి—(వానిని పరీక్షించి, యింకను రక్తస్రావము బంధము కాలేదు) 'సైనికా! ఇటుఁజూడుము'

హెదాయత్—దాహము! దాహము! అయ్యయ్యో! నోరెండుకొని పోవుచున్నది!

(సలిలపూరితకలశ మొందుఁగొని మానసి వానికడ కరిగి "ఈనీరము త్రావు" మని గొంతెత్తి ముంచెను)

హెదాయత్—ఆసాంతఁగ్రోలి "అమ్మయ్యా! యిప్పటికిఁ బ్రాణము జేరెను! అల్లా! అల్లా! ఆహాహా!"

(సైనికసమేతముగ నజయసింహుఁడు ప్రవేశించును)

అజయసింహుఁడు—గాఢాంధకారమున నీభయంకర భండనభూమి యందు భీతరహితవై చరించుచున్న నీవెవ్వతవు?—రాజపుత్రివా యేమి?

మానసి—అజయసింహా! నేనే!

అజయు—(నికటమునకేగి) మానసీ! నవనీతసంకాశ మానసా! నీవరో గాయముల నెత్తెద వతిశ్లాఘ్యములు గదా!

మానసి—రాజపుత్రశేఖరా! రణరంగమున బడియున్న యీహతభాగ్యులకు సేవసలుప నాకోరికయుగ సాయ మొనరింప సైనికులలో నొంకరిని దోడిచ్చెదవా? నాకిటఁ బరిచారకులు నిశ్శేషముగ లేరు.

అజయు—మానసీ కేమి సాయ మొనరింప వలయును?

మానసి—క్షతగాత్రులను మూపున నిడికొని నాసేవాశిబిరమునకు దేవలయును.

అజయు—సరే (సైనికుల నుద్దేశించి) మీరీయమ పనుపులను తెలంగున నాచరింపుడు.

"ఉత్తమము! మహాప్రభూ!" యని సైనికులు వెడలిపోయిరి.

మానసి—రాజపుత్రా! ఏమియీయానందము!

అజయు—మానసీ! ఏమి యీదివ్యజ్యోతి!

మానసి—ఎచట?

అజయు—నీప్రఫుల్లముఖమందు—యీహతసైనిక విక్రందనముఖరితకదన రంగంబున, నీమృత్యులీలాక్షేత్రమున, నీభయానకశ్మశానభూమియం దీతారకాదీప్తతమంబు నందేమి యీయనిర్వాచ్యప్రభ! ఝటికావిక్షుబ్ధ నిశాంధకారవిక్షుబ్ధ మహార్ణవోపరిభాగమునఁ బ్రకాశించు ప్రభాతప్రభాకరాలోకము వలెను, వినీలజలధరాంతరిత స్థిరనీలనభంబుభంగి, ఆర్తతిమిరానుగతసుఖాలోకము లీలఁగనుపట్టు నీమూర్తిమహిమ మెట్టిది!—

"ఆహా! ఏమియీసౌందర్యమహిమ! ఏమియీయనన్యసామాన్యలావణ్యము! మాహాత్మ్యము! పరాకాష్ఠ! త్యాగము! విస్మయము! విస్మయము!—మానసీ!

(అజయసింహుఁడు మానసికోమలకరములఁ బట్టుకొనును.)

మానసి—అజయసింహా! ఏమి నీయుల్లాసము!! ఆశ్చర్యము!!

అష్టమదృశ్యము

ఉదయపుర రాజపథము—ప్రత్యూషఃకాలము చారణీదళప్రవేశము. వెనుక గోవిందసింహా, అమరసింహా, అజయసింహా సామంత కాదులు. గాయని లీలీలునఁ బాడఁ దొడంగిరి.

గీతి.

సిరులకాకరమై, యశశ్శిలుకైన
తనయులం గన్న మీవారుఁ గని, యవనులు
దాడివచ్చిరి ముమ్ముందరదస్యులట్లు
మిహిరశీతాంశు కులజులమహిమ నెఱుఁగ
నేరక హననకార్య తత్పరులు నగుచు;
భయదసంగ్రామవాదసంభ్రమమునఁదాక
గాయపడినట్టి వారియాక్రందనములు
నింగి మార్మ్రోగ నెల్లెడ నిండిపొంగి
మేటిశూరులు కరవాలధాటిఁ గూలి,
తుదకు హతశేషమైనట్టి తురకదండు
మరలిపోయె విషాదసంభ్రమముతోడ.
తావిఁగల మంజులకాంతతతులతోడ
రాజ్యలక్ష్మినిగొల్చు ససంభ్రములార!
రండు వేగమ జయజయారావములను
సలిపి, గావింతముపచారములను సరగ,
కరుణతో సంగరక్షతకాయులకును.

శ్రీ

# మేవారుపతనము

## ద్వితీయాంకము

### ప్రథమదృశ్యము

ఆగ్రాయందు నగరసింహుని యాలయము—ప్రభాతకాలము నగరసింహుఁడు, దౌహిత్రుఁడైన యరుణసింహునితోఁ బ్రసంగించుచుండెను.

నగరసింహుఁడు—అరుణా! అమరసింహుఁడు దేవారుయుద్ధమున మొగలాయిసైనికులఁ దుత్తునియలు సేయు టొక భౌతికకృత్యము వలెఁ గన్పట్టుచుండుట నిక్కముగాదా?

అరుణసింహుఁడు—నిక్కమే. అమరసింహుఁడు కడు ధన్యుఁడు.

నగర—పూర్వ మతఁడు విలాసాదులఁ దేలుచు భోగపరుఁడై యుండెడివాఁడు. రణమన్న నతని కెంతయో భయము. అట్టి యలసుఁ డిప్పు డిట్టి శూరుఁడగుట మిగుల నక్కజముగఁ జూపట్టుచుండె!

అరుణ—దాదాజీ! వాల్మీకిమహర్షి ప్రథమవయసున దస్యుఁడై యుండలేదా?

నగర—వాల్మీకిమహర్షి యెవఁడు? తులసీదాసు తనయుఁడు కాఁడా?

అరుణ—దాదాజీ! వాల్మీకిమహర్షి పేరెప్పుడును వినియుండలేదా? ఆశ్చర్య మాశ్చర్యము! అతఁడు సంయమీంద్రుఁడు కాఁడా?

నగర—అటులా? అతని నెన్నఁడుగాని జూచినట్లు నాకు జ్ఞప్తికి వచ్చుటలేదు!

అరుణ—(నవ్వుచు) అతని నెట్లు జూడఁగలరు! వాల్మీకి త్రేతా యుగమందు జన్మించెఁగాదా?

సగర—ఏయుగమందు?

అరుణ—త్రేతాయుగమందు.

సగర—ఓ! అటులనా! అట్లగుచో నతఁడు నాకంటె గొలఁది దినములకు బూర్వమే యుదయించి యుండును. వాల్మీకియనుపేరు నేను వినినదికాదు. ఊరక దెలియనట్లు నటించితిని—వాఁడు మిగుల రసికపురుషుఁడునుమీ!

అరుణ—(నవ్వుచు) మీరును రసికపురుషులే. జడలుదాల్చిన యమ్మహాత్ముఁడే కదా రామాయణమను సద్గ్రంథమును రచించెను.

సగర—రామాయణమును రచించిన దతఁడా? అది మంచిగ్రంథమే?

అరుణ—దాదాజీమహాశయా! మీరు రామాయణమే చదువలేదా! మన పూర్వపురుషుఁడైన భగవాన్ రామచంద్రుని బుణ్యచరితం బేమియు మీకుఁ దెలియదా? ఆశ్చర్య మాశ్చర్యము!

సగర—ఆశ్చర్యమేమి! నాజీవన మంతయు యుద్ధభూమిలోనే గడచిపోయెను. రామాయణమును చదువుటకు సమయ మెక్కడిది నాకు!

అరుణ—మీరు యుద్ధములఁగూడ సలుపుచుండెడివారా?

సగర—ఓ! ఎన్నియుద్ధము లెన్నియుద్ధములు! వాని నన్నిటిని విశదముగ నీకడవర్ణించిన భయముచే గోలుగోలున నేడ్చెదవేమో యని వెఱగొందుచుంటిని. అపుడు నీవుగాని, నీ జనయిత్రిగాని పుట్టనే లేదు.

అరుణ—మీరు పుట్టినారా?

సగర—ఆఁ పుట్టితిని. ఇం దన్యత మేమియు లేదు.

అరుణ—అయితే దాదాజీ! అన్నిసంగ్రామములను జేయువరకు నూరకుండెనా?

సగర—ఊరకుండు టెవరు?

అరుణ—మామాతామహి!

సగర—ఆమె కేమిపని?

అరుణ—మీరు గావించిన సంగ్రామము లన్నియు నామెతో గాదా?

సగర—నిక్కముగ గాదు.

అరుణ—అటులైన మీరుకరణముల నికేరమణులతో సలిపితిరి?

సగర—ఛీ! కుజ్జా! రమణులతో రణమేమి?

అరుణ—అటులైన మీ రేవీరులతోఁ బోరితిరి?

సగర—కుజ్జా! నా కదే జ్ఞప్తికి వచ్చుటలేదు కాని యెన్నియో భండనముల సలిపినట్లుమాత్రము జ్ఞాపక మున్నది. అపుడు మీ రెవరు పుట్టలేదు.

అరుణ—ఈవిషయమును ముందే తెలితిపిరి.

సగర—నీజనని—

అరుణ—దాదాజీ! నాజనని యెచ్చటనున్నది?

సగర—ఎచటనున్నదో దెలుపఁజాలను. ఒకనాటి యుదయమున నిదురనుండి మేల్కాంచి "మీవారు, మీవా" రంచు యుచ్చైస్స్వనమున బలికి నీజనని యెక్కడికో జనియెను. ఆనాఁటి సంధ్యాసమయమున నెంత యన్వేషించినను ఆమె కనుపింపలేదు.

అరుణ—నాజనకుఁడెందుండెను?

సగర—నీజనకుఁడు జడుఁడు. మూర్ఖుఁడై యతఁడు గజసింహునను సరించి గుజరాతు యుద్ధమున కరిగి యచ్చోఁ బ్రాణములఁబాసెను.

అరుణ—ప్రాయశఃనాజనని మీవారు నందుండవచ్చును.

సగర—నాకుఁగూడనట్లే తోఁచుచున్నది.

అరుణ—దాదాజీ! మీవారును వదలి మీరిచటకెందులకు వచ్చితిరి. మీసోదరుఁడయిన ప్రతాపసింహుఁడు మాతృస్వాతంత్ర్యార్థమై తనప్రాణముల గోల్పోయెఁగదా?

సగర—దానంజేసియే యతఁడల్పాయువయ్యె. నిరుపేదయై కందమూలములఁ దినుచుండువాఁడు. ఎన్నినీతులఁ గఱపినను వినువాఁడు కాఁడు. అగ్రజు పలుకుల నాలింపక ప్రతాపుఁడెన్నియో దొసఁగులకులోనయ్యెను. నాదోషమేమియు లేదు.

అరుణ—రాష్ట్రవాసులెల్ల భాయశక్తిలకుఁ గీర్తించుట నేఁబలుమాఱులు వింటిని.

సగర—ఎందరెన్నికీర్తిగీతములఁ బాడినను, అవేవియు మృతిఁజెందినవాని చెవుల సోకనేరవు.

అరుణసింహుఁ డూరకుండును.

సగర—మేమిరువురము బాలురమై యుండనొకనాఁడు నకులోరగములకుఁ బోరుజరిగెను. ముంగి గెలుచునని నేఁబలికితిని. ప్రతాపుఁడు విశ్వసింపలేదు. నకులము విషధర- శిరమును లక్షించి యిటునటు లఘింపసాగెను. దర్వీకము ఫణమునెత్తి బుస్సుచు నూర్ధ్వముగ నెగుచుచు భూమిగూలదొడంగెను. తుదకు నకులము భుజంగశీర్షముఁ గొరికివైవ నది వసుంధరపైఁగూలి యుసురులవాసెను. సర్పధ్వంసమే ముంగిసవృత్తి. సర్పమేమిచేయగలదు. దానంజేసియే నేను ముంగిపక్షము నవలంబించితిని. ప్రతాపుఁడు వెఱ్ఱియై వ్యాళముపక్షమునవలంబించెను. ఇప్పుడు కూడనేను నకులపక్షమునే యవలంబించుచుంటి.

అరుణ—కాని యీదేవారు రణమునదాదాజీ—

సగర—బుడుతా! వారిదిరక్తబీజవంశము. కఱకువారినీవెంతవరకుసరకగలవు! అంతియగాక ముసల్మానుదళములు క్షీణించుచో, హిందు

వులఁ గొందఱేఁ దమమతములోఁ గలుపుకొని వారలు మరల బలోపేతులై బవర మొనరింతురు. హైందవులట్లు మ్లేచ్ఛులకు-దమ మతమందుఁ జోటీయరు. హిందూకులసంజాతులు కొందఱన్యమత ప్రచారకుల ప్రలోభన జాలమందుఁ బతితులై పిదప పశ్చాత్తాపము నొంది నిజమతస్వీకార మొనరింపఁదలచినను ధర్మజ్ఞులగుహిందూ పండితులు చిరబహిష్కారరూపమునుండి వారలవెలికిదీయరొల్లరు. అటులుండ మ్లేచ్ఛయోనినిర్గతులవారు దమపవిత్రమతములోనికేల రానిత్తురు! అరుణా! ఇదిహైందవులదోషమేయనినాకుఁదోఁచెడిని.

అరుణ—ఎట్లు?

సగర—ఎట్లో చూడుము. నీమాతులుఁడు రసపుత్రుండయ్యు ముస ల్మాను మతమును స్వీకరించి మహబత్ఖానను నామమునఁ బరగు చుండెను. ముసల్మాను కులజుఁడైన అబ్దుల్లా అట్లుహిందువు కాఁగలఁడా?

అరుణ—ఇంతవిలున్నప్పుడు మీరుముసల్మాను మతమునేల యవలం బించితిరి కారు! దాదాజీ?

సగర—అట్లొనర్చుటకు దాదాజీకి సాహసము చాలదు. నీమామ సాహసమసీమము. అతఁడించుకైన సంకోచింపలేదు కానివానికొఱకై నేసుముందేచాల యేర్పాటులఁ గావించితిని. సాహసించినేను మొగలుపక్షమునవలంబింపకున్న నాతనయుఁడుముసల్మాను కాజాలకపోవును.

అరుణ—మీయిరువురి సాహసములు శ్లాఘ్యములే, దాదాజీ! తాము కూడ ముసల్మాను మతమునుస్వీకరించిన జాలనుత్తమముగనుండెడిది. హిందూకులోద్భవులయ్యు వాల్మీకిమునీంద్రు నెఱుఁగక రామాయణముఁజదువకయున్న మహాత్ములు ముసల్మానులగుటే సమంజసము.

సగర—రామాయణమా! చదువుటా! శునకమార్జాలకుక్కుటమూషక మండూకాదులగుఱించిన పొడుపుకథల వృత్తాంతము రణసీమలందే నిరంతరము సంచరించు సగరసింహున కెందులకు?

అరుణ—మహానుభావా! నమస్కారము!!

(మొగలుసైన్యాధ్యక్షుఁడైన సయ్యదు అబ్దులాప్రవేశించును)

సగర—ఓహో! సాహెబుగారూ! సలాము. దయచేయుఁడు.

అబ్దుల్లా—రాణావారికి సలాము.

సగర—రాణాయెవరు?

అబ్దుల్లా—రాణామీరే!

సగర—అదేమట్లనుచుంటిరి? ఎచ్చటిరాణా?

అబ్దుల్లా—మీవారురాణా?

సగర—ఏమి! మీవారురాణా అమరసింహుఁడుకాఁడా?

అబ్దుల్లా—నేఁడుచక్రవర్తి మిమ్ము మీవారురాణాపద మందునియుక్తు గావించిరి.

సగర—ఏమి?

అబ్దుల్లా—ఎల్లిచిత్తూరు పోవలసినదని యాదేశము.

సగర—చిత్తూరా! ఎందులకు?

అబ్దుల్లా—ఆపురము మీరాజధానియగును.

సగర—అటులైన నుదయపుర మమరసింహుని రాజధానియా?

అబ్దుల్లా—అతఁడిఁకరాణాకాఁడు. చక్రవర్తివానిఁ బదచ్యుతుఁగావించివైచెను.

సగర—అమరసింహుఁడు తనపదమునేల బరిత్యజించును?

అబ్దుల్లా—ఏల! చక్రవర్తి ముదలననుసరించి!

సగర—అతఁడట్లు గావింపఁడు.

అబ్దుల్లా—కావించితీరవలయును.

నగర—నేఁబోయి వానితోఁ బోరుసలుపవలయునా యేమి? సాహెబూ! నాకు రాణాపద మక్కఱలేదు.

అరుణ—ఎందువలన? రణవిద్య యందతినిపుణుండనియు సంగ్రామభూమియందే జీవనమంతయు నతివాహితమయ్యెననియు మీరింతకు ముందే నాతోఁబలికితిరి. గాదా—ఇపుడు సమరమన్న వెఱఁగొందెద రేల?

నగర—బుడుతా! నోరుమూయుము. అధికప్రసంగము చేయకుము— సాహెబూగారూ! నేనుయుద్ధముఁగావింప జాలను. ఆలమొనర్ప వలసివచ్చినన్న భయమున శంకారహిత చిత్తుఁడనై మొగలుల మ్రోలనంజలి ఘటించి మోకరించితిని. ఆహవము సలుపవలసిన చో నాభ్రాతృపక్షము నవలంబించి యాచరింపవలయును—కాని విపక్షులఁ జేరిగాదు!

అబ్దుల్లా—అయ్యా! మీరుపోరొనర్పనక్కఱలేదు. యుద్ధముగావింపవలసినచో మేమే కావింతుము. తామనుగ్రహపురస్సరముగ రాణాపదమును స్వీకరించి చిత్తూరుపురమందు నసింపుఁడు.

నగర—నేఁజిత్తూరరిగిన పిదపనది యాక్రమణమగుచో నేమిజేయుదును?

అబ్దుల్లా—అట్లుకాదు. ఇన్నిదినములనుండి యూరకుండి శాత్రవులిపుడు దానినాక్రమింపరు.

నగర—సయ్యదుసాహెబూ! ఇదియొకప్రమాణమా! మనుజుఁడింతకు మున్నెన్నఁడు మరణింపలేదని యిఁక మరణింపఁడా? వివాహమాడితినని కొలఁదిదినములకు బూర్వమీవు వచించితివి. అట్లయ్యుపరిణయమాడలేదని వచింపనచ్చునా?

అబ్దుల్లా—అట్లువచించుటెందులకు?

నగర—ఏలనన నీ వివాహమునకు బూర్వమెన్నఁడును పరిణయము గాలేదుగనుక. ఇదికూడ నొకప్రమాణమే! అరుణా! నవ్వెదవేమిరా!

షా మింతవరకు గెలువలేదని యిఁకెపుడును గెలువకుండునా! ఈప్రమాణమెట్లు రూఢమగునో నాకు దోఁపకున్నది.

అబ్దుల్లా—అయ్యా! మీవాగుడునకర్థము నాకేమియు బోధపడుట లేదు. మీకంత వెఱపెందులకు?

సగర—వాగుడందువా! వాగుడులేకున్నఁ బ్రపంచములోఁ బ్రదుకు టెట్లు, వెఱపేలయనుచుంటివి! నాకు వెఱపేలేదు; కానియుద్ధమొన రించుటకు నాకిసుమంతయైన నిచ్ఛలేదు నాకు రాణాపద మక్కఱ లేదు.

అబ్దుల్లా—అట్లయిన మీరు చక్రవర్తికడకువచ్చి, చెప్పవలసిన దంతయు వారితోఁ జెప్పుకొనుఁడు.

సగర—సరే! అట్లేవచ్చెదను. కాని మొదటబానిసఁ గావించి పిదప రాణాపదవి నొసఁగుట కాపురుషకృత్యముగ గన్పట్టుచుండెను. పిదప సరే! జరుగనున్నది జరుగకమానదు! కృతఘ్నత! ఘోరము! అవిచారము! అధర్మము! అన్యాయము—అరుణా! నడువుము!

ద్వితీయదృశ్యము

ఉదయపురరాజాంతఃపురము-ప్రభాతకాలము

మానసి యేకాకినియై పాడుచుండెను.

గీతి

కలకలారావముఖరితాచలములదిగి
నాట్యగానాలతోవచ్చు నదులతోడ
సంయమీంద్రుల కుచితవాసంబులగుచు
పూలఁబండ్లనొసంగు వనాలతోడ
విశ్వగానంబు తొలిజాము వేళలందు
హాయిగాఁజేయు పక్షిచయంబుతోడ

తమము తెరఁ దొలఁగించి చైతన్యమొసఁగు.
బాలభాస్కరకాంచన ప్రభలతోడ
లలితపుష్పసుగంధంబులను హరించి
చేతమలరించు మందమారుతముతోడ
రజతసలిలంబు చాడ్పున రజనియందుఁ
దేజరిల్లు హిమాంశుచంద్రికలతోడ
ప్రసవమాలామనోహర పాణియగుచు
నెనరుగొలిపెడు నామని నెలతతోడ
బరగు దివ్యయశస్వినీ! భరతమాత
అందుకొనుమమ్మ వేగ జోహారులిపుడు

అజయసింహుఁడు ప్రవేశించును

మానసి—ఎవరది! అజయసింహుఁడా యేమి?

అజయ—అవును. నే నజయుఁడను.

మానసి—ఇన్నాళ్ళనుండియు నీదర్శనము కలుఁగలే దేమి! క్షేమముగ నుంటివా?

అజయ—క్షేమముగనే యుంటిని.

మానసి—నీవిషయమై జనకు నడిగితిని. నీతో నతఁ డేమియు వచింప లేదా?

అజయ—లేదు. మానసీ! ఇచ్చోట నీవొంటరిగ గూరుచుంటి వేమి?

మానసి—గానమొనరించుచు నేదియో భావించుచుంటిని.

అజయ—ఏమి భావించుచుంటివి?

మానసి—మనుజుఁ డతిదీనుడంచు భావించుచుంటి. మీవారుయుద్ధము వలన నగుఁ డతి దుర్బలుఁడను విషయము తెల్లంబయ్యె. ఖడ్గాపాతమున నతఁడు భూపతితుఁ డగును. జ్వరపీడితుఁడగుతతి శిశువులీలఁ బడియుండును. మనుష్యరుధిరము మృత్యుబీజ మిళితమై.

యుంటచే బరస్పరానురాగ బద్ధులుగాక మర్త్యులుపరస్పర హింసాంచికీర్షతోనుంట విషాదకరము! అజయా! తీక్ష్ణదృక్కుల బఱపుచు నిలువంబడి యుంటివేమి?

అజయ—ఆనాఁటివలె నేఁడుకూడ నొక దివ్యజ్యోత్స్నాజ్యోతి నీవదన మండలమునఁ గన్పట్టుచున్నది.

మానసి—ఏనాఁటివలె?

అజయ—ఆనాఁటి నిశీథిని దేవారుయుద్ధక్షేత్రమున నస్పష్టాంధకారమున మూర్తీభవించిన కరుణవలెఁ దోఁచు, నీసుందరమూర్తి నన్నొక నూతనవ్యక్తుఁ గావించివైచెను. అత్తఱి నాయనురాగం బంతయు నాకస్మికముగ ననీమహతాశాదీర్ఘశ్వాసయందు మిళితమై పోయెను.

మానసి—అజయా! హతాశయేల?

అజయ—నీవంటి మానినిని వరింపనావఁటినరున కసంభవమనియు, నీవిహలోకజనిత రమణివిగా వంచునను, మూర్తీభవించిన మహిమవంచును, నిక్కముగ నొక దేవకాంతవంచును గ్రహించితిని. ఈశ్వరుఁడు నీయాత్మప్రభయందు సముజ్జ్వలుఁడై యుండెఁ. నీయనావృతతీవ్రాత్మజ్యోతిని జగంబు సంహింపనేరదను భయమున జగదీశ్వరుఁడు నీతనుల్లతచే దాని నావృత మొనరించెను. అనంతాకాశ మొకరంగస్థలముగా తారావళు లొక్కొక్క టొక్కొక పవిత్రచరిత్రముగా జ్యోత్స్నయొక యకలుషవిశ సంగీతముగా రచితంబగు నద్భుతనాటకమున కీవే గథానాయికవుగాఁ గలవు! అట్టి దివ్యాంగనపై నీ మనుష్యమాత్రుఁ డనురాగ మెట్టులు జూపఁ గలఁడు! భక్తిమాత్రముసూపఁగలుఁగును. ఆభక్తిఫలముగనీకృపాబిందు వొక్కటిచ్చినఁ జాలును. దానికొఱఁగ సంకోచించెదవా?" (యిట్లువచించి అజయసింహుఁడు మానసి కరద్వంద్వ

మును బట్టుకొనియెను. అత్తఱి రాణి యటప్రవేశించి,) రాణి "అజయసింహా!" (రాకుమారి కరముల నజయసింహుఁ డాకస్మికముగ వదలివైచెను.)

మానసి—ఏమి జననీ?

రాణి—అజయా! నాకుమారింగూడియీతీరున నేకాంతమునఁ బ్రసంగింప నీకు నే నెట్టియధికారమునుగూడ నొసగలేదు.

అజయ—రాజ్ఞీతిలకమా! మన్నింపుము.

మానసి—అజయా! మన్నించుటేమి?

రాణి—మానసీ! నీవు రాకుమారివి. తెలిసినదా బొమ్ము! గృహాభ్యంతరమునకు బొమ్ము.

(మానసి నిష్క్రమించును.)

రాణి—అజయా! నీవు గోవిందసింహుని తనయుఁడవు. నీవుగూడ మాస్వజనములోనివాఁడవని మేమెన్నఁడు దలంచుకొనుచుంటిమి. మానసి యిప్ప డజ్ఞానబాలిక గాదనియు, నీ వల్ప వయస్కుఁడవగు బాలుఁడవు గావనియు నెఱుంగు టుచితము. ఇఁకెప్పుడు నీ వామెతో ముచ్చట లాడకుము. ఆబాలయుండుతావునకుఁ గూడ నీవు జేరవలదనియే నాయభిప్రాయము.

అజయ—"రాజ్ఞీ! నీయిచ్చవచ్చిన తెఱంగుననే యాచరించెద" (నని పలికి నమస్కరించి వెడలిపోయెను.)

రాణి—తగురీతిని గద్దించితిని. అజయునకును, నాతనయకును బరిణయమైన వార లిరువారొకే వృంతమందలి గులాబిపూలఁ బోలియుందురు. సుఖోపేతమగునట్టి పాణిగ్రహణము సంభవమగునా? కాదు. అట్లు జరుగనేరదు. (స్థిరప్రతిజ్ఞభావమున రాజ్ఞి యాందలను బంకించెను) "అట్లుగాదు! సాధ్యముకాని విషయముఁ దలచిన నేమిప్రయోజన!" (మని రాజ్ఞిఁ పోఁబోవును).

రాణా అమరసింహుఁడు ప్రవేశించును.

రాణా—రాజ్ఞీ

రాణి—నాథా! మిమ్ము వెదకుచుంటిని.

రాణా—నీవు మానసిని దూషించితివా?

రాణి—దూషించు టెందులకు?

రాణా—ఆమె విలపించుచున్నది.

రాణి—(విస్మయమున)—విలపించు టెందులకు?

రాణా—పోయి యామె నూరడించుము.

రాణి—తెలివిమాలిన బాలిక! వంతఁజెందుట కామెను నేను సుంతైన నిందింపలేను. పిల్లదాని కేమియు భయము జెప్పక మీ రామెను కడు గారాబమునఁ బెంచుటంజేసి యామె భయరహితయై మెలంగుచుండెను. యుక్తాయుక్తజ్ఞాన మామె కావంతయు లేదు. ఇప్పుడే అజయసింహునితో—

రాణా—రాజ్ఞీ! నీవామెనట్లు నిందించిన నేనొప్పువాఁడనుగాను. ఆమె విషయమై కడు జాగరూకతతో నుండుము. మన తనయ యెవ్వతయో నీవెఱుంగుదువా?

రాణి—ఎవ్వతెయేమి? మనతనయ మనతనయయే!

రాణా—నేననునదదిగాదు. ఆమె నిక్కువంబుగ నెవ్వతెయో యెందుండివచ్చి మననిలయమున నవతరించెనో యిపుడుకూడ నేనెఱుంగఁ జాలకున్నాను.

రాణి—మీ యుపన్యాసార్థము నాకు బోధపడుటలేదు.—తనయ యిపుడెందులకు విలపించుచున్నదో జూచెదగాక. భయభక్తులు లేనికతన ప్రాణములఁ దీయుచున్నది.

(నిష్క్రమింపబోవును)

రాణా—రాణీ! ఇటుజూడు—

(రాణి తిరిగివచ్చును)

రాణా—నీవెప్పుడును మానసిని నిందింపకుము. స్వర్గరశ్మి మర్త్యలోకమున నవతరించెను. నీవుకోపించినచో నాప్రభయంతర్ధానమగును.

(హతాశభావమున నుస్సురనుచు రాజ్ఞగిరుక్కున వెడలిపోవును.)

(పీఠముపై నుపవిష్టుండయి యాకసముపై దృష్టిసారించి)

మానవజీవనంబంతయు స్వప్నసన్నిభంబు. నభమెంతనీలముగ—నెంతస్వచ్ఛముగ—నెంతగాఢముగ! గన్పట్టుచున్నది. అంబరాధోభాగమున ధూసరాంబుద శ్రేణులు మారుతస్రోతమున నెంతవింతగ గొట్టుకొని పోవుచున్నవి.—అవి యలసములై యుదారములై—మంథరములై యొప్పుచున్నవి. ప్రకృతి జీవనసముద్రతరంగములకేల నాజలధరంబులు గ్రింద మీదుగ బర్వులిడుచుండెను. ఈయలస ప్రకృతి సౌందర్యమొకానొకప్పుడు భీషణాకారము ధరించును!—అభ్రభాగమంతయు జీమూతపటలముల భయంకరగర్జనలచే ముఖరితమగును—ఝంఝామారుతతీవ్రాఘాత నిర్మూలితములై మహీజంబులు భీషణంబులై చూపట్టు! తదుపరి విశ్వమంతయు శాంతి నికేతనము చాడ్పునం గన్పట్టు!

(రాణా మైమరచియున్నయవసరమునగోవిందసింహుండుప్రవేశించును)

రాణా—ఎవరది? గోవిందసింహా? ఇప్పుడాకస్మికముగ వచ్చితివేమి?

గోవింద—మహారాజా! మీవారుదేశము నాక్రమించుటకై మొగలుల్క్రొత్తసైన్యము మరలవచ్చినది.

రాణా—అందకక్కజమేమున్నది? దేవారు సమరమున రిపులందరు నొక్కమారే చత్తురని నేదలపలేదు. రసపుత్ర రాజ్యముంబూర్తిగ నిర్మూలించునంతదనుక మొగలాయిలు నిదురింపనేరరు.

గోవింద—ప్రభూ! తామింకను సమరసన్నాహముల నలుపు చుండుటలేదేల?

రాణా—సమరసన్నాహములతోఁ బ్రయోజనమేమి?

గోవింద—దేవా! తామికఁ బోరొనర్పరా యేమి?

రాణా—పోరా! ఎందులకు?

గోవింద—ప్రభూ! అట్లనుచుంటిరేమి? మొగలు లీమారు నిస్సంశయముగ మీవారు నాక్రమించుకొనియెదరు. స్వాతంత్ర్య రక్షణము మనకర్తవ్యముగాదా?

రాణా—గోవిందసింహా! కర్తవ్యార్థమై మనము సలుపు యత్నములన్నియు భగ్నములగుట నిక్కువము! దృఢచిత్తులై మీవారు నొక్కమారుగఁ గబళింపగమకించు రక్కసుల నుక్కడఁగింపఁ జాలుదుమని దలంపకుము!

గోవిందసింహుఁడు [డగ్గుత్తికతో]—ప్రభూ! నిక్కువముగ మీరాల మొనరింపరా?

రాణా—నిక్కముగ నొనరింపను. ఒకమాఱు యుద్ధముచేసి సర్వం బెఱింగితి!

గోవింద—ప్రతివాద మొనరింపక!— ఉద్యమము సలుపక!

రాణా—ఉద్యమమీవరకే ముగిసెను. దేవారు రణమున రసపుత్ర వాహిని యందర్ధభాగము మడిసెను. ఇపుడు మొగలు చమూసమూహముతో సమముగనాహవ మొనర్పఁదగు సేనలు మనకడనేవి?

[సత్యవతి ప్రవేశించును]

సత్యవతి—రాణా! భూగర్భమును భేదించికొని బలోపేతములైన వాహినులెన్నేని యుద్భవములగును.

రాణా—చారణీ! నీవా!

సత్యవతి—ప్రభూ! మీవారునాక్రమించుకొనఁ బద్ధకంకణులై మొగలాయీలు దాడివచ్చుచుండిరని వింటిని. మీవారింకను నిశ్చింతతో

నున్నట్లు గన్పట్టుచుండెను. ప్రభువింకనునిదురనుండి మేల్కాన లే
దని గ్రహించితిని. మేల్కొలుప నరుదెంచితిని.

రాణా—గాయనీ! భండన మొనరింప నాకిఁకనిచ్ఛ లేదు. ఈపర్యాయము
సంధిగావించెదను.

సత్యవతి—మహారాణా! దేవారుసమరజయానంతరము సంధిగావించు
టేల! మహౌన్నత్య శిఖరమునుండి యాకస్మికముగ గభీరదుర్యశః
కూపగర్భమున లంఘింపదొరకొందురా?

రాణా—చారణీ! దేవారు కదనమున మనము జయప్రదుల మగుట
నిక్కువమే! కాని ఆయాలమున మనవాహినియందర్ధభాగమునమ
సెననియు, వీరరక్తమొసఁగి మనమావిజయమును క్రయించుకొంటి
మనియు నీవెఱుంగవా?

సత్యవతి—వీరస్వర్గమునొందిన వీరులకై బరితాపమొందకుఁడు. శూర
రుధిరమే జాత్యుద్ధారణ మొనరించును. మాతృభూమి శ్యామలో
ర్వరగజేయును. ఏసీమయందు శూరులు దేశమునకై ప్రాణములు
బాయుదురో, ఆసీమ దుఃఖము నొందజాలదు. ఏవర్షమున వీరులు
మఱియకుందురో—ఆదేశము త్తలమునొందును!

రాణా—గాయనీ! మరల నాహవమునకు దొడరనాకిష్టములేదు. ఈ
యాలమునకంతములేదు. పదుగురు సైనికుల వెంటనిడుకొని విశ్వ
విజయుండైన ఢిల్లీంద్రు నెదురుకొనుట మనయవిమృష్టోన్మత్తతను
బ్రకటించుటగాదా?

సత్యవతి—ప్రభూ! ఉన్మత్తతయా! అట్లగుచో నీయున్మత్తతయుండు
నెలవు మనుష్య వివేచన విచారములకంటె నెక్కువ యూర్ధ్వమున
నున్నది! విశ్వమంతయు నీయున్మత్తతాచరణతలముననే దలవంచి
పడియుండును! స్వర్గనిర్గతమహాప్రభయే, యీయున్మత్తతమస్తక
మున మకుటమై తనరారును. ఉన్మత్తతయందురా! ఈయున్మత్తత

వలనగాకున్న నెవ్వరే కాలమునందైన నెట్టిమహత్కార్యమునైన నగావిం
పఁగలుగుదురా?

రాణా—కానియీయాకదనఫలము నిశ్చితమృత్యువేగదా!

సత్యవతి—అధీనతామృత్యువుల రెంటిలో నొకదానిఁ జేర్కొనుట ప్రతాపవంతునకు మిగులఁ గష్టముగఁ గన్పట్టుచుండెనా! మరణభయమున నెవరైన కౌశేయమూల్య రత్నమును దస్యుకరములఁ దిడుదురే! బహుపురుష సంచితంబై, బహుశతాబ్దస్మృతిస్థానమై సర్వస్వంబైన మీవారును, ప్రాణభయముచే, పోరుసలుపక యే శత్రుకరములం దిడుట యత్యుద్ర రత్నమును గోల్పోవుటే గాదు దస్యులైన మొగలు లెట్టులైన సఫలమనోరథులు గానిశ్చయించుకొనిరి. శూరులైన రసపుత్రు లట్టి భీరులఁ బ్రతిఘటింప వెఱపొందిన మానవులందఱు వెఱఁగుపడరా? నిశ్చితమృత్యువే ప్రాప్తింపవచ్చును! మానవుం డెన్నటికైన మత్యువు బారినుండి తప్పి చనఁగలఁడా? అపయశంబునకుఁ దలయొగ్గి సుఖంబుండదలఁచు మీకీ యుర్వి శాశ్వతంబగునా? ప్రభూ! ఇఁక మేల్కాంచుఁడు! మొగలులు ద్వారసమ్ముఖమున రణభేరిని మ్రోగించుచుండిరి! ఇది స్వప్నదృశ్యములఁ గాంచు తరుణముగాదు!

రాణా—వెలఁదీ! నీవెవ్వతెవు? ఏమి నీవాగ్గర్జనము! ఏమి నీచతుర్విద్యుచ్ఛక్తి!! ఏమి నీయంగప్రత్యంగచలనజనిత ఝుంఝూప్రకంపము!!! ప్రభాకరుభంగి భాస్వరంబవై, వారిప్రపాతము పగిదిప్రబలంబవై, వజ్రమువడువున భీషణంబవైన నీవెవ్వతెవు!—నీవుగానము సలుపుచారిణీమాత్రమవుగావు!

సత్యవతి—నేనెవ్వతెనో యెఱుంగఁ గోరుదురా! అట్లైన వినుఁడు ఇఁక గోపన మొనరించుటెందులకు? రాణా ప్రతాపసింహుని సోదరుఁడైన సగరసింహుని నందనను—సత్యవతియను దానను!

రాణా—ఏమి! నీవు నగరసింహుని పుత్రివా!

సత్యవతి—అట్లని తెలుపుటకు బిడియపడుచుంటిని. లజ్జచే నాయుత్తమాంగము వంగిపోవుచున్నది. అట్లయ్యు తండ్రియొనర్చిన పాపంబునకు నేఁడుతనయ తనచేతనైన ప్రాయశ్చిత్తము గావించుచున్నది! నాతండ్రి నేఁడుతనయన్నకొమరునకు సింహాసనవ్యాప్తిఁ గావింపఁ జిత్తూరు దుర్గమునకుఁ బోయి, యచ్చోఁ గృత్రిమ రాణాయైయుండెను. నగరసింహుని తనయనైన నేను నేఁడతనికి విరుద్ధముగ మీవారు వాసులనుత్తేజితులఁ గొనరించుచుఁ బ్రచ్ఛన్నవేషధారిణినై రాష్ట్రమునందంతటను పరిభ్రమణ మొనరించుచుంటిని! ప్రతాపుని సోదరుఁడు మీవారు ప్రభువు కాఁజాలఁడనియు, అతఁడు మొగలాయీల క్రీతదాసుడనియుఁ బ్రజలకుఁ దెలుపుచుంటిని. కేటిదనుక మీవారు రాష్ట్రమందొకఁడైన నాజనకునకు సుంకంబొసఁగ లేదను విషయము ప్రభువెఱిఁగియే యుండవచ్చును!

రాణా—సోదరీ! యెఱుంగుదును.

సత్యవతి—రాణా, ఏ దేశస్వాతంత్ర్య రక్షణంబేను సర్వసుఖంబులఁ ద్యజించి, ఆత్మజులఁ బాసి గిరికందరాంతర గహనాదులందు గ్రుమ్మరుచు, స్వదేశమహిమను గీర్తించుచు, క్షుత్పిపాసబాధలచేఁ గుందుచుంటినో, ఆసీమ—నాప్రియమైన మేవారుసీమ నేఁడరిక్త శునకశాబకము నొసఁగు కీర్తి రిపులకీయఁ దలంచుచుంటివి! సోదరా!—[ఆమె నేత్రములనుండి బాష్పకణములు జొటజొట రాలును. కంఠము రుద్ధమైపోవును! ఆమె నిమీలితనేత్రయై మూర్ఛిల్లఁబడును.]

రాణా—సహోదరీ! శాంతింపుము. నీవు నాసోదరి!—మహిళారత్నంబవు! రాజకుమారి! నీవే, దేశార్థము జీవనోత్సర్గముఁ గావింపుమంచు పురుషుండైన నీసోదరుఁడు రజపుత్రపరివృతుండై మాతృదేశార్థమై

యసువులఁ బాయసాహసింపడా! గోవిందసింహా! సమరసన్నద్ధుఁడవుగమ్ము! సైనికులఁ మేలొ్కలుపుము!! రణభేరీ మ్రోయింపుము!!!

(తెరపడును)

## తృతీయదృశ్యము.

మీవారునందు సయ్యాదు అబ్దుల్లాశిబిరము రాత్రికాలము.

అబ్దుల్లా, హెదాయత్, హుస్సేనులు మువ్వురు ప్రసంగించుకొనుచుండిరి.

అబ్దుల్లా—ఈనెలవుననున్నతములైన పర్వతము లెన్నో యున్నవి.

హెదాయతు—స్వామీ! అవును.

అబ్దుల్లా—నీవు తావోసఁగినపుడు రసపుత్రులేదిక్కుగా నాక్రమణమొనరించిరి?

హెదాయతు—నేఁదావోసఁగనే లేదు.

అబ్దుల్లా—తావోసఁగకపోవుటేమి? వారు నిన్ను బంధించికొనిపోయిరి గదా! తావోసఁగలేదని వచించుచుంటివేమి? తావోసఁగుటన్న నింకేమి?

హెదాయత్—వారు నన్ను బంధింపఁజాలకపోయిరి. చమత్కారపూర్వకముగ నేనే బంధనమునకు లోనైతిని.

అబ్దుల్లా—ఓహో! చమత్కారపూర్వకముగ బంధింపఁ బడితివా? దయాపూర్వకముగఁ దన్నులనేమైన దింటివా?

హుస్సేను—స్వామీ! అతఁడెప్పుడును చమత్కారకృపలచే నిండియుండును. రసపుత్రులు సమీపింపగనే దీర్ఘాలోచన సలిపి మనసైనికులొరలనుండి తమకత్తులవెలికిఁదీసిరి. పిదప వారలాకోశంబులనల్లన దమ పర్యంకములపైనిడిరి. అట్లుంచి వారలందఱు దమమీసంబుల వడివేసిరి. తదుపరి—వంటముగిసెనా లేదాయనిచూచిరి. కడుపులు

నింపుకొనకుండ బోలేరుగాన వంటయైనపిమ్మటఁ బులావుతో జాల ప్రొద్దువాఁడు కడుపు నింపుకొనిరి. భోజనము ముగియగానే, కరప్రక్షాళనంబొనర్చి మఱచి వారలందఱు పాదప్రక్షాళనము గావించుకొని హుక్కాలఁబీల్చి, శిరోజములు లేనికతన దమ దీర్ఘశ్మశ్రువులకు సుగంధతైలంబు రాచికొని దువ్వెనల వానినందముగ దువ్విరి. అప్పటికి రసపుత్రసైనికులు శిబిరద్వారమును సమీపించి లోఁబ్రవేశింపనుంకించుచుండిరి. మనసైనికు లంకరొక్క మారుగ మరల మీసంబుల వడివేసి సదర్పముగ దర్పణంబులఁదమ మూర్తులఁజూచుకొని రండు రండంచు సమరసన్నద్ధులైరి. కాని పర్యంకములపై దత్పూర్వము కత్తులను ఒరలను డగ్గర డగ్గరగ కలిపియుంచిన కతన దత్తరమున దరవాలులని పొరపడి పట్టెమొరలు మాత్రము చేతబట్టుకొని భండనభీములై శాత్రవహనన దీక్షతో తూర్పుదిక్కునకోని పడమటిదిక్కుగ దుమికిరి.

అబ్దుల్లా—అందఱునొకే తెలుఁగున బొరపడిరి కాబోలు!

హెదాయత్—స్వామీ! ఇదంతయు దైవదుర్విపాకమని చెప్పవలెను. ఎప్పటికేమగునో జెప్పఁజాలము.

అబ్దుల్లా—హుస్సేనూ! మనవీరశిఖామణులు మఱొకమహత్కార్యమొనరించినఁ గడునుత్తమముగ నుండెడిది!

హెదాయత్—అదేమి?

అబ్దుల్లా—పొట్టనిండ మెక్కి తదనంతరంబ తరవారుల, నొరలఁబత్యేకించి పర్యంకమునకు ప్రక్కలనుంచి పిదప నల్లనబొన్నులపై బవ్వళించి తాళవృంతముల విసరుటకై భృత్యులని యమించి హాయిగనొక్కమారు నిద్రించి, మేల్కాంచిన పిదప నిర్మానుష్యమైన సమర రంగమునకు బోయిన గడుయుక్తముగ నుండెడిది!

హిదాయత్—స్వామీ మేముగూడనట్లే తలంచితిమి. కాని శత్రువులు శిబిరము జొచ్చుచుండ నేమి జేయగలము?

అబ్దుల్లా—అవునదివాస్తవమే! పాపము మీకు నిద్రించుటకు సమయము చిక్కలేదు. పిదపనేమి చేసితివి?

హిదాయత్—ప్రభూ! ఇకనేమి జేయుదును!

అబ్దుల్లా—"అయ్యలారా! చేతులెత్తి సలాముచేసి తలగాచు" డనుచుంటి కిట్టిని కాంబోలు.

హిదాయత్—నేనట్లు లేదు! కాని వారితో నపుడే మేమో బలికితిని.
— ఏమి బలికితినో జ్ఞాపకము వచ్చుటలేదు.

అబ్దుల్లా—పోనిమేమిచెప్పినను, మనసునకు నచ్చుటచే ఉర్దూ సాహిత్యమునకు మిగుల లోపము గలుగు మహావిషయమును జెప్పియుండవు—తురకజనుత్కార పూర్వకముగ లొంగియుందువు.

హిదాయత్—అవును. కాని బంధితుడనగుటకు, బూర్వమొక వృద్ధసేనాని, నేను వేరొకడనని పొరపడి నాపై గుండువదలెను.

అబ్దుల్లా—తరువరి రాణా తనయ నీకు బరిచర్య గావించెననివింటిని.

హిదాయత్—స్వామీ అవును రాకుమారి వీరకన్య— అందుచే వీరులనెట్లు సేవింపవలయునో యెఱుంగును- ఆమె మిగులసుందరమైనది. (హుస్సేను నుద్దేశించి) హుస్సేనూ! అట్లుకాదా?

హుస్సేను—అవును హిదాయతు చెప్పినది నిజమే.

హిదాయత్—హుస్సేనూ! ఆమె ముఖము మిగుల విలక్షణమైనది గాదా?

హుస్సేను—నేగాదనలేదు. కాని ఆమె యందముకంటె నీయాదము బాగున్నది.

అబ్దుల్లా—అందువలననే రాణాతనయ—

హిదాయత్—ప్రభూ!మీతో నవ్విషయమునునేమి జెప్పసాహసింతును

అబ్దుల్లా—ఆమెకతనుసుందరియా?

హెదాయత్—ఊఁ! (అవునను సూచకము)

అబ్దుల్లా—నీతో నామె యేమనియెను?

హెదాయత్—పాపమాయువతి యేమేమియో బలుకఁ దలఁచెను. కాని ఆమె కాత్రముతో సమముగ సాహసము లేదు. దానం జేసి తనయభిప్రాయమును వెల్లడింపలేకపోయెను. ప్రాణేశ్వర పదమందలి "ప్రా" అను శబ్దము నుచ్చారణ మొనరించెను. "ణే" అని కూడబలికినట్లు దోఁచెను. కాని అట్లనెనని యూహించి జెప్పఁజాలను. అనృతమాడుటెందుకు కానినేనామె ముఖముపై నొక తీక్ష్ణ కటాక్షము బఱపితిని.—దానివలన నే నట్టి పురుషుఁడనాయంచు నామె గ్రహింపఁగలిగెను. కాన దాఁబలుకఁ దలఁచిన దేదియో బలుక నేరకపోయెను.—ఇఁక కార్యము లేదని యెఱిఁగి సాహసముజూపజాలకపోయెను.

అబ్దుల్లా—తదనంతర మేమయ్యెను?

హుస్సేను—రాణాభయమొంది వీరుఁడైన మొగలు సేనాధిపతిని వదలివైచెను.

హెదాయత్—అట్లొనరింపకున్న నాసామర్థ్యమును రాణాకు జూపియేయుందును.

అబ్దుల్లా—అవును. ఆరాణా మిగుల నదృష్టవంతుఁడగుటంజేసి నిన్ను చిరకాలములోనే వదలెను. నీబలశౌర్యములతనికి దెలియక పోవని దలంచెద.

హెదాయత్—స్వామీ! యుద్ధ శిక్షణ కొఱకై నేనెంతయో విత్తమును వెచ్చించితిని. అందుచే నారణ నైపుణ్యమునిర్వాచ్యమైనది. రాణాయెట్లో యీవిషయ మెఱింగియుండును.

అబ్దుల్లా—నిజమే—సాహేబూ!—యీప్రదేశమునందలి పర్వతములు నిశీథాంధకారమున నెంతభయంకరముగ గన్పట్టుచుండెనో?

హెదాయత్—అందుచే నాకుంగూడ భీతి గలుగుచున్నది. ఇచ్చోట రెండుమూడు నదులుకూడ నుండెనని దోచుచున్నది.

అబ్దుల్లా—సర్వంబు రేపటియుదయమున బాగుగఁ గన్పట్టును.

(దూరమునుండి ఫిరంగుల భయంకర శబ్దము వినవచ్చెను.)

అబ్దుల్లా—ధ్వనియెచ్చటినుండి వచ్చుచున్నది.

హెదాయత్—హుస్సేనూ! అయ్యో! యిదేమికర్మ మోయీ! అల్లా! అల్లా!!

హుస్సేను—ఈపర్యాయము రాణా స్వయముగ భండన మొనరింప నగుదెంచెను. రజపుత్రు లుగ్రులై సమరమునలుపుదురు.

అబ్దుల్లా—హుస్సేనూ! సైనికులందఱిని రణసంసిద్ధులై యుండవలసిన దని నాయాజ్ఞగా వారలకెఱింగింపుము.

## చతుర్థదృశ్యము

### చిత్తూరు దుర్గాభ్యంతరము—రాత్రికాలము

[అరుణసింహుఁడొకశయ్యపై బరుండి యుండెను. రెండవశయ్య శూన్యమై యుండె. నగరసింహుఁడు దుర్గమధ్యమునఁ [illegible]రు చేయుచుండెను.]

నగర—(ఆత్మగతమున) నాకీచిత్తూరు దుర్గమొక కారాగారమువలెఁ గన్పట్టుచున్నది. దుర్గప్రస్థరములు మిగుల బురాతనములైనవి పరిసరభూరుహములుకూడ ననాదినుండియు బెరుగుచున్న కతన మిగుల భీషణములయి భూతములభంగిఁ గాన్పించుచుచున్నవి నిశీథసమయములందుఁ బ్రచండమారుతాహతములయి యీభూజములన్నియు నర్తన మొనరించు శాకినులలీల హృదయమున

కెంతయో భయము గలుగజేయును. నిశాసమయములందీ మార్గ మందలివృక్షము లెట్టులుండునో దోపకున్నది. గభీరాంధకార మగ్నములై యున్నతటి వానిఁగాంచిన వ్యక్తి ప్రేతభాధనొంది యచిరకాలములో మరణించి, తాఁగూడఁ బ్రేతమగుటకు సందియమేమియు లేదు. ఆయనంతాకాశసముద్రమండలితారకాచయము లీచోట దృగ్గోచరములుగావు; కానియీదండకారణ్యము చొచ్చిన పిదప, దండకారణ్యమందుఁ గ్రుమ్మరిన రాముని చరిత్రం బొకించుక జదివితిని. ఇంతియగాక ఛాయనీ గాయకుల శ్రావ్యగానముల వలన బూర్వపురుషుల యద్భుత చరిత్రములు నెఱింగితిని. వారల పారప్రతాపముఁగలవారనుట కేమియు సందియములేదు. వారు భీరులని చింతించుట కేమియు వీలుచిక్కుటలేదు. నేఁడేలకో నా గుండియ లవియునట్లున్నవి. అవును. నిర్జనదుర్గము! అంధకారము! ఝంఝూమారుతము!! అయ్యయ్యో! ఇదేమి దృశ్యము. సేవకా! సేవకా!!

(చౌకీదారు ప్రవేశించును)

ఏమిరా! నిదురించుచుండుట లేదుగద! ఎవరినిలోనికిరానీయకుము. కడుజాగరూకుఁడవయి యుండుము. —ఓయిబాబో! మరలనదేమి?

గస్తు—ఏమది!

సగర—అదిగోనాయనా! ఈలాగుననేవచ్చుచున్నది! అయ్యో! అయ్యో! అదినన్ను చంపివేయునేమోబాబూ?

గస్తు—అయ్యా! అదేమియుగాదు. పెద్దగాలిమాత్రమే!

సగర—ఏమిరా! మీదేశములో నింత పెద్దగాలియున్నదేమి! ఇచ్చటఁ జెట్లుకూడ యుద్ధముజేయునావేమి! అదిగో! అదిగో! చూడు! అవెట్లుపోరుచున్నవో!

గస్తు—రాణా! చెట్లుపోరుటేమి. గాలిచేనవి యెట్లూగులాడు చున్నవో?

సగర—ఇఁకనన్ను రాణాయనకురా! ఇఁకేమి రాణా! రాణాపని ముగిసినది! ఇప్పుడో మఱికొంతసేపటికో యీభీషణవాయువునందు గలసినాయసువులెగసిపోవును! సేవకా! మీదేశములో నీయంధ కారమింతగాఢముగ నున్నదేమిరా? ఇటువంటి చీఁకటులు మఱెం దునుగానరావు.

గస్తు—అవును బాబయ్యా!

సగర—ఓరే! ఇచటికింత యంధకారమెటులవచ్చెను? ఎవ్వరైనలోపలఁ జొచ్చెదరేమోయని భయపడుచుంటి. కావలివారందఱు నిదుర పోవక జాగరూకులైయుండుఁడు. దివ్వెల వెలిగించితిమిరములఁ దఱిమివేయుఁడు. ఎవ్వరైనను యలికిడియైనచో, ఖడ్గపాణులై ముందు నకు దుముకుఁడు. లోనికి రాఁదలఁచువారల సంహరింపుఁడు. కాని మైమఱచి యొకవ్రేటు నాపైఁగూడ వేయకుఁడు. మిగుల జాగ్రత్త యని యందఱితోడను జెప్పుము. పిలచినపుడు పరువెత్తి వచ్చు చుండుము—ఇఁకపొమ్ము.

[కావలివాఁడు నిష్క్రమించును.]

సగర—అరుణా! నిదురించుచుంటివేమిరా! ఏమి నీనిర్భయము! ఇటు నటు దొరలుచు నావులించుచుంటివా లేదా! ఈయంధకారములో నాకేమియు గన్పించుటలేదు! నేత్రములు మూతవడుటలేదు! ఒక పర్యాయము లేచి నాయొద్దఁగూర్చొనరా! ఈదుర్గములో మాపూ ర్వులెల్లఁ జెడివారో దోఁచకున్నది! మిగులసాహసులుగాని వో వాఁచోనుండఁజాలకుందురు! ఏమిరా! అరుణా! లేచవేమి అయ్యో! నాగుండియలు గొట్టుకొనుచున్నవి. అయ్యో! మరల— సేవకా! సేవకా!

(కావలివాఁడు ప్రవేశించును)

సగర—నాయనా! మెలకువగనేయున్నారుగదా! మఱచి నిద్రించెదరే మోసుఁడీ! అపుడపుడువచ్చి నన్ను జూచుచుండుఁడు! భయమే మోయెఱుఁగని నాకింత భయమేల యొదవుచుండెనో దెలియకున్నది! ఇఁకపొమ్ము జాగ్రత్త!

[కావలివాఁడు నిష్క్రమించును]

సగర—అరుణా! అరుణా!!

అరుణ—ఏమిదాదాజీ!

సగర—సజీవుఁడవైయుంటివా! పిశాచములు మ్రింగివేయలేదుగదా! నాయనా! ఈరాత్రి కొంచెము మెలకువగలిగియుండుము! నాకుఁ జాలభయముగలుగుచున్నది!

అరుణ—దాదాజీ! భయమేమి! నిదురింపుఁడు! (మఱియొక వైపునకు దిరిగి నిదురించును.)

సగర—బాగుకుట్రా! నీకేమి! ఒకమాటతోఁ దేల్చివైచితివి! ఈ వైపున-అదిగోమరల! సేవకా సేవకా!-ఏమిరా! నిదురించుచుంటివా! ఓ సేవకా! అరుణా! అరుణా!!

అరుణ—ఏమిదాదాజీ! నన్ను నిదురింపనీయరాదేమి!

సగర—అదేమో వినుచుంటివా?

అరుణ—(విసుగున) అదేమీగాదు పెద్దగాలి (ప్రక్కకుదిరిగి పరుండును.)

సగర—అదే! గాలియనెదవేమిరా! గాలియెప్పుడైన మాటలాడునా! అవిగోమాటలు వినఁబడుచున్నవి! (సభయమున) ఓ! ఓ! అమ్మయ్యో!

అరుణ—అదేమి దాదాజీ!

సగర—అవిగో భూతములు!

**అరుణ**—దాదాజీ! భూతములనెదరేల! ఏవీభూతములు?

[నగరసింహుఁడు భయాతురుఁడై, యంగుళినిర్దేశమున నంధకారమున నేమేమోజూపుచు గజగజవడంకసాగును.]

**అరుణ**—దాదాజీ! నాకేమియుఁ గన్పించుటలేదు. మేలుకొనియుండియే మీరు స్వప్నమును గాంచుచున్నట్లు దోఁచుచున్నది!

**నగర**—(దూరముగ జూపుచు) భూతములారా! నేనిచ్చటకు రాఁదలఁచుకొనలేదు. నన్ను వారలు బలవంతముగ బంపిరి! నేను రానుగాను! అమరసింహుఁడే రాణా! నన్ను మీరు జంపకుఁడు! ప్రాణములతోఁ బోనీయుఁడు!

**అరుణ**—దాదాజీ! దాదాజీ!

**నగర**—ఎవరువారు? చిత్తూరురాణా భీమసింహుఁడా! తక్కినవారు! జయమల్! ప్రతాప్! నాయనలారా! నన్ను మన్నింపుఁడు! రక్షింపుఁడు! నేను రేపేబోయెదను! ఇఁక మీదుర్గమందు నిలువను. ఆతక్కుంగలవారలెవరు? అయ్యో! నాపైఁ దీక్ష్ణదృక్కులఁ బఱపకుఁడు! నన్ను చంపకుఁడు! చంపకుఁడు! అయ్యో! అయ్యో!!

[ఇట్లువలికి నగరసింహుఁడుచ్చైస్స్వనమున నున్మత్తురీతి నఱచుచుఁ జిందులఁద్రొక్కుచు భూపతితుఁడయ్యెను. అరుణసింహుఁడు దాదాజీని బట్టుకొనియెను. కావలివారు లోనఁ బ్రవేశించిరి.]

**అరుణ**—వేగ సలిలముఁ గొనిరండు. దాదాజీ మూర్ఛితుఁడయ్యెను!

---

"Sugra, who abandoned Pertap (Pratap) and went over to Akbar, was selected; the sword of investiture was girded on him by the emperor's own hands, and under the escort of a Mogul force he went to reign amidst the ruins of Cheetore. (I may further add) Her grandeur, even in desolation, is beautifully depicted at this very period by the chaplain to the embassy from Elizabeth to Jehangir, the members composing which visited the capital of the Seesodias in their route to

పంచమదృశ్యము

ఉదయపురరాజాంతపురము—మధ్యాహ్నకాలము.

మానసి కల్యాణులు ప్రసంగించుకొందురు.

మానసి—కల్యాణీ! కుష్ఠరోగులకొరకు నే నొక యాశ్రమమును స్థాపించితిని. అల్పకాలములోనే యనేక కుష్ఠరోగులకది యాశ్రయమైనది. వారల దుస్థితిఁ గాంచిన వారికెంతేని సంతాపము గలుఁగక మానదు.

కల్యాణి—మానసీ! నీవు కడు ధన్యురాలవగుదువు!

మానసి—కల్యాణీ! నన్ను త్సాహపఱచి నాహృదయమునకు బలము నొసఁగుము.

కల్యాణి—రాకుమారీ! ఇకార్యమున నీ కెవ్వరు నడ్డుపెట్టుచుండుట లేదుగదా.

మానసి—జనకుఁడు తక్క దక్కుంగలవారలందఱు నాకెన్నేని యంతరాయములఁ గల్పించుచుండిరి. రాజపుత్రి యిట్టి క్రియల నాచరింపఁగూడదఁట. నృపదుహితలేరును సుఖింపఁ గూడదు గాఁబోలు.

కల్యాణి—ఇది మిగుల సుఖకరమైన కార్యమా?

మానసి—కల్యాణీ! నిక్కముగ నిది సుఖోపేతమైనది. పరుల సుఖింప జేయుటే ప్రకృతసుఖము. ఆత్మసుఖార్థమై చేయు యత్నము లెల్లపుడు భగ్నములు గాక మానవు. ఘాతుకమృగంబు నిజశిశువులనే వధించి, వాని పలలముఁ గుడుచు తెఱంగున స్వార్థవాంఛనరుల కెంతేని యరిష్టముఁ దెచ్చిపెట్టును.

---

...jmeer." But Sagara made himself worsely of our appreciation by his miraculaus metomorphosis.

కల్యాణి—నా సోదరుఁడు కూడ నీ యట్టులే బలుకుచుండును. అతఁ నీశిష్యుఁడంచు దలంచెద. అజయుఁ డన్ని వేళల నీ నామోచ్చా ణమే సలుపుచుండును.

మానసి—అటులా !

కల్యాణి—అతఁ డజస్రము నిన్నుఁ బూజించునని చెప్పవచ్చును. "నీ వామె యాత్మ హారిద్వారమున నెప్పుడైనఁ దీర్ఘస్నానమాచ రించు" మం చతఁడు పలుమారులు నాతో వచింపుచుండును.

మానసి—కల్యాణీ! అతఁడు తిరుగ గన్పించుట మానివైచెనేమి! మానసి నీ దర్శనోత్సుకయై యున్నదని నీవు వాని కెఱింగింపుము. నే నతనిఁ గనుఁగ్రేవ—కల్యాణీ! అజయసింహుని జూడవలెనని నే మిగుల నభిలషించుచుండును.

(పరిచారిక ప్రవేశించును)

పరిచారిక—రాకుమారీ ! చిత్రపటములనమ్ము వృద్ధురాలొకర్తుక యరుదెంచెను.

మానసి—పటములను విక్రయించునా ?

పరిచారిక—అవును.

మానసి—ఆమెను లోనికిఁ గొనిరమ్ము

[పరిచారిక నిష్క్రమించును.]

మానసి—నీ సోదరుఁడు దినమంతయు నేమిచేయుచుండును.

కల్యాణి—ఎందెందో గ్రుమ్మరి అతఁడు నిశీథులందు మగుడివచ్చు చుండును. ఎచ్చోటి కరిగితివని ప్రశ్నించిన నెవరికో యొక రోగికిఁ బరిచర్యఁ గావింప నరిగితిననియు నెచటికో యాత్రరక్షణమొన రింపఁ బర్విడితిననియు నతఁడు వచింపుచుండును.

(చిత్రపటములమ్ము వృద్ధురాలు ప్రవేశించును.)

మానసి—అవ్వా ! నీవు పటముల నమ్మెదవా ?

అవ్వ—అమ్మా! అవును.
మానసి—ఏవి నీపటములఁ జూడనిమ్ము.

[గంపఁ గ్రిందకు దింపుకొని పటములన్నిఁటి మెల్లగ నొక్కొక్కటిగ వెలుపలకుఁ దీయుచుండును]

మానసి—అవ్వా! నీ దేయూరు.
అవ్వ—ఆగ్రాపురము.
మానసి—పటముల నమ్ముకొనుటకై యింతదూరము వచ్చితివా?
అవ్వ—అమ్మా! నేనన్ని సీమలఁదిరుగుచునే యుందును. దూరమును లెక్కఁజేసినఁ బొట్ట నిండుటెట్లు?
మానసి—(ఒకపటమునుదీసి) ఈపట మెవ్వరిది?
అవ్వ—అక్బరు చక్రవర్తిది.
కల్యాణి—అక్బరుచక్రవర్తిదా! ఏది చూడనిమ్ము—(చూచి) ఆహా! ఏమి యాతీక్ష్ణదృష్టి.
మానసి—ఆదృష్టియందుఁ గారుణ్యౌదార్యములుకూడ మిళితములై యున్నవిజుమీ!—అవ్వా! ఇదెవరిది?
అవ్వ—మానసింహునిది.
కల్యాణి—ఈముఖమందు విషాదనైరాశ్యములు గన్పట్టుచున్నవి.
మానసి—ఆవదనమునఁ గొంచెము వంతదోఁచుచున్నను, ఆత్మగౌరవభావముకూడ నెట్లు గన్పట్టుచున్నదో జూచితివా!—ఇదెవరిది?
అవ్వ—జహంగీరు చక్రవర్తిది.
కల్యాణి—ఏమి యీదాంభికాకారము!
మానసి—దాంభికముతోఁ బాటొకించుక యచల ప్రతిజ్ఞాభావము కూడఁ గన్పించుచున్నది—ఇదేరిపటము?
అవ్వ—ఇది మొగలు సేనాధిపతియైన హిదాయత్ ఆలిఖాను చిత్రపటము! రాకుమారీ! ఇదెంత సుందరముగ నున్నదో జూచితివా?

మానసి—(పటమును కొంచెము సేపు విలోకించి నవ్వసాగెను.)

కల్యాణి—నవ్వెద వేమి మానసీ ?

మానసి—చూడు మిది యొకపిచ్చివాని ముఖమువలె గన్పట్టుచున్నది! వీనికరము లెంతకుఱచగనున్నవో! పాపెడినిపసందుగ దిద్దినను, పాపము వీని శిరోజములు నలుకెలంకులకు బర్వులిడుచున్నట్లుండెను. ఇతఁడు పురుషవేషముఁ దాల్చిన రమణివలెఁ గన్పట్టుచున్నాఁడు. అహంకారశుంతత్వములు వీని ముఖమున దాండవమాడుచున్నవి—అవ్వా! ఈపటమెవ్వరిది ?

అవ్వ—మహాబత్ఖానుపటము.

మానసి—సేనాధిపతియైన మహాబత్ఖాను చిత్రపటమా! చూడనిమ్ము (దానిని తేఱిజూచి) ఇది నిక్కువముగఁ బ్రకృతశూరవదనము! లలాట మెంతయున్నతముగ నున్నదో! ఆహా! ఏమి యీదృక్కుల తీక్ష్ణము! ఇట్టి తేజ, మిట్టిదృఢప్రతిజ్ఞ ఇట్టి యౌదార్య, మిట్టి యభిమాన మొకేముఖమునఁ గన్పట్టుటరిది! కల్యాణీ! తదేకదృష్టితో విలోకించుచుంటి వేమి ?

కల్యాణి—"ఏమియులేదు" (ముఖము వంచుకొనును.)

మానసి—ఆపటములన్నియు నేరివి ?

అవ్వ—మొగలుయుమా రావుసామంతాదులవి.

మానసి—పోనిమ్ము. నాకవి యక్కఱలేదు. అక్బరు, జహంగీరు, మానసింహ, మహాబత్ఖానుల పటములఁ దీసికొనియెదను—ఎంత వెల యగును ?

అవ్వ—మీయిష్టమెంతయో యంతే!

మానసి—"వీనిని దీసికొమ్ము"—(అని బట్ట కొంగునుండి నాలుఁగు బంగారు నాణెములఁ దీసి యవ్వ చేతి కిచ్చును.

అవ్వ—(నాణెములఁ బరీక్షించి) అమ్మా! ఈముద్రపై ముద్రింపఁ
బడిన మూర్తిరాణా అమరసింహునిది కాదా ?

మానసి—అవును.

అవ్వ—అమ్మా! నీపటము నొండు నాకొసఁగెదవా ?

మానసి—నా పటము లేదు.

అవ్వ—ఎవరును నీ చిత్తరువును చిత్రింప లేదా ?

మానసి—లేదు.

అవ్వ—అనుమతి యొసఁగినచో నేఁ జిత్రించి యిచ్చెదను.

మానసి—నవ్వా ! ఎందులకు ?

అవ్వ—ఇట్టి కృపా స్వరూపమును నే నెన్నఁడును జూచియుండలేదు.
దానం జేసి నాకీ యభిలాషగలిగెను. చిత్రలేఖనానై పుణ్యము
నాకు విశేషముగ లేకున్నను నీచిత్రమును చిత్రముగఁ జిత్రింపఁ
గలనని దోఁచుచున్నది.

మానసి—నాకొఱకై నీవేమియుశ్రమఁ దీసికొన నక్కరలేదు.—
స్వచిత్రమును నేఁ గోరను.

అవ్వ—రాకుమారీ !—సంకోచ మేమి ?

మానసి—సంకోచమున కేమి గాని, నీవింక దయచేయుము !

అవ్వ—అమ్మా ! ఆలాగుననే పోయెదను !

మానసి—పొమ్ము.

[అవ్వ బిరబిర యావలి కరుగును.]

మానసి—కల్యాణీ ! తదేక దృష్టితో నెవరి పటముఁ జూచుచుంటివి?

కల్యాణి—“ఎవరి పటమును చూచుచుండుట లేదు [అని చిత్రపటము
లన్నిఁటిఁ దలక్రిందులు గావించి వానిని మానసి కరములనిడెను]

మానసి—“నీవు విలోకించు చిత్తరువునునేఁ జేర్కొందునా ?” [యని
చిత్రపటములనుండి నొక దానిని వెలుపలకుఁ దీసి, దానిని కల్యాణి

కొనఁగి "సఖీ! నీ పీ చి త్తరువును నీకడనుంచుకొనుము. నీవిట్లు లజ్జించు టెందులకు? అతఁడు నీప్రియుఁడు కాఁడా?"

కల్యాణి—(అధోవదనయై) అతఁడు స్వధర్మదూరుఁడు.

మానసి—కల్యాణీ! ధర్మదూరుఁడని దూఱుట ధర్మమా? మానవులందఱొక యీశ్వరుని సంతానమగు తెఱంగున, మనుష్యు లవలంబించు భిన్న భిన్న ధర్మములన్నియు నొక్క యీశ్వర ధర్మము నుండి పుట్టినవని విశ్వసింపుము. ఈవిషయము గ్రహింపఁగలిగియు మానవు లేల వృథాభ్రాతృవైరములఁ గల్పించుకొని ధర్మ మను పేరున నెన్నియో దౌర్జన్యముల సలుపుచు, దామవలంబించిన ధర్మమునకును దమకును కూడ నెంతయేని కళంకము దెచ్చిపెట్టు కొనుచున్నారు. ప్రపంచచరిత్రలన్నియు ధర్మ రక్షణకై యొనర్చిన దౌర్జన్య కథలతో నిండియున్నవి.

కల్యాణి—మానసీ! అతనిఁ బ్రేమించిన దురితంబొదవు నంచు వినుచుందును.

మానసి—ప్రియుని బ్రేమించిన దురితంబు వాటిల్లునా! మనుజుఁ డెంత కుత్సితుఁడగునో వాని నంత గాఢముగఁ బ్రేమించు టుత్తమము. అట్టి ప్రేమ పుణ్యదాయకమైనది. కఠినుఁడగు పురుషుఁడు ప్రణయ పాత్రుఁడు కాఁడని దలంపరాదు. విశ్వబ్రహ్మాండమయమైన యొక యనాది సౌందర్యకిరణజ్యోత్స్న, సర్వధర్మముల, సర్వమానవాంతరాళముల విద్యోతిత మొనరించుచుండు. అమ్మహాజ్యోత్స్న చేఁ బ్రకాశితము గాని హృదయమేదియు లేదు. మహబత్ఖాను అధార్మికుఁడు కాఁడు. అతఁడు ముసల్మాను మాత్రమే! అతఁ డీశ్వరుని బ్రహ్మయని సంబోధింపక, యల్లాయని సంబోధించిన మాత్రానమహాపాపి యగునా?

కల్యాణి—మానసీ! నేఁటినుండి నీవు నాగురువు వనితలఁచెద.

మానసి—ప్రణయమహారాజ్యమున సౌందర్యకుత్సితంబులుండవు— జాతిభేదములు గానరావు. ప్రేమరాజ్యమున బార్థివమైన దేమి యులేదు. దానినిలయము ప్రభాతోజ్జ్వలాకాశము. ప్రేమబంధనమున వ్యవధానములుండవు. భేదైక్యములు-ప్రణయమును దాకజాలవు. ప్రేమయొక స్వోచ్ఛసితస్వచ్ఛ సౌందర్యము. మృత్యువును జయించిన యాత్మ చందమున బ్రహ్మాండ వివర్తనాతి క్రాంత మహాకాలము కరణి. నమరసంగీతసదృశమై ప్రేమయలరారు!— కల్యాణీ! ఏమట్లు జూచుచుంటివి.

కల్యాణి నీరవయై విస్మయమున మానసి-ముఖము ననిమేష లోచనయై వీక్షించును. రాకుమారీ! నీయెదట్టి యమరసంగీతముచే నిండియున్నది సుమీ!

మానసి—(నిరుత్తరయై, యేదియోభావింప సాగెను.)

కల్యాణి—(యామె నుద్దేశించి,) నేఁటికి నాకు సెలవొసంగుము. అనుమతి యొసఁగిన రేపటి దినమున మరలవచ్చెద.

మానసి—కల్యాణీ! అట్లేరమ్ము. అజయసింహుని కూడఁ దోడ్కొనిరమ్ము.

(కల్యాణి నిష్క్రమించును.)

(కల్యాణి యరిగిన పిదప మానసి యిట్లు పాడఁదొడంగెను)

గీ తి.

ప్రేమదానంబు ప్రేమను వృద్ధిజేయు
ప్రేమచేవీచుఁబవనుండుపృథివియందు
ప్రేమచేఁబూవులెల్లఁ బరిమళించు
ప్రేమతో గాగలించు వార్థిని నభంబు
ప్రేమచే గాంతి నిచ్చు నీరేజసఖుఁడు
ప్రేమచే శిలయును మంచురీతిఁ గరఁగు

ప్రేమచే స్వర్గమర్త్యముల్ వెలయు నొకట
ప్రేమకాంతిని విశ్వంబు వెలుఁగుచుండు
ప్రేమ విజయముఁ గీర్తించు విహగతతులు,
ప్రేమగానంబుచే నభోవీథి మ్రోగు.

[*Manasi could as well sing with the immortal Shelle the following lines of rapturous melody and matchless beauty*

The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix for ever
With a sweet emotion;
Nothing in the world is single,
All things by a law divine
In one another's being mingle
... ... ... ... ... ...
See the mountains kiss high heaven
And the waves clasp one another;
No sister-flower would be forgiven
If it disdain'd its brother:
And the sunlight clasps the earth,
And the moonbeams kiss the sea—
... ... ... ... ... ...
... ... ... ... ... ...

(LOVE'S PHILOSOPHY)

(రాణి ప్రవేశించును)

రాణి—అమ్మాయీ!

మానసి—ఏమమ్మా?

రాణి—తండ్రిగారు పిలుచుచున్నారు.

మానసి—ఎందులకు?

రాణి—నీపరిణయతిథిని నిర్ణయింప వలయును—అట్లొనర్చుటకు ముందు నీతండ్రి నీయభిమతము నెఱుఁగఁ గోరుచుండెను. నావచనములేవియు వారికి నచ్చినవి కావు.

మానసి—అమ్మా! తిథినిర్ణయము నావివాహము కొఱకే?

రాణి—అవును. యోధపురాధిపుని పుత్రుఁడయిన యశవంతసింహునకు నిన్నిచ్చి వివాహ మొనరింప నిశ్చయించితిమి. వివాహదినమును స్థిరపఱుప యోధపురాధీశ్వరుకడకు నీజనకుఁడు భూసురులఁ బంపుచుండెను.

[మానసి పేరెలుంగున నేడ్వదొడంగెను.]

రాణి—తల్లీ! ఏలవిలపించుచుంటివి?

మానసి—విలపించుటలేదు—అమ్మా! నేను వివాహమాడను.

రాణి—వివాహమాడవా! యేమట్లనెదవు?

మానసి—వివాహమర్యాదయందే నాజీవనమునాబద్ధ మొనరింపనేరను. నాప్రేమపరిధి యంతకంటెమిగుల విశాలమైనది.

రాణి—నీవట్లన రాదు—ఇఁకనీవవివాహితవై యుండ రాదు.

మానసి—ఎందులకుండ రాదు?-బాలవింతంతువులు బ్రహ్మచర్యము గావింపవచ్చుఁగాని, యవివాహితలగు బాలికలు బ్రహ్మచర్యము గావింపగూడదా? బ్రహ్మచర్య వ్రతముఁ గావించెద నంచు జనకునకెఱింగించెద.

రాణి—తనకు పిల్లనేదియో పిశాచమావహించినట్లు దోఁచుచున్నది. లేక బిచ్చమెత్తుకొనవచ్చు బైరాగియెవండైన మంత్రభస్మమీమెపై జల్లియుండును. కాకున్న నీమెయుల్లంబున నిట్టివైరాగ్యభావములుద్భవింపవు. ముద్దుపట్టినెన్నఁడు నదుపాజ్ఞలందుంచక తండ్రియే యీమె నింతవఱకుఁ దెచ్చెను. దీనికంతకు నాదురదృష్టమే హేతువు. రాణాయీవైపునకే వచ్చుచుండెను. సర్వంబు తనికి దేటతెల్లమొనరించి, నాయుల్లంబుఁజల్లబఱచుకొనియెద.

(రాణా ప్రవేశించును.)

రాణా—అమ్మాయి యేది?

రాణి—మీకడకేవచ్చెను. ఏకతంబుననో బిల్లమతి చెడిపోయినది.

రాణా—నీమతి చెడిపోయెనని దలంచెద. నీవట్లనుటకుఁగారణమేమి?

రాణి—మానసి యవివాహితయై కాషాయవస్త్రములఁదాల్చి కమఁడలువు ధరియించి, యాశ్రమస్వీకార మొనరించునట!

రాణా—సర్వంబును గ్రహించితిని.

రాణి—అదుపులో నుంచకపోవుటచే మానసి మానస మందిట్టి భావము లంకురించెను!

రాణా—నీవేమియు గ్రహింపఁజాలవు.

రాణి—గ్రహింపకపోవుటేమి! మానసియున్మత్తయైనది.

రాణా—ఆమెవలె నీవుగూడ నున్మత్తవై యున్నచో, నిన్ను స్వర్ణసింహాసనాసీనఁ గావించి బూజించెడివాఁడను.

రాణి—(స్వగతమున) ఇరువురొకేతీరున గన్పట్టుచున్నారు! ఇఁకనేనె వరికడకరిగి మొఱబెట్టుకొనవలయును.

రాణా—మానసియెట్టిదియో నేఁగూడ బాగుగ గ్రహింపఁజాలకుంటిని. ఆమెయాచరణములన్నియు స్వర్గీయములైనట్లు కనుపట్టుచున్నవి.

రాణి—అటులగుచో—

రాణా—నీవిఁక నేమియుఁబలుకకుము. మానముతో సర్వంబును వీక్షించుచుందుము.

(నిష్క్రమించును.)

రాణి—సర్వంబు గ్రామ్యంబయ్యె. మానసి యున్మత్తతపైతృకము. భవిష్యమున నే నెన్నిసిలుఁగుల఼ఁ బడవలయునో తోపకున్నది!

(నిష్క్రమించును)

షష్ఠదృశ్యము.

గోవిందసింహుని గృహాభ్యంతరము - మధ్యాహ్నకాలము.

చిత్రపటమొండు గోడపై వ్రేలాడుచుండెను. కొంచెము దూరమునఁ జేతఁ బూలగుత్తిఁ బట్టుకొని నిలువంబడి, కల్యాణిచిత్తరువు నని మేషలోచనయై విలోకించుచుండును.

కల్యాణి—ప్రియా! ప్రియతమా! మదీయనవయౌవన నికుంజపికమా! అస్మజ్జాగ్రత్సుఖస్వప్నమా! భవదసీమమహిమచే నాజగత్తును నూతన రాగరంజిత మొనరించితివి! పృథ్వియంతయు సుఖధామముగాఁ దోఁచుచుండె! హృదయేశ్వరా! నీవు నాసామాన్యజీవనమును రహస్యమయ మొనరించితివిసుమీ! ప్రభూ! ప్రభాతప్రభాకరుఁబోలు భవచ్ఛ్వర్ణలోకమున నాహృదయ కుహరాంత రాళమందలి గభీరతిమిరములఁ దరిమివైచితివి! మదీయచిరజీవనతపః ఫలమా! నీవు నాహృదయసీమనేలు ప్రభుఁడవై యాసీమాభ్యంతర విలసితపీఠంబుపై నాసీనుఁడవై యుంటివి. జీవితేశా! నీవే నాయాశవు! జీవన నైరాశ్య ముఖమును భయములేక విలోకింప సాహసమొసగిన శూరుండవీవే! ఓ చిరమాధుర్యమా! ఓ చిరనూతనమా! ఓ చిత్తనాయకా! నన్ను రక్షించుము. దేవా! అంచు బ్రస్తుతించుచు గల్యాణి చిత్తరువునకుఁ బ్రసూనాంజలి నొసగెను.

అపుడు గోవిందసింహుఁడా యాగారమునుఁ బ్రవేశించి, ఆ మొనుజూచి పుష్పాంజలి ముగిసిన పిదప,

గోవింద—"తనయా!" కల్యాణి (వెనుకదిరిగి)—ఏమి జనకా?

గోవింద—అదెవరి చిత్తరువు?

కల్యాణి—నాప్రియునిది.

గోవింద—నీప్రియునిదా! మహాబక్తానుపటమా!

కల్యాణి—అవును. తండ్రీ!

గోవింద—ఆచిత్రము నిచటికెందులకుఁ గొనివచ్చితివి?

కల్యాణి—పూజించుటకు.

గోవింద—పూజించుటకా!

కల్యాణి—అవునందులకే—జనకా! ఇందపరాధమేమున్నది? కోపించు చుంటిరెందులకు, [తండ్రికాళ్ళపైఁ బడును.]

గోవింద—మహాబత్ఖాను నీకేమగును?

కల్యాణి—(లేచి)—నాహృదయేశుఁడు.

గోవింద—తనయా! అతఁడునీపతికాఁడనిపలుమారునీతో వచింపలేదా?

కల్యాణి—వచించితిరి. దానంజేసి యింతవరకునేను మీరీతినే దలంచితిని. కానియిపుడాతఁడునాప్రియుఁడని యెఱింగితిని.

గోవింద—ప్రియుఁడని యెఱింగితివా! ధర్మచ్యుతుఁడైన మహాబత్ఖాను నీకుఁబ్రియుఁడెట్లగును!

కల్యాణి—జనకా! ధర్మమేమో యధర్మమేమోనే నెఱుంగను. కాని మహాబత్ఖాను నాధర్మపతి యనియెఱుంగుదును! పాణిగ్రహణ బంధనముకతన మేమిరువుర మైక్యమైతిమి. ఇందు కీశ్వరుఁడు సాక్షి ఆబంధమును భిన్నమొనరింప నెవరితరము.

గోవింద—యవనుఁడై మహాబత్ఖానే స్వయముగ నాబంధమును ద్రెంపివేసుకొనలేదా?

కల్యాణి—లేదు. ముసల్మానైనను, అతఁడు నన్నుఁ బరిగ్రహింప నియ్యకొనియెను.

గోవింద—పరిగ్రహింప నియ్యకొనెనా! యవనుఁడైనపిదప గోవిందసింహుని పుత్రికను పరిగ్రహించుటకును, పరిగ్రహింపకపోవుటకును ఆతని యిష్టమా? కల్యాణీ! మహాబత్ఖానేనిముసమున హిందూ ధర్మమును బరిత్యజించి, మహమ్మదీయుఁ డయ్యెనో యా నిముసమందే నిన్నుఁగూడఁ బరిత్యజించినవాఁ డయ్యెను.

కల్యాణి—జనకా! మీ రట్లు వచింపకుఁడు—నా ప్రియుఁడు నన్నుఁ బరిత్యజింపలేదు.

గోవింద—పరిత్యజింపలేదా! కల్యాణీ! ఇంకను నీయజ్ఞానము పరిపూర్ణము కాలేదా! అటులైన వినుము! నీవు మహబత్ఖానునకుఁ జాబు వ్రాసితివా?

కల్యాణి—నిశ్చయముగ వ్రాసితిని! అందు దోష మేమున్నది?

(అజయసింహుఁడు ప్రవేశించును.)

గోవింద—ఆహా! ఏమి యీదుర్నయము! (మొత్తుకొనుచు) నీవంపిన పత్రమును మహబత్ త్రిప్పివైచెను. తత్పత్రోపరిభాగమున నత డిట్లు లిఖించెను—"కల్యాణీ నేను నిన్నుఁ బరిగ్రహింపఁజాలను." ఈయవమానము—ఈతిరస్కారమును యాచింపవలసిన దుర్దశ నీకేల? ఇదిగో ఆపత్రమును గైకొనుము. (ఉత్తరము గోపంబున భూమిపై బాఱవైచెను. కడు నాతురమునఁ గల్యాణికమ్మఁ దీసి సంతసమున దానిని చూడదొడంగెను.)

గోవింద—అజయా! తెలియవచ్చిన వార్తలన్నియు వాస్తవంబులేనా?

అజయ—అవును వాస్తవంబులే. మొగలాయీలు మరల మీవారు నాక్రమించిరి.

గోవింద—ఈపర్యాయము సేనాధిపతి యెవరు?

అజయ—ఫరభేజ్ సాహెబు.

గోవింద—సైన్య మెంత?

అజయ—సుమారు లక్ష.

గోవింద—సరె. ఈమారంతయు నాశన మొందుటకు సుంతైన సందియములేదు. మీవారు ప్రాణములు దడదడమనుచు నేయున్నవి. ఇఁక నవినిలువఁజాలవు—కల్యాణీ! మోమువంచి నిలువఁబడెద వేమి?

కల్యాణి—ఏమనెదరు?

గోవింద—ఇప్పుడుకూడ మహబ్బత్ఖాను నీప్రియుఁడేనా?

కల్యాణి—నిక్కముగనతఁడునాప్రియుడు. సతిని ప్రేమించుపతి సందరు వెలఁదులు బూజసేయుదురు. అందక్క జమేమియు లేదు. ప్రియుఁడు పదాఘాత మొనరించినను,దచ్ఛరణ స్వాంకస్వమును దనచేత నంచు కొని పూజించుకాంతయే ప్రకృతసాధ్వి; యేరమణి పతిభక్తియందు విచ్ఛేదహాసములు గానరావో, అవజ్ఞాసంకోచములుండవో, నిరాశాదుఃఖములు లేవో—ఏనారిపతిభక్తి, హిమాంశునిలీలఁ బ్రశాంతమై, జంఝూమారుతోత్తాడిత మహీధరంబువలె దృఢమై, వివర్తనసమయ నక్షత్రమట్లు స్థిరమైయుండునో—యేపొలఁతిపతి భక్తి సర్వకాల సర్వావస్థలయందు విశ్వాసమువలె స్వచ్ఛమై, కరుణరీతి యాచితమై, మాతృప్రేమమాడ్కి నిరపేక్షమైయుండునో;—ఆనెలంతయే సాధ్వి! మహబ్బత్ఖాను నాప్రియుఁడు! నాదేవత!—నాసర్వస్వము!—అతఁడు తనచరణతలమున నాకుఁ దావొసఁగినను, ఒసంగకున్నను నాకుఁ బూజనీయుఁడే.

గోవింద—ఆముసల్మాను నీకుఁ బూజ్యుఁడా!—కల్యాణీ! నీవు గోవిందసింహుని దుహితవు!

కల్యాణి—తండ్రీ! మహబ్బత్ఖాను పత్నినగు టెంత నిశ్చయమో మీ పుత్రికనగుటఁగూడ నంతే నిశ్చయము! భర్తృస్నేహతత్పరయైన యీకల్యాణి కతన నకుంఠిత విక్రముఁడగు గోవిందసింహుని యశశ్చంద్రికల కెట్టికళంకము రాకుండనుండుగాక! ఎట్టియరిష్టములుఁ బొందవలసివచ్చినను ఎట్టిసిలుగులఁ గుందవలసివచ్చినను ధర్మపథగామినినై, సత్యపరిపాలనాసక్తనై యుండుట నాకర్తవ్యము, (కంపితస్వరమున) దానంజేసి ముసల్మానైనను మహబత్ఖానే నాహృదయేశ్వరుఁడంచు ఘంటాపథముగ వక్కాణించుచు,

మాతృదేశార్థము తాము జీవనోత్సర్గముఁ గావించు తెఱంగున నేనును నాప్రాణేశ్వరునికొఱకై మహదానంద పురస్సరముగ నాయుసురులఁబాయ సంసిద్ధనై యుంటిని. దృఢనిశ్చయనైన నన్నెవ్వ రడ్డుపెట్టగలరు?

గోవింద—ఉత్సర్గమా! నీకుటిలోద్దేశమును పరిత్యజింపుము.

అజయ—జనకా! వివేచన పూర్వకముగఁ బ్రసంగించు టుత్తమము. క్రోధాంధులై మీరేమి వచింపుచుంటిరో యెఱుంగఁ జాలకున్నారు. నిర్మలమై, మహత్తరమై, పవిత్రమైన కన్యను గుత్సితమతి వనిదూఱ మీ రేల సాహసించితిరో నే గ్రహింపఁ జాలకున్నాను.

కల్యాణి—(సగర్వమున) అన్నా! నిక్కముగ నీవునాకుఁ సోదరుఁడవే యగుదువు!

గోవింద—అజయా! కల్యాణికి పతి లేడనియు ఆమె విధవయనియు నీతో నేను చాలసారులుఁ జెప్పియుండలేదా?

కల్యాణి—నే విధవను గాననియు మహబత్ఖానే జీవనమరణములందు నా ప్రియుఁడనియు, అవసరమగునెడల ననేకపర్యాయములు వచించుటకు సిద్ధముగ నున్నాను!

గోవింద—ఆమహబత్ఖాను నీమగఁడా! ఆకఠిన, నీచ, అధమాధమ—

కల్యాణి—తండ్రీ! అతఁడు మీకు కఠినుఁడైనను నీచుఁడైనను, నాకు దైవసముఁడనియు, పూజనీయుఁడనియు యెఱుంగుఁడు!

గోవింద—పూజనీయుఁడా! ఆజాతిద్రోహి!—ఆధర్మచ్యుతుఁడు—ఆకఱకు తురక! ఆమహబత్ఖాను, ఈగోవిందసింహుని పుత్రికి బూజ్యుఁడా!—ఆహా! ఏమి యీదుర్నయము! కుత్సితము!!

కల్యాణి—(స్థిరస్వరముతో) తండ్రీ! జనకుఁడేమో, జాతియేమో, ధర్మమేమో నేనెఱుంగను. పతియే నాధర్మము! పతిధర్మముకంటె మిన్నయైన మహద్ధర్మమును నాకొఱకై లిఖియించిన శాస్త్రకారులు

గూడ లేరు! నారియొక్క మాయగ ముందునకు లంఘన మొనరించి నపుడు తాను బడిపోయిన దమృతవారాశియైనను, లేక గరళోదధి యైనను అందే యామె తనజీవనమరణములను,ఇహకాలపరకాలము లను గడపివేయును. గడపివేయవలయును. మహబ్బతాను, హిందు వైనను, ముసల్మానైనను, నాస్తికుఁడైనను, మేమిరువుర మైక్యమై యొకేపథమున జీవయాత్ర సలుపుచుంటిమి. దానంజేసి వానిం గూడి మృత్యుగభీరగర్భమునఁ బడవలయునన్నను, నేనట్లొనర్ప టకు సంసిద్ధనై యుంటిని!

గోవింద—కల్యాణీ! అట్లైన నీయిచ్ఛవచ్చిన యెడకరుగుము. నిన్ను నేఁబరిత్యజించి వైచితిని.

అజయ—జనకా! మీరేమి వచియింపుచుంటిరి! కల్యాణి మీపుత్రిక—

గోవింద—నాపుత్రిక కాదు—కల్యాణీ! లేచిపొమ్ము. నీ "జీవితేశ్వరు" కడకరుగుము.

కల్యాణి—పిత్రాజ్ఞ శిరసావహించెదను. జనకా! నాకు సెలవొసంగుఁడు. (పితృపదములకుఁ బ్రణమిల్లును.)

అజయ—తండ్రీ! ఒకించుక వివేచన మొనరింపుఁడు. ఇట్టిదుర్నయకృ త్యమాచరించి దురితము పాలుగాకుఁడు. కల్యాణి అబల! జ్ఞాన హీన. అట్టిదాని నవజ్ఞఁగావించు టనుచితము! నిక్కువముగ నామె భ్రాంతిపడియుండినచో—ఆమె యందేమైన దోషముండినచో, సర్వజ్ఞులైన మీరామెను మన్నించుట యుక్తము!

గోవింద—పుత్రా! కళ్యాణినరకమునకుఁ బోనుత్సహించుచున్నది! పోనిమ్ము. నే నామెకెట్టి యభ్యంతరమును గలుగఁజేయను.

అజయ—జనకా! ఆమె గమ్యస్థానము నరకంబుగానేరదు. ఎచటఁబ్ర ణయ పుణ్యాలోకమున్నదో, యచటనే స్వర్గముగలదు—క్రుద్ధులై కరమందలి యమూల్యరత్నమును గోల్పోవుచుంటిరి. మీరే మొనరించుచుంటిరో మీరే యెఱుఁగరు!

గోవింద—అజయా! ఎఱుఁగ కేమి! బాగుగా నెఱిఁగితిని.- (తనయనుద్దేశించి) కల్యాణీ! అంతరంగమున దేశమును ద్వేషించువారికి నా నిలయమందుఁ దావులేదు. నీధర్మము "పతి" యగుచో, నాధర్మము దేశము. పొమ్మిఁక నాసమ్ముఖమున నిలువఁబడకుము.

(వెనుకకు దిరుగును)

కల్యాణి—జనకా! మీయాన నతిక్రమింపఁజాలను. (పోఁబోవును.)

అజయ—కల్యాణీ! నిలువుము. తండ్రీ! అట్లైన నాకుఁగూడ సెలవొసంగుఁడు!

గోవింద— (సమ్ముఖమునకు దిరిగి) అజయా! సెలవునీకెందులకు?

అజయ—అబలయైన యీబాలనొంటరిగ నేఁబోనీయఁజాలను. నేఁగూడనామెననుసరించి పోదును.

గోవింద—నిన్ను నేను వెడలఁగొట్టుటలేదు.

అజయ—జనకా! మీరట్లుగావింపకపోవుట సత్యమే! గృహత్యాగ మొనరించుటనాయభిమతము కాదు. కానియిపుడట్లుచేయుటనాకర్తవ్యము. సదనమునుండి మీరామెను వెడలగొట్టి ఈఘాతుకనరసంకులసంసారాభ్యంతరమున వదలివైచుచుండిరి. ఇప్పట్టున గల్యాణి ప్రియుఁడామెకడ నున్నచో, నతఁడామెకు రక్షణం బొసంగియుండును. భర్తసమక్షమున లేకున్నను, గల్యాణికి సోదరుఁడు సమ్ముఖమందుండెను. ఈవిపత్సమయ మందితఁడామెకుఁ దోడుపడును:— సోదరీ! ఇకరమ్ము! నేఁడు సోదరీసోదరుల మిరువురమీసంకుల మహానిలవిక్షుబ్ధసంసార మహార్ణవమున, మననావను నడుపుదుము. అనుకూలంబుగ తీరమును జేరఁగలుగుదుమో లేమో జూచుకొందము. తండ్రీ! నమస్కరించుచున్నాను.

(జనకుని పాదముల కెరగును.

(కల్యాణీ యజయసింహులిరువురు వెడలిపోయిరి.)

రాతిబొమ్మ చంద్రమున గోవిందసింహుఁడు నిలువంబడియుండెను.

సప్తమదృశ్యము.

చిత్తూరుసన్నిహితారణ్యము—సంధ్యాకాలము.

[సగరసింహారుణసింహు లిరువురొక వృక్షతలమున నిలువంబడి యుండిరి. దూరముననొక పర్వతాగ్రమునుండి సూర్యుడస్తమించుచుండెను.]

సగర—అరుణా! ఈప్రదేశమందుండుటనాకిసుమంతయు నిష్టములేదు. చిత్తూరు దుర్గము కారాగార సన్నిభంబై యుండెను. అదిమిగుల బురాతనమై ఘనాంధకార బంధురమై, జూపరుల భీతాత్ములఁ జేయుచుండెను. నింగినంటుశైలములును. వన్యమృగభూయిష్టమైనవనంబు లీ స్థలంబును మఱింత భయానకముగఁ జేయుచుండెను. నిర్జన ప్రదేశమగుట యీనెలవు పిశాచముల కాలవాలమై యున్నది. ఇచ్చటి చెట్లయాకుల జొంపములందు శాకినులెన్నియో దాఁగి యున్నవి. ఇట్టి మహావృక్షముల నీవలకు నేనెన్నఁడు వీక్షించియుండలేదు. అరుణా! నేనిందిక నిలువఁజాలను. వేగ నాగ్రాకు వెడలిపోయెదను.

అరుణ—దాదాజీ! నాకీప్రదేశమే బాగుగనున్నది. మన పూర్వపురుషులస్మృతి యిచ్చటి పర్వతపాదపముల నంటి యున్నది. దాదాజీ అతీతప్రతిభావాహిని మీకాహ్లాదముఁ గలుఁగఁ జేయదా!

సగర—ఛీ! ఊరకొనుము. మరల నతీతమతీతమంచు వాగుచుంటివి. ఓరి మూఢుడా? అతీతమేదో యతీతమే. అత్యంతముగ నతీతమును దలఁచి నీమస్తకమును బగులఁగొట్టికొనకుము. బ్రదుకవలెనన్న నతీతమును మఱచిపొమ్ము.

అరుణ—దాదాజీ మహాశయా! కోపమెందులకు? వర్తమానముకంటె నతీతమే నాకు మిగుల మధురముగ దోఁచును. వర్తమానము మిగుల తీవ్రమై—స్పష్టమై గన్పట్టును. అతీత మన్ననో నీహారావృతమైయుండు. అతీతము నీలనభసన్నిభంబు!— అద్భుత చరిత్రసమంబు!—స్వప్న సదృశము.

సగర—శుంఠా! ఊరకుండుము. నేదలంచినట్లు వయసువచ్చుకొలంది నీకుఁదల్లి గుణము లబ్బుచున్నవి. ఇవ్విధంబుగఁ దలంచుచుండు కతంబుననే స్వజనుల విడిచి, స్వనిలయముఁ ద్యజించి నీజనని యెక్కడికో జనియెను. ఆగయ్యాళి జాడలేమియుఁ దెలియుటలేదు.

అరుణ—నాజనని యిట్టి వచనములఁ బలుకుచుండెడిదా?

సగర—నాయనా? అవును. మెఱపువలె నామె యందఱిఁ బాసి యదృశ్యయైపోయెను.

అరుణ—ఎట్లుపోయెను?

సగర—ఒకనాఁటి ప్రత్యూషమున "మీవారు! మీవా" రంచు వచించి, యుత్తలపాటున నామె యిలువిడిచి వెడలిపోయెను.

అరుణ—నేనామె నన్వేషించి కనుఁ గొనఁ బ్రయత్నించెద.

సగర—ఎచట నన్వేషించెదవు? ఈనిబిడ మహారణ్య మధ్యముననా? ఈసాంద్ర కాంతారమునఁ జండాళుఁడు దాఁగియున్నను, వాని నన్వేషించుట దుష్కరమగును. ఇఁకఁ దీవంబోలు నీతల్లినీయడవి తీవలందుఁ గనుఁగొను టెట్లు సంభవమగును!

అరుణ—నాజన యిత్రిగృహత్యాగముఁ గావింపకమున్నీ తావేమాకు దావలంబై యుండెడిది. ఈపవిత్రప్రదేశముఁబరిత్యజించినేనొండుకు రానిచ్చగింపను. ఇఁకనే నాగ్రాపురంబునకు రాను. పోవలయు నను వాంఛయున్న మీరొక్కరే పొండు. బహిష్కృతుభంగి నప్పుర మందుఁ కనుండ నిచ్చగింపను. చిత్తూరే నాకుఁ జిత్తశాంతిఁ గలుఁగఁజేయుచున్నది!

సగర—శుభ్రస్ఫటికోపల వినిర్మిత సుందరమందిరము లెన్నో యీ గ్రామమునఁ గలవు. నీవు వానిఁగాంచి యుండలేదని దలఁచెద. నేత్రపర్వం బొనర్చుకొనుటకుఁ దగినయెడ నిదియే.

అరుణ—దాదాజీ! ఈప్రాంత కాంతారసీమలే నాకు నేత్రపర్వం బొనర్చుచున్నది. ప్రకృతి సౌందర్యమును మించిన సౌందర్యము మానవ నిర్మిత భవనములందు గానంబడుటరిది. కనుక నేనాగ్రా రా నిచ్ఛగింపను.

సగర—చక్రవర్తిచే నిర్మింపఁబడిన మసీదులు డెబ్బదియెనిమి దప్పుర వరంబున గలవు. శ్వేతప్రస్తరవినిర్మితంబులగునవి ప్రభాత ప్రభాకర కిరణచ్ఛటోద్భాసితంబులగు తటిఁ తళుకు లీనుచుండి చూచు వారికి మైమరపు గలిగించును.

అరుణ—దాదాజీ! నాకాతళుకు బెళుకులతో పనిలేదు. హిరణ్మయ కుట్టిమంబుల కంటె నిచ్చటి నెత్తాక నిలయంబులే నాకు నచ్చిన యాలయంబులు! మొగలాయి సౌధములకంటె రసపుత్ర కుటీర ములే వాసయోగ్యంబులు! మొగలాయీల చరణాతలమునఁ గూర్చుండి స్వాదు పదార్థముల భుజించుచు రాజభోగ మనుభ వించుటకంటె నాతల్లి తోడప్రైఁ గూర్చుండి గోటిముద్దలఁ గుడుచు టుత్తమము! దాదాజీ మహాశయా! పరులొసంగిన మృష్టాన్నము భుజించుటకే దాము స్వసీమనుద్యజించి, బంధుమిత్రులఁబాసి, శత పుణ్యా వాహినీ పవిత్ర నిజనిలయంబును విడచితిరి. పవిత్ర రస పుత్రకులమం దుద్భవించియుఁ బరుల పంచఁజేరి, బిచ్చమెత్తుట కంటె గర్హితంబైన కార్యము మఱొండేమియుఁ గానరాదు. దాదాజీ! మొగలులు నిత్యంబు స్వర్ణముష్టి శిక్షయొసఁగినను తన్ముష్టియందు వారల చరణరజమేయుండును. మీరుపరాధీనులై యున్న తటి మిమ్ము విలోకించి పరులు గావించు మందహాస మందు కఠిన పరిహాసము గన్పట్టుచునే యుండును. పరదత్త

హేమభాండారము కంటె నిజ సోదరుని నెయ్యంపు జిరునగవే నాకుఁ బ్రీతిదాయకమై యుండును!

(సత్యవతి ప్రవేశించును)

సత్యవతి—చిన్ని యరుణా! చిరంజీవివై యుండుము. రసపుత్రోచితములై భావగర్భితములైన నీపలుకులు నన్నానందపయోధి యందు ముంచివైచెను!

నగర—ఎవరు! సత్యవతియా! ఇది స్వప్నమా! కాదు—సత్యవతియే! అమ్మా? ఇచటి కెపుడు వచ్చితివి?

సత్యవతి—వత్సా! ఏనిముసమున స్వదేశార్థమై, సన్యాసినినై నిజాలయ పరిత్యాగముఁ గావించితినో ఆనిముసమున నీచిఱు చేతుల కవుగిలింతను వదల్చుకొని పోవుట నాకన్ని యిడుముల కంటెఁ గష్టతరమై గన్పట్టె! శైలసీమలఁ దిరుగుచు మీవారు మహిమను గానము జేయుచున్నపుడు నీమధుర మందహాసమును మఱచుటయే యన్ని కడగండ్లకంటెఁ గఠోరమై గనుపట్టె! నీపిత్రావునకు వచ్చితివని యెఱిఁగి, యింక నేనిలువఁజాలకపోతిని. నీచిన్ని మోము వీక్షింప నే నిచ్చోటకుఁ బర్విడివచ్చితిని. ఇంత దనుక యవనిక మఱుంగున నుండి నీవాక్సుధను నాకర్ణపర్వముగఁ గ్రోలుచుంటిని! నీసుధావాణి యమర సంగీతమేమో యని దలంచి మర్త్యలోకమున నిదేలవినంబడుచుండెనని విస్మయపడితిని! ఇఁక బ్రచ్ఛన్నముగనుండజాలకపోతిని.— నందనా! రమ్ము! సర్వస్వమా! రమ్ము!! ముద్దుబాలకా! రమ్ము!!! [సత్యవతి చేతులఁజాపును]

అరుణ—అమ్మా? [యని జనని నాలింగన మాచరించుకొనును,]

నగర—తల్లీ! సత్యవతీ! నన్నొక మాటైన నుపలక్షించితివి గావేమి నే నేమి యపరాధమాచరించితిని?

సత్యవతి—ఏమి యపరాధమా ? అపరాధమేమియో మీరెఱుంగరా!
(ఒకించుక తాళి) ప్రాయశః మీ రెఱుంగరు ! తెలిసికొను శక్తియు మీకు లేదు ! ఈపరపీడితమై—అపహృత సర్వస్వమై దీనమైన మాతృసదృశ రసపుత్రస్థానమును ద్యజించి, మొగలు ప్రసాదమునకు దాసులైపోతిరి. రత్నగర్భమైన భారతవర్షమును బాషాణచిత్తులైయే మొగలులు గొల్లఁగొట్టిరో;—యే మొగలులు భారతభూమియందలి పవిత్రసుందరమందిరముల చూర్ణమొనరించిరో, తీర్థముల నపవిత్రములు గావించిరో, రమణీమణుల నవజ్ఞజేసిరో, భారతీయుల మనుష్యత్వహీనులఁ జేసిరో ;—యే మొగలులు దర్పస్ఫీతులై యిప్పట్టునఁ స్వాధీనరాష్ట్రింబైన, రసపుత్రస్థానశేషమగు మీవారును, బునఃబున రాక్రమణములచేఁ బీడించి—విధ్వస్త మొనరించి, ఆదేశమాత శ్యామలవదనబింబమున, నామె సంతానరుధిర తరంగముల నెగజిమ్మిరో అట్టి మొగలులకు చరణాశ్రితదాసులై,—వారల కృపాద త్తస్పర్థచే నిజభ్రాతృనందను, అప్రతిమాన ప్రతాపవంతుఁడగు ప్రతాపసింహుని పుత్రకుని, సింహాసనాచ్యుతుఁ గావింప గమకించుచుంటిరి ! అట్లయ్యు, నేమి యపరాధ మాచరించితివని యబ్బురము దోఁపఁబలుకుచుంటిరి. పోనిండు ? మీకుఁ దోఁచిన మార్గమున మీరేగుచుంటిరి ! మాకు వలయు దిక్కును మేము కోరుకొంటిమి.—తనయా ! రమ్ము ఇయ్యంధకారమం దీ దుర్దినమం దీవే నా సహచరుండవు—నేఁడు నేను ద్విగుణీకృత బలోపేతనైతిని—నందనా ! రమ్ము !!

(అరుణుఁ దోడ్కొని సత్యవతి బయలుదేరును.)

నగర—సత్యవతీ ! పోకుము ! అరుణా నిలువుము ! నేఁగూడ మిమ్మనుసరించివచ్చెదను. నేఁడు నానేత్రములు దెఱువంబడియె ! మాతృదేవిని నేటికి గుఱుతింపఁ గలిగితిని. పరదత్తనికృష్టకృపను

నేఁడు నేను నాహృదయఫలకమునుండి తుడిచివైచితిని. దేశాభ్యుద యార్థమై దుస్సహదుఃఖదారిద్ర్యానాశములనే నేఁటినుండి యపేక్షించెద ! అమ్మా ! నామాటలనమ్ము !—ముందునకు రమ్ము !! ననుఁగౌఁగలించుకొనును—

సత్యవతి—జనకా! ఒక్కముహూర్తమందే తండ్రిని, కొడుకును గ్రమ్మఱఁబడయఁ గలుగు సౌభాగ్యము నాకలవడెనా! ఇది సత్యమే ? సత్యమేనా ?

శంకర—సత్యవతీ సత్యము ! మూఢుఁడనై యింతకుమున్నేను నాకర్తవ్యంబు నెఱుంగఁజాలనైతి. అమ్మా! ఈముదుసలిని మన్నింపుము!- మన్నింపుము !!

సత్యవతి—తండ్రీ [అని మోకరించి కాళ్ళపైఁబడును]

తెరపడును.

శ్రీ

# మీ వా రు ప త న ము

## తృ తీ యా ం క ము

### ప్ర థ మ ద్రు శ్య ము

ఉదయపురమందలి రాజ సభాగృహము—ప్రభాతకాలము.

సామంతులు నిలువంబడి ప్రసంగించుచుండిరి.

జయసింహుఁడు—ఈకామ్నారుకదన చరితం బితిహాసములందు స్వర్ణాక్షరములతో వ్రాయఁదగినది.

గోకులసింహుఁడు—పరభేజు యుద్ధసామగ్రుల మధ్యేమార్గమున నిలువు జేయుట మంచిదయ్యెను.

భూపతిసింహుఁడు—పాపము! అతనికి అడవి త్రోవలేవియుఁ దెలియ వని దోఁచుచున్నది.

గోకుల—కాని పరభేజుపలాయన పథముల బాగుగ నెఱుంగును!

జయసింహుఁడు—మిత్రులారా! నభశ్చుంబనోత్సుకములైన పర్వత శిఖరాగ్రముల నుద్భాసిత మొనరించు నవీనజ్యోత్స్న మీవారు యశఃప్రభాతము నెట్లు సూచించుచుండెనో వీక్షించితిరా?

భూపతి—అపూర్వ సౌరభమ్మును వహియించిన మలయ సమీరుఁడు మన విజయవార్తను భారతవర్షమునం దంతటను వ్యాపింపఁజేయునుఁగాక!

(రాణా అమరసింహుఁడు ప్రవేశించును)

సామంతులందఱు—జయ్ మహారాణాఅమరసింహునకు జయ్!

[రాణాసింహాసనాసీనుఁడగును. ఆస్థానకవి చూడామణియైన క్షీరదాసు ప్రవేశించి భక్తిపురస్సరముగ]

సీ. భవదసీమ ప్రతాపాగ్నిదగ్ధంబులై
అరినృపానీకంబు లంతమొంద,
సంతసంబొంది, యజస్రము శీతాంశు
రవితార లెపుడు హారతుల నొసఁగ,
దివ్య దాకాశవీథీముఖంబునఁ బయో
దములు మార్దంగిక క్రమముఁజూప,
త్రిభువనాక్రాంత సత్కీర్తి వైభవ! జయీ
భవయని సురలెల్లఁ బ్రస్తుతింప.
గీ. శుక్లపక్ష సుధాకర జ్యోత్స్నలీల
రమ్యమై పూజ్యమీవారు ప్రతిభ వెలుఁగ
రాజ్య మేలుచునుండుము రాజసింహ!
అమరవందిత! శుభకర! అమరసింహ!

రాణా—కవిరాజా! కవీంద్రుల యాశీర్వాద మమోఘంబయ్యు, నాపాపమువలననే యీరాజ్య ప్రతిష్ఠ బుగ్గిఁ గలియునని విచార మగుచున్నది.

క్షీరదాసు—వీరులట్లు చింతింపరాదు. ప్రభూ!

జయసింహుఁడు—రాణా! మీరొనరించిన పాపమేమి!

రాణా—నాపాపమును వీరరక్తాసారపంకిలమైన యుద్ధరంగమే వెల్లడి చేయుచున్నది.

(సత్యవతి ప్రవేశించును.)

సత్యవతి—మీవారు మహారాణా విజయమందుగాక.

రాణా—ఎవరు! సోదరియైన సత్యవతియా!'—[సింహాసనమునుండి దిగ్గన లేచి] 'సోదరీ!' రమ్మ!

సత్యవతి—మహారాణా! చాటున నిలువఁబడి నేనింత దనుక విజయ సంస్తవమును వినుచుంటిని. వినుకొలంది నాకన్నులానందబాష్పములతో నిండిపోయినవి. మంత్రముగ్ధవలె నిశ్చేష్టనై నిలువంబడితిని. మహారాణా పూర్వము తమ వంశశిరోభూషణమైన భగవాన్ రామచంద్రుఁడు లంకావిజయానంతరము, ఆనందవాద్యములు భోరుకొలుప—విజయనాదము లాకసమంట అయోధ్యాపురము ప్రవేశించిన విషయము జ్ఞప్తికివచ్చెను. తదుపరి జయగాథముగిసెను. దేవియొకర్తుక యరుదెంచి యాగాథాగానమును నాకమ్మునకుఁ గొనిపోయెనంచు దలంచి, కలఁగని లేచిన చంద మున మేల్కాంటిని.

రాణా—సత్యవతీ! గానమీలీలనే ముగియును. సంగీత మానంద కోలాహలము వడువున వెలువడి పిదప నొక దీర్ఘనిశ్వాసమందు లీనమైపోవును!

సత్యవతి—రాణా! ఈ యానందదివసమున నీముఖము వాడియున్న దేమి? నీ చూడ్కులు కాంతి దక్కియున్న వేమి! ప్రభూ! నైరాశ్యమును హృదయమునుండి దఱిమివేయుఁడు. నేఁడు మిూవారు మహోత్సవ దివసము!

రాణా—ఉత్సవదివసమగుట నిశ్చయమే! సత్యవతీ! నూతనవిషయ మొకటి తెలిపెదను. ఈ కామ్నూరు యుద్ధమున విజయముఁగాంచినదివారుగాని మనముగాదు.

సత్యవతి—జయము పొందినది మనముగామా? మొగలాయీలా! ఏమి!

రాణా—విజయులు రనపుత్రులే!—కాని, జయోత్సవములఁ గావించుకొనఁదగినవారు మాత్రముగాదు. జయోపేతులైన శూరాగ్రేసరులందరు సంగరాంగణమున నిహతులైయుండిరి. జయధ్వజములతో

విజయభేరీ నినాదములతో జయ జయారావములతోఁ గదనరంగ మునుండి ప్రమోద మానసులై మగుడివచ్చినవారలు జయమును చేకూర్పలేదు. ఆహవమందు ప్రాణములఁ బాసిన వీరులే జయం బొందిరి!

సత్యవతి—రాణా! నీవాక్యము లమృతములుగావు. అట్టి జయశాలుల కీర్తియక్షయమగుగాక!—ప్రభూ! శుభవార్తయున్నది.

రాణా—సత్యవతీ! ఏమివార్త?

సత్యవతి—నాజనకుఁడైన సగరసింహుఁడు చిత్తూరు దుర్గమును నీకు స్వాధీనమొనరించి వైచెను. నిను నిరోధించు శత్రువులెవ్వరునులేరు. నిరాటంకముగఁ బోయి నీవు దుర్గము నాక్రమించు కొనుము.

రాణా—(విస్మయమున)—ఏమీ! చిత్తూరుదుర్గము నాస్వాధీనము జేయఁబడెనా! ఇది సంభవమా? సత్యవతీ! సత్యమునే వలుకు చుంటివా?

సత్యవతి—సత్యవతి సత్యమునే బలుకును. ఇం దనృతమేమియులేదు. సర్వముసత్యము!

రాణా—చక్రవర్తి యాజ్ఞ ననుసరించియే యతఁడు దుర్గమును మన యధీనమొనరించెనా?

సత్యవతి—కాదు! అతఁడు చక్రవర్తి యానఁగైకొనలేదు! చక్రవర్తి నాజనకునకు చిత్తూరుదుర్గము నొసఁగెను. తనయిష్టము వచ్చినవారి కతఁడా దుర్గము నర్పింపవచ్చును. పశ్చాత్తప్తహృదయుఁడై దుర్గము మీకొసఁగి,—అతఁ డాగ్రాపురమునకు వెడలిపోయెను!

రాణా—సామాంతులారా! జయజయధ్వానము లొనర్పుఁడు. స్వర్గీయుడైన జనకుని జీవనస్వప్నము నేఁడు—అతని పుత్రుని బాహుబలమున గాకున్నను, భ్రాతృదానంబుచే—సఫలమయ్యెను! రస

పుత్రులారా! దుర్గాధికారము( బడయుఁడు! స్వాతంత్ర్యధ్వజము నెత్తుఁడు! చమూసమూహములఁ గూర్పుఁడు! ముందునకు లంఘింపుఁడు! శత్రువు లడ్డుపడినచో ద్విగుణీకృతోత్సాహులై యుద్ధము గావింపుఁడు!

సత్యవతి—జయ్! రాణా అమరసింహునకు జయ్!

సామంతులు—జయ్! రాణా అమరసింహునకు జయ్!

ద్వితీయదృశ్యము.

[గ్రామమార్గమునకు ప్రక్కనపోయిన యొకగుడిసె దగ్గరగా సాయహ్నసమయమున. కల్యాణి యజయులు నడచివచ్చుచుందురు]

కల్యాణి—అన్నా! నేనిఁక నడువఁజాలను.

అజయ—సోదరీ! నేఁడు మనమీగ్రామమందు నాగుదము. ఈకుటీర మీపల్లె పొలిమేర యందేయున్నది. పాడుపడి యుండుటచే నీగుడిసెయందు మనుజులున్నట్లుదోఁచదు. దీని లోపల చీఁకటు లాక్రమించుకొని చూపఱుల భయము గొలుపుచున్నవి.

కల్యాణి—ద్వారము కడకరిగి పిలిచి చూడుము.

అజయ—(గుమ్మముచు సమీపించి) ఎవరయ్యా లోపల?

(ఉత్తరమేమియు లేదు.)

అజయ—(మరల)—చీఁకటిగానున్నది. లోపలనున్న వారెవరయ్యా!

[ఈమాఱుకూడఁ బ్రతివచనము లేదు]

అజయ—సోదరీ! గుడిసెలో నెవ్వరును లేనట్లు దోఁచుచున్నది.

కల్యాణి—అన్నా! నేఁటికి మనమిందు విశ్రమింతము. ఇఁక నేనొకయడుగైన నడువఁజాలను.

అజయ—అట్లే యుందము. కాని కుటీరమంతయుఁ జీఁకటిగానున్నది. నేనీ పల్లెలోనికరిగి, దీపమును గొని వచ్చెదను. నీవిందేయుండుము.

కల్యాణి—సరియే! (నిట్టూర్పునిగిడించి) అయ్యో! ఆయాసముగనున్నది! కాళ్ళు లాగుచున్నవి! ఆఁకలిచేఁ గడుపు మాఁడిపోవుచున్నది.

అజయ—చెల్లీ! తినుటకేమైన ఫలాహారముఁగూడఁ గొనివత్తును. భయపడక నీవీ కుటీరమందే కూర్చుండుము.

కల్యాణి—అన్నా! శీఘ్రముగఁ బోయిరమ్ము. ఈతావెంతో భయము గలుఁగఁజేయుచున్నది. ఒంటరిగ నుండఁజాలను.

అజయ—చెల్లీ! భయమేమి! ఒక్కపరుగునఁ బోయివచ్చెదను. భయపడకుము. ఇచట నొరులెవ్వరును లేరు. [నిష్క్రమించును]

కల్యాణి—ఎన్నఁడు నడచి యెఱుఁగనికతన పాదములు నొప్పియెత్తుచున్నవి. మార్గాయాసమధికమగుచున్నది. కాని నాచిత్తమానందతరంగములం దోలలాడుచున్నది. స్వేచ్ఛానుభూతదుఃఖదైన్యములందుండు గౌరవమెంత నిరవధికమైనది! ఉత్తుంగతరంగములు గగనవీధి కెగయ యప్రతిహతగతితో నొకనది సముద్రమును జేరఁ బరుగెత్తువిధమున—ఉద్దామోల్లాసపురస్సరముగ భర్తృసమాగమోత్సుకనై ముందునకు సాగిపోదును. కాని నాప్రాణవల్లభుఁడు నాకుఁ దనచరణతలమున దాసిగానైన నిలువఁ దావొసంగునో, లేదో? ముందేమి కానున్నదో?

(ఫకీరొకఁడు ప్రవేశించును)

కల్యాణి—ఎవరు నీవు?

ఫకీరు—నేను రసపుత్రుఁడను. నీవేమియు భయమొందకుము. నీవురసపుత్రరమణివలెఁ గన్పట్టుచున్నావు. అమ్మా! నీవిచ్చో నేకాకినివై యుంటివేమి?

కల్యాణి—దీపమును—తినుబండారమును గొనితెచ్చుటకై నాయన్న

యీ గ్రామములోని కరిగెను.

ఫకీరు—సంతోషమే! అతఁడు మగుడి వచ్చువఱకు నేను నీకడనుం డుదు. ఈ ప్రాంతముల మునల్మాను హంతకులు చరించుచుం దురు. నేఁడీ సమీపప్రదేశమందే నలువు రైదుగురు మొగలు సైనికులేదో దౌర్జన్య మొనర్చుటకై తిమ్మరుచుండుటఁ గాంచితిని. నీయన్న మగుడి యరుదెంచు నంతదనుక నీకు నేను రక్షణమొసఁగెద.

కల్యాణి—దయాళూ! నన్ను రక్షింపుము!—నాకు మిగులభయముగ నున్నది!

[నేపథ్యమున]—ఈ గుడిసెలోనే?

నేపథ్యమున—అవును. ఈ గుడిసెయందే! [తలుపుగొట్టిన చప్పుడు]

కల్యాణి—ఎవరది? అన్నా! అన్నా!!

(బందిపోటు-దొంగలు ప్రవేశము)

మొదటివాడు—ఇదిగో! ఇదిగో!!

రెండవవాఁడు—పట్టుకొనుము! పట్టుకొనుము!! చూచెద వేమి?

మొదటి—ఈపిల్ల బాగుందిరా!

రెండవ—బాగానే వుంది. కాని ముందా మెళ్ళో మెరుస్తోంది—దాన్ని లాగు! చూత్తా వేంట్రా? లాగు! లాగరోసి!

మొదటివాడు కల్యాణినిబట్ట నుద్యమింప, నామె భయాతురయై, తత్తరమున వెనుకంజవైచి,]—"రక్షింపుఁడు! రక్షింపుఁడు [అని యెలుగెత్తి యార్చును] ఫకీరు [ముందునకు లంఘించి]—"అరే! దురాత్ములారా! మీపొగరణంచెదను. తొలగుఁడు"

మొదటి—వీఁడెవడు?

రెండవ—ఎవఁడైననేమి! పొడువుము!! చంపుము!!! [కోపముతో ఫకీరా యిద్దరు దొంగలతో పోట్లాడి, గాయపడి పడిపోవును.]

కల్యాణి (అడలున)—అన్నా! అన్నా!! అన్నా!!!

(పరుగెత్తి యజయసింహుఁడు ప్రవేశించును)

అజయ—కల్యాణి! భయములేదు!! నేను వచ్చితిని!!!

[ఒఱనుండికరవాలమును దీసి, గిరగిరద్రిప్పుచు, సింగపుగొదమవలెం, ఉగ్రుఁడైయాతురకల నిముసంబులో నఱకివైచెను.]

అజయ—(పడిపోయిన వృద్ధఫకీరు నుద్దేశించి) చోరులు చచ్చిపోయిరి. భయము లేదు. కల్యాణీ! ఈ పడియున్న వా రెవరు?

కల్యాణి—ఈకృపాళుఁడు నన్ను రక్షింప యత్నించి, చోరుల వలన దెబ్బ తిని నేలఁబడెను.

ఫకీరు—మీర లెవరు?

అజయ—నేను గోవిందసింహునినందనుఁడను—అజయసింహుఁడను. యీమె యతసి కూతురు—నాసోదరియైన కల్యాణి.

ఫకీరు—ఏమీ! ఇయ్యెణాక్షి మహబత్ఖాను భార్యకాదా?

అజయ—వీరవరా! అవును. తామెవరు?

ఫకీరు—నేనా మహబత్ఖాను జనకుండను!—నగరసింహుండను!

## తృతీయదృశ్యము

యోధపురాధీశ్వరుఁడైన గజసింహుని ధ్యానాగారము-ప్రభాతకాలము.

మార్వారుపతియైన గజసింహుఁడును, ఆస్థానపండితుఁడైన హరిదాసును, గజరాజు తనయుఁడైన అమరసింహుఁడును, దూతవేషధారియైన అరుణసింహుఁడును కూర్చుండి యుందురు.

గజసింహ—(దూతతో) తనతో వియ్యంబునకు నేనియ్యకొనలేదని నీవు పోయి నీ రాజైన మీవారురాణా కెఱిఁగింపుము. చక్రవర్తివిపక్షులైనవిద్రోహులతో నెట్టి సంబాధముఁ గలుగఁజేసి

కొన నే నిచ్ఛగింపను—హరిదాసూ! ఏమనెదవు?

హరిదాసు—అవశ్యము.

అరుణ—మహారాజ్! మా రాణా విద్రోహి యెట్లయ్యె? మీవారు రాజ్యమింకను మొగలుల పాదములచేఁ ద్రొక్కి వేయఁబడలేదు. ఏ స్వాతంత్ర్యమునది బహువత్సరములనుండి యనుభవించుచుండెనో ఆస్వాతంత్ర్యమును నేటికిని గాఁపాడుకొనఁ యత్నించుటవిద్రోహము కానేరదు.

గజసింహ—అదియే విద్రోహము! రాజపుత్రస్థాన మంతయు తల వంచుకొని మొగల్ప్రభుత్వమును స్వీకరించినపుడు, కేవల మొక్క మీవారు తన తల యెత్తుకొని యుండునా!

అరుణ—కేవల మొక్క మీవారు దలయెత్తుకొని యుండునా? యనెదరా? అవును! కేవల మొక్క మీవారే దలయెత్తుకొని యుండును! మీ మనసులో నున్నదంతయు నాకుఁ దెలిసినది. అసూయచే మీ హృదయము బాధపడుచున్నది. సర్వమహీధరశిఖరాగ్రములందలి రసపుత్రగౌరవ రశ్మియంతర్హితంబయ్యె, మీవారు శైల చూడముపై మాత్ర మిప్పట్టున గూడ నుద్భాసితంబైయుండుటఁ గాంచి మీరు సహింపఁజాలకుంటిరి. రసపుత్రమహీపతులందఱు నతమస్తకులై యున్నను కేవల మొక్క మీవారు రాణా ముకుట ధారియై యుండు దృశ్యమీ యోధపురాధిపునకు కంటకముగా నుండవచ్చును. మీయంత మీరు స్వాతంత్ర్యమును గోల్పోయి కానినవలైతిరి. దానమా రాణా వారి దోషమేమున్నది, రాణా యెట్టి దోసవు నొనపలేదు.

గజసింహ—నీవు మిగుల సాహసికుఁడవు. మహారాజ్ గజసింహుని సమ్ముఖమున నిట్లు మాటాడిన వారింత వరకెవ్వరును లేరు. ఇరువది రాజపుత్రుల వెంటఁ దోడ్కొని యనంతసేనాపరివృతుఁడగు

భారతసామ్రాట్టునకు విరుద్ధముగ నిలచిపోరుసలుపఁదలంచి, రాణా తన మూఢోద్ధతోన్మాదముల వ్యక్తీకరించుకొనుచున్నాఁడు. అట్టి క్రౌర్యమౌఢ్యంబులు మీవారు రాణాకే సరిపోయినది అట్టియు న్మత్తత యమరసింహునకే తగిపోయినది.

అరుణ—మహారాజా! సత్యము వచించితిరి. అట్టి యున్మత్తత మీవారురాణాకే జెల్లును. అట్టి యున్మత్తశక్తి మీవంటి వారి కెట్లుండును! మహారాజా! మీరు యదార్థమునే బలికితిరి!

గజ—నీవు దూతవుగాన బ్రదికిపోతివి. లేకున్నచో—

అరుణ—ఈమాత్రపు మనుష్యత్వము దేవరకుండుట గొప్పయే 'దూత యవధ్యు' డను నీతి నెచట సంపాదించితిరి? మహారాజా! ఏమి మీ నీతిజ్ఞానము! ఏమి మీయుదారభావము!

గజసింహ—నా యోర్పునకు మేరయున్నది. నా ధైర్యమునకుఁ బరిమితి గలదు. దుష్టప్రలాపముల నాడకుము. పోయి వివాహమునకు నేను సమ్మతింపనని మీరాణా కెఱింగింపుము—పొమ్ము—

అరుణ—అట్లే పోయెదను. కాని మహారాజా! యొక మాట చెప్పి పోయెద! చక్రవర్తి పక్షము నవలంబించి, తాము దక్షిణదేశము పైకి దండువెడలితిరనియు, ఘూర్జరభూమి నాక్రమించుకొని యెంతేని ఖ్యాతినార్జించుకొంటిరనియు వింటిని. ఈపర్యాయము తప్పక ప్రభువువారు మీవారుపైకి కూడ వచ్చెదరుగాక! ముందే నేను మిమ్మాహ్వానించుచుంటిని. ఇఁకపోయెదను. [పోఁబోవును.]

గజసింహ—మంచిది! అట్లేవచ్చెదము! ఆగుము. నీవుకూడ మమ్మనుసరించియే రావలసియున్నది.

అరుణ—ఏమి! నన్ను బంధించెదరా?

గజసింహ—అవును! (తనయు నుద్దేశించి) అమరా! బంధింపుము.

అమర—జనకా! అదేమట్లనుచుంటిరి! ఈశూరుండు దూతయని

మెఱింగియే యిట్లానతిచ్చుచుంటిరా! దూతను హింసించుట క్షత్రియధర్మముకాదు.

గజసింహ—అమరసింహా! ధర్మాధర్మములను నీవు నాకు నేర్పనక్కఱ లేదు. నాయాజ్ఞను నెరవేర్పుము.

అమర—అన్యాయములైన యాజ్ఞల నెరవేర్చుట నాకెట్టి యభ్యాసములేదు. మీయాజ్ఞను శిరసావహింపఁజాలను.

గజసింహ—నీవు నాజ్యేష్ఠపుత్రుఁడవు. నాయాజ్ఞ నుల్లంఘించితివేని, ముందుముందు నారాజ్యము నీయది కానేరదు—నాచిన్నికుమారుఁడైన యశోవంతసింహుఁడు యౌవనమువచ్చినవెనుక నాయనంతరము రాజ్యాభిషిక్తుఁడగును?

అమర—మీకింకను రాజ్యమా! మీ యనంతరమున రాజ్యాభిషేకమా! మొగలాయీల పదాఘాతమువలనఁగలిగిన యగౌరవ దుఃఖములేకమై మీసింహాసనముగ నేర్పడియెను! ఆసింహాసనమం దాసీనుఁడనగుటకు నాకు నుంతైన కోరికలేదు. మొగలుల పాదుకలను నాతలఁ దాల్చుకొనుటకు నేనువ్విళులూరుచుండుట లేదు.

గజసింహ—మంచిది! అటులగుచో నిన్ని ముహూర్తమందే నారాజ్యమునుండి వెడలఁగొట్టెదను.

అమర—ఈముహూర్తమందే మొగలుదాసుఁడైన వాని సమక్షము నుండి వెడలిపోవుచుంటిని.

[నిష్క్రమించును.]

గజసింహ (క్షణకాలానంతరమున)—రాయబారీ! నీవరుగుము. నిన్ను బంధింపను.

చ తు ర్థ దృ శ్య ము.

మహాబత్ఖానుయొక్క బహిర్మందిరము—రాత్రికాలము
మహాబత్ఖా నేకాకియై యుండును.

మహబత్ఖాను—నేనా హేమాంగిని పరిత్యజించుట నిక్కువమే. పరిత్యక్తయయ్యు, నామె యింకను నాస్మృతిపథమందుఁ గన్పట్టుచునే యున్నది—ఇపుడుకూడఁ బ్రేమవిహ్వాలయైన యానీలవేణి వదన చంద్రబింబము నాహృదయాకాశమునఁ బ్రకాశించుచున్నది. అయ్యో! మూఢుఁడనై యెట్టిరత్నమును గోల్పోయితిని! అనురాగము పెంపున నాసుకుమారి నాకు లిఖించిన జాబు నేల క్రూరుఁడనై త్రిప్పివైచితిని? ఆప్రేమహృదయ చూపిన యవ్యాజ ప్రేమకుఁ బ్రతిఫలముగా నేనవజ్ఞ చేసితిని. ఆమెజూపిన ప్రగాఢప్రణయంబునకు బదులు నే నుపేక్ష చేసితిని. ఆమానినీమణి చూపిన యపార భక్తికిమాఱు నేఁ దిరస్కార మొనర్చితిని. ఎంత యనుచిత కార్య మొనరించితిని! యెట్టి యమానుష కృత్యముఁ గావించితిని! ప్రేమామృతముపై భీషణ కాలకూటమును బోసితిని. ఆమెతండ్రిపై నున్న కోపముచే నాపవిత్రహృదయచూపిన ప్రేమనుక్రూరుఁడనై ప్రత్యాఖ్యానము గావించివైచితిని. దుర్నయమును సలిపితినని యిపుడు తెలిసికొంటిని. తరుణము లభించుచో చేతులు మోడ్చి యాపావన చరిత పాదములకడ క్షమాభిక్షను వేఁడుకొందును—ఎవరు?'

(ద్వారికుఁడు ప్రవేశించును.)

ద్వారికుడు—ఖుదాబన్ద్! (ప్రభూ!) మహరాజ్ గజసింహుఁడు హుజూరుదర్శనమును గోరుచుండెను.

మహబత్—గజసింహుఁడా! యోధపురాధీశ్వరుఁడా!

దౌవారికుఁడు—అవును. ఖుదాబన్ద్ ?

మహబత్—లోనికిఁ గొనిరమ్ము.

[దౌవారికుఁడు నిష్క్రమించును.]

మహబత్—గజసింహుఁడు నాగృహమునకు రాఁగతంబేమి!—ఆకాపురుషుఁడు!—అధముఁడు!—క్రూరుఁడు! మొగలాయీల బానిస—

(గజసింహుఁడు ప్రవేశించును.)

మహబ—ఓహో మహారాజ్‌జీ రండు. దయచేయుఁడు.

గజసింహ—ఆదాబ్ ! (సలామ్.)

మహబత్—బన్దిక్ (సలామ్) మహారాజ్జీ! ఈదీనుని భవనమును నేఁడు మీరాకచేఁ బావన మొనరిచిరి. ఏమైనవార్త లున్నవా?

గజసింహ—చక్రవర్తి మిమ్మొకమాఱు తీసుకొనిరమ్మని సెలవిచ్చి నాఁడు.

మహబత్—ఏమీ! చక్రవర్తి యనుగ్రహము! మీవారుపైకి యుద్ధమున కరుగుటకని దలఁచెద.

గజసింహ—అవును ఖాన్సాహెబు!

మహబత్—ఈవిషయమున నాయభిప్రాయము చక్రవర్తికి బలుమారెఱిఁగించియే యుంటిని. అట్లయ్యు నన్నతఁడీ తెఱంగున నొప్పించుచున్నాఁడు.

గజసింహ—శూరులగు మీవారు రసపుత్రులచే మొగలాయి సైన్యములు పలుమారు లోడింపఁబడినవి. పరాజయములచేఁ జక్రవర్తి మిగుల జింతించుచున్నాఁడు. దానంజేసి సమరసన్నద్ధులు కావలసినదిగా మిమ్ముఁ జక్రవర్తియే యిపుడు ప్రార్థింపసమకట్టినాఁడు. వీరాగ్రేసరులైన మీరొక్కరే యీయవమానదుఃఖము నుండి చక్రవర్తిని గాపాడఁగలవారు. తనయందు మీకు భక్తి

శ్రద్ధలు మెండుగఁ గలవని చక్రవర్తి బాగుగ నెఱుంగును.

మహబత్—అట్లని చక్రవర్తి చెప్పెనా?

గజసింహ—చక్రవర్తి వేఱుగఁ జెప్పవలెనా? ఈవిషయ మెల్లరకు తెలిసినదే!

మహబత్—అలాగుననా! (పచారిచేయసాగును.)

గజసింహ—ఖాన్సాహెబూ! ఈమాఱు మీవారు రణమున ఖడ్గధారణ మొనరింపుఁడు. మీవారు మీజన్మభూమియం చెఱుంగుదును. మీవారు రాణాయైన అమరసింహునకు మీరు సోదరులని యెఱుంగుదును. కాని పుట్టుకతోడనే మీరు మీవారును పరిత్యజించినారు, హిందూధర్మమును విడచి ముసల్మానులై స్వదేశబంధమందలి కడపటి ముడినిగూడ స్వయముగ కోసివైచితిరి. అట్లయ్యు మీరీరీతి సంకోచించుచుంటిరేమి?

మహబత్—(అర్ధస్వగతమున) మీవారు నాజన్మభూమి కాకుండిన—

గజసింహ—ఆజన్మభూమి మిమ్మిఁక నెన్నఁడైన దనక్రోడతలమునఁ జేర్చుకొనునా? మీరు మరల మీవారు పోయిచూడుఁడు! బంధుభావముననే పొందు! మీవారువాసులు చూపుడువ్రేలితో మిమ్ము జూపించి "ప్రతాపసింహుని యన్నకొడుకు—ముసల్మానుమతము నవలంబించి, ధర్మద్రోహియయ్యె" నని బలుకుదురు. వృద్ధులు మిమ్ముజూచి మిగుల నేవగించి పెడమొగము వెట్టెదరు. యువకులు రోషకషాయిత నేత్రులై మీపై దీక్షణదృక్కులఁ బఱపుదురు. రమణులు గృహగవాక్షములనుండి మీపై శాపములఁ గురిపింతురు. భవిష్యమం దెన్నఁడైన రసపుత్రులు తమపవిత్రాలయము లందుఁ దావొసఁగి భ్రాతృభావమున వాత్సల్య పురస్సరముగ మిమ్మాలింగన మాచరించు కొందురన్నమాట కలలోనివార్త!

మహబత్—"ఊఁ" యని భావింపఁదొడంగెను.

గజసింహ—మిూభవిష్యము మొగలాయీల యనుబంధముతో కట్టు వడి యున్నది. వారి యౌన్నత్యముతో మిూయౌన్నత్యము కూడి యున్నది. వారిపతనముతోఁ బాటు మిూపతనముగూడఁ దప్పదు. ఖాన్‌సాహేబూ! ఆలోచించిచూడుఁడు.

(సన్యాసివేషమున సగరసింహుఁడు ప్రవేశించును)

సగర—మహబత్!

మహబత్—ఎవరు! తండ్రీ! ఇచ్చటకు— ఈవేషమున!

సగర—మహబత్ఖానూ! నేను సన్యాసాశ్రమమును స్వీకరించితిని.

మహబత్—తండ్రీ! ఎందులకు—

సగర—మహబత్! ఏలయని యబ్బురపడుచుంటివా!—అవును! అక్క జమొదవు విషయమే! దేశజాతి ధర్మంబులకు నీళ్ళువిడిచి ఐహిక మును విస్మరించి బైరాగివలెఁ జిరకాలము విజాతీయుల కరుణా వేశము నపేక్షించి, జీవనసంధ్యాకాలమున నీరీతి నిలువంబడితిని! ఆశ్చర్యపడవలసిన విషయమగుట నిక్కువమే! కాని మహబత్ఖానూ! సన్యాసినై పోవలసివచ్చుటకు కారణ మెరుఁగుదువా!

మహబత్—జనకా! ఎటుంగను—

సగర—ఇంతకాలము జరిగిపోయిన పిదపఁ బ్రేమమయియైన నామాతృదేవి యాహ్వానమునువిని సన్యాసివేషమున కర్మవీరుఁడనై పోవ నిశ్చయించుకొంటిని—జనయిత్రి . యాహ్వానమెంత గభీరమైనది! ఎంతకరుణామయమైనది. ఎంత గాద్గదికమైనది. మహబత్!— భావనాబలమునసైన నీవు దాని నెఱుంగఁజాలవు—మహబత్! నేను నాపాపంబునకుఁ బ్రాయశ్చిత్త మాచరించుకొనుచుంటిని. నీవుకూడ నీదురితంబునకుఁ బ్రాయశ్చిత్తముఁ గావించుకొనుమని చెప్పుటకై వచ్చితిని.

మహబత్—నా దురితంబునకా!

సగర—అవును! నీదురితంబున కే! స్వజనుల విడచి ముష్కరులైన మొగలాయీలదాసుడ నైతిని. నీవంతకంటెం బైమెట్టున కెక్కితివి! నన్ను మించితివి! స్వజనులనేగాక స్వధర్మమును గూడం బరిత్యజించితివి. నీపాపంబునకుం బరిమితి లేదు.

మహాబత్—తండ్రీ! నాపాప మెట్టిదియో నేనెఱుంగం జాలకుంటిని. ఇస్లాముధర్మము సత్యమైనదని నేను విశ్వసించి—

సగర—మహాబత్ఖానా! విశ్వసించి, యేమి! నీకిట్టి విశ్వాసమెట్లు కలిగెను? ఖురాను బాగుగాం జదివి యుందువు. ఖురాను తప్పక పవిత్రమైన యుద్గ్రంథమే! ఇస్లామవశ్యముగ నతిమహత్తరమైన ధర్మమే! హిందూధర్మము దానికెట్టి కీడును గలిగింపదు. దానితో దీని కెట్టి వివాదము లేదు. కాని, మహాబత్ఖానా! ఏధర్మము నీయదియో, ఏధర్మము నీపితామహ ప్రపితామహులదో; ఏధర్మము వ్యాసకపిల శంకరాచార్యాది మహాత్ములదో—ఆధర్మమును పరిత్యజింపక మున్ను, రవంతయైన దానిపరిచయముం గావించుకొంటివా? మూర్ఖుండవయ్యు, జడుండవయ్యు, నిరక్షరకుక్షివై ధర్మాధర్మ విచారమెట్లు సలిపితివి! అట్టివిచక్షణ జ్ఞానము నీ కెప్పటినుండి యలవడెను! మహాబత్! ఏధర్మముయొక్క మూలమంత్రము ప్రవృత్తిదమనమో,—ఆత్మజయమో; ఏధర్మచరమవికసనము సర్వభూతదయాళుత్వమో; ఏధర్మకృపాభావము కేవలము మనుష్యజాతితో మాత్రమే కట్టువడియుండక సామాన్య పిపీలికాదులం గూడ నంటి, హింసాకృత్యముల నిషేధించెనో;—ఆధర్మము నొక్కవచనంబున నీవు పరిత్యజించితివి! మహాబత్ఖానూ! నీవెట్టి పాపము నాచరించితివో తెలిసికొనుట లేదు.

మహాబత్—తండ్రీ! విస్మయంబున నానోట మాటరాకుండున్నట్లు నేడు మీరు—,

సగర — నేఁడు — నేను ధర్మవ్యాఖ్యానముఁ గావింపుచుంటి నందువా! తనూజా! ఇదినిక్కముగ నక్కజపడవలసిన విషయమే? అట్టి పాషండుఁడ నిట్టితినని దలంచి, నేనే యచ్చెరు వొందుచుంటిని— పృధ్వియం దర్థమునుదక్క వేరెఱుంగని నేను ఇత్తఱిధర్మార్థము శాపాయుధుఁడ నగుట యాశ్చర్యమే! కాని, మహాబత్ఖానా! ఉచ్చ ప్రవృత్తి నత్కాంతా సూచకంబై, హెచ్చుస్థాయిని బిగింపఁబడిన తంతియొక్కటిగూడలేని హృదయ వీణ యుండనేయుండదు. దైవవశమున నొకప్పు డాతంతి ఘటనాంగుళిచే మీటఁబడి మధుర స్వనమొనరించి, యమ్ముహూర్తమందే హృదయాంతరాళము నంతయు నానందముతో నిండించును. అప్పుడాత్మక్షుద్రస్వార్థ నిర్మోకనిర్ముక్తంబై, అనంతాకాశ పథంబున బర్విడిపోవును. ఈ విషయమును నాకు కల్యాణి యా నాఁ డెఱింగించెను.

మహాబత్ — కల్యాణియా?

సగర — అవును! కల్యాణియే! ఆవిషయ మిపుడుకూడ నాకర్ణపుటము లందు సంగీతస్మృతి లీలవినంబడుచున్నది. మహాబత్! కల్యాణిజన కుఁడు కల్యాణిని దనగేహమునుండి వెడలఁగొట్టెనను విషయ మును నీవెఱుంగుదువా?

మహాబత్ — గేహమునుండి వెడలఁగొట్టెనా — ఆపెసలిపిన యపరాధ మేమి?

సగర — కల్యాణి యిపుడుకూడ నీయదియై, ధర్మాంతరుఁడవైన నీకుఁ బూజసేయుటయే యపరాధము!

మహాబత్ — జనకా! ఆమెను మీరెచటఁ జూచితిరి.

సగర — ఒకయూరిలోఁ పాడువడిన కుటీరమున.

మహాబత్ — తండ్రీ! ఇదియేనా మీయత్యుదార హిందూధర్మము! కల్యాణి పతిభక్తికి నిర్వాసనమే పురస్కారమయ్యెనను విషయమే

యిస్లాము ధర్మమునై హిందూధర్మమునకు గలకఠిన విద్వేషదంభములఁ వెల్లడించుచున్నది! జనకా! ప్రాయశ్చిత్త మాచరించుకొనవలె నంటిరిగదా! నిక్కమముగ ప్రాయశ్చిత్తముఁ గావించుకొనియెదను!— కాని అట్లొనరించుట ముసల్మానునై నందునగాదు; ఒకప్పుడు హిందువునై యున్నందున సంభవించిన పాపము హరించుటకై ప్రాయశ్చిత్తముఁ గావించుకొందును!—

నగర—ఏమనెదవు మహబత్ఖానూ!

మహబత్—నేఁటినుండి హిందువులపైఁగల కరుణాశేషరేఖను నా హృదయఫలకమునుండి చెరపివైచితిని. ఈక్షణమునుండియు నేను నానరము నరమునందును నామజ్జామస్తిష్కములందు నాప్రతిస్నాయువునందును— నాప్రతి రక్తబిందువునందును ముసల్మానునై యుందును!

నగర—మహబత్ఖానూ! ఏమి!

మహబత్—మహబత్ఖా నల్పభాషియనియు, నతఁ డొనర్చు ప్రతిజ్ఞ యెల్లప్పుడు కడు భీషణమై యుండుననియు నెఱుఁగుదురా!

నగర—ఏమి!

మహబత్—జనకా! ఇఁక నుపదేశములును, యుక్తులును, ఆదేశములును నిష్ఫలంబులని యెఱుంగుఁడు!

[నిష్క్రమింప నుంకించును.]

నగర—మహబత్! నీవిట్లధోగతిపాలైతివా! అటులైన నశింపుము! అంధకూపమునబడిధ్వంసమైపొమ్ము! నిరయశిఖిశిఖావిస్ఫులింగములందు దగ్ధమైపొమ్ము! మ్లేచ్ఛా! ధర్మద్రోహీ!! కులద్రోహీ!!!

[నిష్క్రమించును.]

[నగరసింహుఁడు నిష్క్రమింపగనే మహబత్ఖాను మిగుల నుత్తేజితుఁడై యాగారమునఁ బచారిచేయుచు] "ఏమి! ఈవిద్వేషము!

ఏమి! వారియాక్రోశము! ఇట్టి జాతి పలుమారు ముసల్మాను పదవిదళితమగుట వింతగాదు! ఇట్టి నిర్ధనమానమును వట్టిగో గూడ ముసల్మానులు హిందువులకుఁ దీర్చివైచుట యాశ్చర్యము గాదు. అత్యుదారసనాతన హిందూధర్మమున నిదియే గాఁబోలు! ఎట్టివిధర్మినైన నిజవక్షమున నిడికొనిఁ వానిఁ దనవానిగాఁ జేకొని రక్షణం బొసఁగు మహాత్మ్యము ముసల్మానుధర్మమునకే గలదు! ఇఁక నాధర్మ మెట్టిదో నెఱుఁగ నేనిచ్ఛగింపను. ఏమి! ఈహిందువుల దుర్వారగర్వము! వేయిజన్మములు తపస్సుచేసినను, అన్యమతస్థుఁ డొకఁడు హిందువు గాఁజాలఁడు! ఏమి! దుర్నయము! ఏమిస్పర్ధ నరే! ఇఁక మందుడనై యుండరాదు. ఈదుర్మతుల మదంబడంపవలయును! కౌర్యమును పోగొట్టవలయును. అహంకారమును చూర్ణ మొనరింపవలయును!!! మహారాజ్జీ! నేను సంగ్రామసంసిద్ధుఁడ నగుచుంటిని! మీూవారు పైకిదుముకుచుంటిని. వేగమేపోయి ఈవిషయమును చక్రవర్తి కెంఱింగింపుఁడు!

[గజసింహుఁడు విస్మయుఁడై వాడిచూపుల ఖానుపై బఱప దొడంగును.]

మహాబత్—మహారాజ్జీ! అబ్బురపడుచుంటిరేల? ఏల యీరీతి రణ మొనరింప నిశ్చయించితినో యెఱుంగుదురా?

గజసింహ—నృపాలభక్తులై, చక్రవర్తి పంపునుల్లఘింపఁ జాలక?

మహాబత్—మహారాజ్జీ! దానంజేసికాదు. హిందూవిధ్వంస మొనరించుటకే! హిందువుల నందఱ నుచ్ఛేద మొనరించి వైచెదను! మీూ జాతివారల నందఱ నగ్నికుండమున బడఁద్రోయుదును. ఆలసింపక దామీూవిషయము సామ్రాట్టున కెఱిగింపుఁడు!

[గజసింహుఁడు సలామొనరించి నిష్క్రమించును. మహాబత్ఖాను మఱియొక దిక్కుగ బోవును]

పంచమదృశ్యము.

జహాంగీరుసభ—ప్రభాతకాలము.

చక్రవర్తియగు జహాంగీరును, హెదాయత్ అలీఖానును, సభాసదులును గూరుచుని యుందురు.

జహాంగీరు—ఈకళంకము మరణించినను మాయదు. పరభేజు భీరుఁడనియు, దుచ్ఛుఁడనియు నాకిప్పుడు తెల్లమయ్యెను (హెదాయతు నుద్దేశించి) మీరేల యోడిపోయితిరి?

హెదాయత్—జాఁహాపనా! (మహాప్రభూ!) ఓడిపోవలెనను కోరిక మాకించుకంతైన లేదని శపథపూర్వకముగ, జెప్పఁగలను.

జహాంగీరు—హెదాయత్! మీరందఱుకూడఁ బనికిమాలినబడుగులే!

హెదాయత్—చిత్తము మహాప్రభూ! మీరు సరిగా గ్రహించితిరి.

జహాంగీరు—హెదాయతూ! నీవుబవరమునఁ బరాజితుఁడవై, బంధింపఁబడి పిదప రాణా కృపతో విడిచిపెట్టఁబడి యిటకు వచ్చితివి. కాని అబ్దుల్లా రణమందుఁ దన యసువులఁ బాసెను. వానివలె సమరాంగణమున నసువులవీడఁ జాలక పోతివేమి?

హెదాయత్—మహాప్రభూ! మొట్టమొదట నుండియు నాకట్టియిచ్ఛయేయుండెను. కాని యుద్ధమందుఁ బ్రాణముల వీడ నభిలషించినపుడు యుద్ధమే సంభవింపలేదు. ఈజరిగిన రణములన్నియు నాయుద్ధమరణేచ్ఛ వదలిపోయిన పిదప సంభవించెను. లేకున్న—

జహాంగీరు—నీకదనమరణేచ్ఛ కొంతకాలముండి పిదపనేల యంతరించెను?

హెదాయత్—(దుఃఖమును సూచించు స్వరముతో) మహాప్రభూ! పదునేనవ వత్సరమున మిగుల వ్యాధిగ్రస్తుఁడనై, వరుసగఁ బదునేను రాత్రులు లంకణములు చేసితిని. వ్యాధిపీడితుడనై యేమఱియుండ నాయిచ్ఛయన్ను వదలిపోయినది.

జహాంగీరు—అప్పుడు నీప్రాణములు నిన్ను విడిచిపోయిన బాగుగనుండె డిది. హెదాయతూ! కడచిన కామ్నారు కదనమున నీశూరత్వపటి మనుజూపెనదని బ్రగల్భములు గొట్టితివిగదా! నీవు జూపిన శూరత్వ మేమి?

హెదాయత్—మహాప్రభూ! నేనెంతయో శూరత్వమును జూపఁద లంచితిని. కాని నాభార్య నన్నెంతయో వారించుటచే నేనట్లు జూపఁజాలనైతిని.

జంహాంగీరు—శుంఠా! ఇట్టిపిచ్చి కూఁతలఁ గూయుటకంటె గడచిన కదనమునఁ గడతేరిన యుక్తముగ నుండెడిది.

హెదాయత్—మహాప్రభూ! కడచినకదనమందు పౌరుషముతో బోరి, యరివీరులఁ బొలియించి వారికంటెముందుగ వీరస్వర్గము నలంకరింప దృఢనిశ్చయుఁడ నైతిని. కాని యుదార చిత్తయైన నాభార్యయిఁకఁదనకే దారియు నుండదను భయమునఁ బానకమం దలి పుడకవలె నాదారికడ్డము వచ్చి మూఁరుత్రోవఁ బట్టించినది.

జహాంగీరు—ఇఁక నీవును ఉదారమైన నీభార్యయు గంగలోఁ బడి చచ్చిపొండు.

హెదాయత్—మనమందరము—

జహాంగీరు—ఛీ! నోరు- ముయ్యి!

(నగర సింహుఁడు ప్రవేశించును)

జహాం—ఓహో! రాజానగరసింహా!

నగర—అవును సామ్రాట్టూ!

జహాం—నిన్ను మిూవారు రాణాను జేసి చిత్తూరు దుర్గమునకుఁ బంప నీవాదుర్గమును రాణా అమరసింహునకు సమర్పించి వచ్చితివా?

నగర—సామ్రాట్టూ! సమర్పించియే వచ్చితివి?

జహాం—ఎవరి యాజ్ఞగాని? (ఎవరి యనుజ్ఞచే?)

సగర—ఎవరి యాజ్ఞగొనుటకు నేనిచ్ఛగింప లేదు.

జహాం—(క్రుద్ధుడై) ఏమి?

సగర—న్యాయముగా చిత్తూరు రాణా అమరసింహుఁడని యెఱింగితిని.

జహాం—ఏమి యెఱింగితివి?

సగర—అక్బరు చక్రవర్తి చిత్తూరును న్యాయయుద్ధమున స్వాధీనముఁ గావించుకొన లేదనియు, మాయోపాయమున నతఁడు జయమల్లు నివధియించి, దుర్గాక్రమణముఁ గావించెననియు నెఱింగితిని.

జహాం—రాజా! ఇట్టి న్యాయాన్యాయ విచక్షణ నీకెప్పటినుండి గలిఁగెను?

సగర—ఏముహూర్తమున నొక పురాతనాలోకము నాలోకించితినో, ఆముహూర్తమునుండి!

జహాం—విశ్వాసఘాతుకా! పురాతనాలోకమును విలోకించితివా?

సగర—చక్రవర్తీ! అవును! నేనొక యపూర్వ తేజమును వీక్షించితిని. ఆకస్మికముగ నాకన్నుల పొర తొలఁగిపోయినది. రామాయణ యుగమాదిగఁ బ్రతిభామయ మగు మీవారు రాజ్యపు అతీతస్థితి కన్నులదరినుండి వెల్లిగొనిపోయెను—బప్పారావుల విజయగాథలు సమరసింహుని యాత్మబలి చండుని త్యాగము కుంభుని శౌర్యము మొదలైన యతీతఘటనల యనిర్వాచ్యమహిమమయాభినయమును వీక్షించితిని! తదుపరి యాకస్మికముగ నద్దీప్తిరంగము అంధతమోహిమచ్ఛన్నమై యానీహారాభ్యంతరమున నప్రతిమాన ప్రతాపుండైన ప్రతాపసింహుని— నాసోదరుఁడైన ప్రతాపసింహుని—నిశితకృపాణశుభ్ర తేజోధగద్ధగలు బ్రకాశింపసాగినవి. నేనపుడు మనోధిక్కార మాచరించితిని.

జహాంగీరు—తదుపరి?

సగర—అట్టి మహద్వంశమున నుద్భవించి, యద్దివ్యమహిమును ధ్వంస

మొనరింప రసపుత్రకు లోచ్ఛేదనా సక్తులైన ద్రోహుల సఖ్యము నరించి మ్లేచ్ఛమైత్రిచే నొకనరకషడ్యంత్రమును బన్ని యుచితకృత్యమే గావించుచుంటినని మనస్సాక్షికి బోధింప శక్తివంచనలేక యత్నించితిని. కాని నాచిత్తము ధిక్కార మొనర్చినది. తదుపరి మఱొకయద్భుత!—యపూర్వదృశ్యమును విలోకించితిని. (అతనికన్నులవెంట బాష్పములు జారుచుండును.)

జహాం—ఆయద్భుతా పూర్వదృశ్యమేమియో దెలుపుము.

సగర—ఆదృశ్యమతీతముకాదు!—పౌరాణికముకాదు! ఐతిహాసికముకాదు! దార్జన్యపురస్సరముగ నేదేశమును స్వాతంత్ర్య భ్రష్టమొనరింపఁ గ్రూరులైన మొగలులఁ గూడి కుటిలుడనై, కుమతినై, కుత్సితుడనై, కూళనై, క్రూరుడనై, కుట్రలు సలిపితినో,—ఆదేశస్వాతంత్ర్యరక్షణార్థము బరిత్యజించి మ్లేచ్ఛోచ్ఛిష్టభోజనుఁడనైన నాదుకూతురు కాషాయవసనములఁ దాల్చి వైరాగ్యము- స్వీకరించి వనములఁ ద్రిమ్మరుచు—తురుష్కపటూ నలంబనైన నా సమక్షమున-నిలచినతఱిఁ గన్పట్టిన దృశ్యమే అయద్భుతాపూర్వ-దృశ్యము! ఆదృశ్యావలోకనంబున నాచక్షువు లశ్రువారి పూరితంబులైనవి. నాకంఠము రుద్ధమైపోయినది! లజ్జాప్రణయభక్తిగర్వంబులతో హృదయము నిండిపోయినది. తదువాత సిగ్గుపడినాయన్నగారిపుత్రునకు జిత్తూరు దుర్గమ్మును సంతోషముతో సమర్పించితిని.

జహాం—సగరసింహా! సమర్పణముసలిపి, మరణసంసిద్ధుఁడవై వచ్చితివా?

సగర—నిక్కవంబుగ నందులకే వచ్చితిని. పూర్వము మరణమన్న నాకెంతయో భీతిగలిగెడిది! కాని నవమంత్రదీక్షితుఁడనై నదాదిగ భయరహితుండ నైతిని.

జహాం—సగరసింహా! ఆ నవమంత్ర మెయ్యది ?

నగర—అది త్యాగమంత్రము! పృథ్వియందు రెండు రాజ్యము లున్నవి. ఒకటి స్వార్థము; రెండవది త్యాగము. మొదటిదాని జన్మస్థానము నరకము; రెండవదాని జన్మస్థానము నాకము! మొదటిదాని వేలుపు భూతము; రెండవదాని వేల్పు ఈశ్వరుడు! స్వార్థరాజ్యమందుఁ జిరంబుండితిని. పిదప త్యాగరాజ్యంబును విలోకించితిని!—ఆ రాజ్యమునేలు నృపులు బుద్ధ, క్రీస్తు, గౌరాంగులు! ఆ రాజ్యమందలి రాజనీతులు భక్తికృపాప్రేమలు! తద్రాజ్యశాసనము సేవ! రాజదండన మనుకంపము! పురస్కారమాత్మబలి సమర్పణము. ఇట్టి యద్భుతాపూర్వ దృశ్యాలోకనము మొదలు నేను, ఆ రాజ్యంబున వసియించుచుంటిని. ఎన్నఁడును కరవాలమును స్పృశింపని నాకరముతో నార్తరక్షణార్థము శాతకృపాణమును ఝుళిపించితిని! అపుడు దస్యుఖడ్గాఘాతము నాకంఠమునకుఁ గోమల ప్రసూన స్పర్శాసదృశమై దోఁచె!

జహం—తదుపరి?

నగర—పిమ్మట నేనీ మృత్యుముఖగహ్వరమును జొచ్చి పూర్వము నేనొనర్చిన పాపములకుఁ దగు ప్రాయశ్చిత్తముఁ గావించుకొనదలంచితిని! ఇంతకుమున్నేను మరణమన్న మితిలేని భీతినొందెడివాఁడను. అట్టిభయ మిపుడావంతయైన లేదు. ప్రణయసలిలార్ద్రచిత్తుఁడనై త్యాగమంత్ర దీక్షితుఁడనైన నేను మృత్యుకన్య నాహ్వానింప భయమేల పొందుదును?

జహం—మంచిది. టులైన మరణింపుము—సేవకా!

(సేవకుఁడు ప్రవేశించును)

నగర—సేవకుఁడై యెందులకు!!—తలవరిచేయవలసిన పనిని నేనే గావించుకొనుచుంటిని— ఈరక్తముచే, నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తమగుఁగాక.

[అని కత్తితో పొడిచికొని పడిపోవును]
హాహాకారములతో తెరపడిపోవును.

"Sending for his nephew Sagarsinha restored to him Cheetore, retiring to the isolated Kandhar. Some time after, upon going to court, and being upbraided by Jehangir, he drew his dagger and slew himself in the emperor's presence an end worthy of such a traitor." (It was one of his sons who apostatized from his faith, who is well known in the imperial history as Mohabat khan beyond doubt the most daring chief in Jehangirs' reign. This is the secret of his bond of union with Prince Khoorum (Shahjehan), himself half a Rajpoot. It was with his Rajpoots Mohabet did that daring deed, making Jehangir prisoner in his own camp, in the zenith of his power."

శ్రీ

# మివాఘపతనము

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము

ఉదయసాగరతీరము — వెన్నెలరాత్రి

రాణా అమరసింహుడొక వేదికపై విలాసముగ గూరుచుండును. ఉదయసాగర సలిల కల్లోలము చెవుల విందు నొనరించుచుండును. దగరనున్న చెట్టుపై కోకిలమొకటి కూయుచుండును. కొంచము దూరమున స్త్రీలు శారదోత్సవ క్రీడల నృత్యమాడుచు ఇట్లు పాడుచుందురు

గీతి

ప్రకృతి నిశ్చల శాంతిస్థానంబు గాదె
లలితపవనంబు కుసుమతావుల వహించె
కుసుమతావుల వహియించి కదువ లెంతొ
చారుశారద కౌముదీస్నాతమేఘ
శకలములు నేత్రపర్వంబు సలుపుచుండె
వెన్నెలలవానగురియు జాబిల్లిజూచి
కలువకన్నెలు నవ్వురేకులను విప్పె
ఆకసంబున దిరుగు విహంగతతుల
మధురగానంబు చెవిసోకె మనసువిరియ
శిశిరకాంతులతోడఁ దోచె నుడురాజు
తరళయమునానదీ జలదర్పణమున
ప్రతిఫలించెను శిశిరేందువదనకాంతి

కదలిరారమ్మ వేవేగ కాంతలార
శిథిలహృదయాలకానంద జీవకళల
నవ్యమాధుర్యమొసగు నీనాటిరేయి
ప్రేమగానంబొనర్చుచు నృత్యమాడ
రండు వేవేగ మీరెల్ల రమణులార!

అమర—నర్తనమొనరించు నాకాంత లందఱు ప్రమోదమానసలై యున్నారు. తమ పదతలమందలి భూతలము క్రుంగిపోయినను, వారెఱుంగ జాలని స్థితిలోనున్నారు. ఏమి యీమాయాసంసారము! వివిధంబులైన బూటవస్తువుల మనుజున కొసంగి, యాత్మవిస్మృతిం గలిగించుచుండును. ఇట్లుగానిచో నీమరుభూమియందు మానవుం డుండనేల యిచ్ఛగించును! ప్రపంచ మొండు ప్రకాండమాధ్యమగుట నిక్కువము!—ఇదిగో! మానసి యిటుల వచ్చుచున్నది.

(మానసిప్రవేశించును.)

మానసి—తండ్రీ! మీరింక నిచటనే యుంటిరేమి! గృహాభ్యంతరమునకు రండు. ఇచట హిమవర్షము గురియుచున్నది.

రాణా—అమ్మా! ఒకించుక సేపైన నిచట వచ్చెదను. ఈయుదయసాగరతీరమునం గొంచెము సేపు గూరుచున్న చిత్తశాంతి గలుగును—మానసీ!

మానసి—ఏమి తండ్రీ! ఈసంసారమంతయు శఠత గాదా? ప్రతారణముగాదా?

రాణా—శఠతయా! ప్రతారణమా! భావాభ్యాసమున మనుజుం డమరత్వము నొందకుండుటకై సంసారము వానిచిత్తమునకు పలుచింతలచే విక్షేపమొనరించుచున్నది.

మానసి—జనకా! సంసారమంత కట్టిడిదని నేం దలంపజాలను.

రాణా—బిడ్డా! ఈశృంగార జ్యోత్స్నం గాంచుము! వారికల్లోలమును

వినుము ! ఈస్నిగ్ధమారుతసుఖస్పర్శ ననుభవింపుము ! ఇట్టిప్రమోదదాయకప్రకృతి సంపదలనుండి మాయాప్రపంచము—వంచక సంసారము మనుజుని విచ్ఛేద మొనరించి, వాని చరణద్వంద్వము నొడసిపట్టి జీవనసుఖదుఃఖముల వైపుగ వానిని లాగివైచుచున్నది. అమ్మా! నేనిట్టిసంసారమును త్యజించివైచెదను. ఇఁక నీమాయా జలధి మునింగియుండఁజాలను.

మానసి—తండ్రీ! ప్రపంచమంతయు మాయయని దలంతువో, నది మిగుల మనోహరమైన మాయయని యెఱుంగుఁడు. ఈబాహ్య ప్రకృతి మిగుల సుందరంబైనది. మాతరీతి నది మనలఁ బ్రేమించును. గ్రీష్మప్రచండోత్తాపమున మనము దగ్ధప్రాయులమగుచో, నచిరంబున నెమ్మదిగంభీరగర్జనము సలుపుచు, వసుంధరపై వారి రాశిని వెదఁజల్లుచు మానవమానసంబులకు హాయిఁగొలుపుచు, వర్షము గురియును. దారుణశీతలంబు కతన జర్ఝరితుల మగుచో, నవ వసంత మరుదెంచి, తన సుగంధి మందమారుతముచే శీత హిమానీబంధనమును విప్పివైచును. దివాతపమునందుఁ గ్లాంతుల మగుచో మాతమాంద్యి నరుదెంచి, నిశీథము మన వ్యథితమస్తకమును దన క్రోడతలమునఁ జేర్పుకొనును. కాని యింతటితోఁ బ్రకృతికృత్యము లంతరింపలేదు.

రాణా—మానసీ! అవెచట శేషించినవి?

మానసి—మనుజుని చింతాజగతియందు. తండ్రీ! హర్షదాయకంబైన యీ ప్రాంతమును విలోకించితిరా?

రాణా—అమ్మా! చూచితిని.

మానసి—దానిపైఁ బ్రసరించు శీతకిరణుని శమానీతకరముల చూచితిరా?

రాణా—చూచితిని.

మానసి—వానిని స్పృశింపఁ గలరా? ఈజ్యోత్స్నను ఈవారికల్లో
లమును తాకఁగలరా? అంధకారమీవారివక్షమున నాసీన
మగుచో దుఃఖమున నాయువు వీన విరమించును. అపుడీసౌందర్య
మీసంగీత మెచటి కరుగునో యెఱుంగుదురా?

రాజా—అమ్మా! ఎచటి కరుగునో దెలుపుము.

మానసి—ఎందరుగునో నిక్కువముగఁ దెలుపఁజాలను. కాని అది
లుప్తమై పోదు. విహగముల స్మృతియందును, కవీంద్రుని స్వప్న
మందును, జనయిత్రి ప్రేమయందును, భక్తుని భక్తియందును,
మర్త్యుని యనుకంపమందును అది ప్రసరించియుండును. మనుజు
నందు నీ మహిమం బెట్టి తేజస్సుగంధ ఝంకారములచే నజస్ర
ము వృద్ధి గావింపఁబడుచుండును. అట్లు గానిచో నీ ప్రకృతిసౌంద
ర్యముయొక్క సార్థకత యేమి?

రాజా—అమ్మా! మానవునందు మహిమం బేమి యున్నది? అత
డీర్ష్యాలోభ ద్వేషంబులతో నిండియుండు టెఱుంగవా? అన్నపు
ముద్ద నోటఁబెట్టు తఱి దన్ను వంచించి యక్కఱబళ్ళను గుడుచు
చున్నట్లు జగం బంతయు లుబ్ధనయన దృక్కుల వానిపై బఱపు
టెఱుంగవా?

మానసి—అది మానసిక వ్యాధి, ఈవ్యాధి లేకుండిన మనుష్యాను
కంపమునకుఁ దా వెట్లుండును? నరుఁ డేరి దుఃఖము నుపశమింపఁ
జేయును? ఎవ్వరి యాయాసము నపనయింపజేయును? నికృష్టదశ
నుండి యుత్కృష్టావస్థ కతఁ డెవ్వరిని దేఁగలిఁగి సుఖం బుండును.
జనకా! సంసారం బధమమంచు దానిని ద్యజింపవలయునా!
మానవుఁడు దుఃఖభాజనుఁడు. శోకాంబోధినుండి వానిని రక్షించుట
మంచికార్యముగాదె! సంసారము మిగుల దీనమైనది. శక్తివంచన
లేక ప్రయత్నించి, దాని నున్నత మొనరించుట మనకర్తవ్యంబు.

రాణా—అమ్మా! నీవు సత్యమునే నుడువుచుంటివని దోఁచెడిని. నా మస్తిష్కము నేఁడేలకో మిగులనుత్తప్తమై యున్నది. ఏమియు భావింపనేరకుంటిని.

(నేపథ్యమున)—మానసీ!—మానసీ!

మానసి—జననీ! వచ్చుచుంటిని—లోనికిరండు—రాత్రి చాలగడచెను.

(నిష్క్రమించును)

రాణా—ఏమియీదృశ్యము! ఇదొండు స్వర్గబంధము! ఒక నీహారిక!—ఒకజగత్సారభూత సౌందర్యము! మలయానిలుండు మందగతిఁ బర్వులిడుచుండెను! నభస్సీను నిర్మలంబై యుండె! అంబుదశ్రేణు లెచ్చోటనో విశ్రమింపఁ బోయెను! జగంబంతయు నిస్తబ్ధమై యుండెను! కేవలమొక్క యుదయసాగర సలిలంబులపై సంగీత తరంగమొండు చప్పుడడుగు లిడుచుండెను. అభ్రితలమునుండి యవతరించు కిశోరస్వర్ణద్యుతులు సరోవరోర్మికలందు దానమాడుచుఁ బ్రమోదమునఁ గిలకిలమని నవ్వుచుండెను! చెవులసోకు నీకల్లోలము వానీకలహాస్యకలకలము పాదపత్రములు జ్యోత్స్నాలోకమున సుగంధమును మేనునలందు కొన్న సమీరునికూడి ఖేలన సుఖమొందుచుండెను. ఈమర్మరధ్వని వానిక్రీడాకలరవము నాఁ దోఁచుచుండె! అచేతనవస్తువులు కూడ సౌందర్య సుఖంబు ననుభవింపఁగలవని దలంచెద,

(రాణిప్రవేశించును)

రాణి—రాణా!

రాణా—నేస్వప్నమును గాంచుచుంటిని.

రాణి—మేల్కొనియుండియే స్వప్నమును గాంచుటయా! ఏమి చోద్యము!

రాణా—చాలు! స్వప్న భంగ మొన రించితివి! ఏలవచ్చితివి?

రాణి—ఇంకెందులకు!—కాలమానమంతయు మారిపోయినది! ఇప్పటి పిల్లలెవరును దలిదండ్రుల లక్ష్యపెట్టరు. అనాఁడు గోవిందసింహుని బిడ్డలిరువురు జనకు పైకోపించి యెచటికో లేచి పోయిరి. ఇఁకను.

రాణా—(చెవులమూసికొని) రామా! ఏమియీవచనములు! మరల నా దైనందినప్రసంగమే! సంసారచక్ర నేమికర్కశ ఝణంఝణ ధ్వానము! కటినఘటనా నిష్పేషణము!

రాణి—కలికాలపు బాలికలెట్టివారు! మేము కూడ నొకప్పుడు బాలికలమై యున్నవారమే కాని కట్టిశితనమే మా యెఱుఁగము.

రాణా—మీశైశవము సత్యయుగములోనిది. తల్లులెప్పుడు సత్యయుగపువారే యగుదురు—తనయలెల్లపుడు గలియుగపు వారలగుదురు. పోని మ్యాఖవిషయ మెందులకు! ఇప్పుడు నీవువచ్చినపని యేమి?

రాణి—వేరుపనేమియు లేదు—అచిరములో మూనసికి బరిణయము కావలయును. విలంబనమగుచో నామె యవివాహితయై యుండు నని భయ మొందుచుంటిని.

రాణా—ఆమె యవివాహితగానే యుండునని దోఁచుచున్నది. మానసి యింకను పరిణయ సంసిద్ధగాలేదు.

రాణి—బాగుబాగు? తనయకు బాణిగ్రహణ మొనరింపదలఁచుట లేనట్లు దోఁచుచున్నది. ఇంకను స్వప్నావస్థలోనేయుండి, ప్రసంగించుచుంటిరా? [illegible]

రాణా—నేను స్వప్నమునైన వీక్షించుచుంటిని. నీవో! అట్లు వీక్షింప నసమర్థురాలవు.

రాణి—ఇప్పుడు చేయవలసిన కర్తవ్యమేమి?

రాణా—నేఁ దెలుపఁజాలను. జరుగనున్నది జరుగకమానదు.

రాణి—జరుగనున్నదేమి! యోధపురమునుండి బ్రాహ్మణులింకను

దిరిగిరాలేదు. సత్యవతి తనరాజుఁగూడ నంపిరి. అతఁ డింకను మగుడి రాలేదే ?

రాణా—అరుణసింహుఁడు మగుడి యరుదెంచెను.

రాణి—వివాహలగ్నముఁ గుదిర్చిరా ?

రాణా—లేదు. మనతనయను దనకోడలిగఁ బరిగ్రహింప గజసింహుఁ డియ్యకొనఁడఁట.

రాణి—ఏల ?

రాణా—అతఁడు నాపైఁ గినిసెనఁట.

రాణి—కినియు టెందులకు ?

రాణా—యుద్ధమందు నే గెలుపొందుట మొగలాయిలు నిర్జితులగుటే గారణముగ గన్పట్టుచుండెను !

రాణి—పెండ్లివిషయమై యాదినుండియుఁ బోరుజరుగుచున్నది. 'పోరు నష్టముపొందు లాభ' మన్నట్లయ్యెను.

రాణా—ఏమైననేమి, అంతయుభ్రమ !

రాణి—భ్రమయేమి ?

రాణా—యోధపురాధీశ్వరు నందనునకు మనబిడ్డ నొసఁగి, పరిణయ మొనరింపఁ దలఁచుట భ్రమ ! ఈసైన్యములఁ దోడ్కొని మొగలులతోఁ బోరుసలుప నెంచుట భ్రమ ! నిన్ను నేఁ బరిణయమాడుట భ్రమ ! నారాజ్యముభ్రమ ! నాజీవనముభ్రమ!—సర్వము భ్రమ!

రాణి—అవివాహితనై యున్నపుడు, నన్నెఱుఁగకుండుటయు, నన్ను పరిణయమాడకుండుటయు గూడ భ్రమయే ! మీపరిణయమునకు బూర్వము భ్రమయే, పరమందు భ్రమయే! కాని యిప్పుడు మీకీ మతిభ్రమ యెందులకుఁ గలుగవలయును? నవ్వుచుంటిరేమి?

రాణా—రాజ్ఞీ! గజసింహుఁ డాగ్రాయరిగిన విషయము నెఱుంగుదువా?

రాణి—ఎఱుఁగను. అతఁ డెందుల కరిగెను?

రాణా—మీవారు పునరాక్రమణార్థమై చక్రవర్తిని బురికొల్పుటకుఁ దోఁచుచున్నది.

రాణి—ఏమి! మీరు మరల నవ్వుచుంటిరి! ఇది నవ్వుఁగొలుపు విషయమా?

రాణా—అవును. ఇఁక నవ్వుఁగొలుపు విషయముల నెఱుఁగఁజాలము. ఈతరుణమందే నీవుకూడ నవ్వుకొనుము.

రాణి—నేఁ గూడ నున్మాదినిని గావలయునా?

రాణా—రాజ్ఞీ! మంచివార్త వింటివా?

రాణి—ఆ మంచివార్తయేమి?

రాణా—సర్వ నాశమగును:— ఏమియు శేషింపదు!— ఎవరును మిగులరు!

రాణి—నాకీ వచనములు బోధపడవు. మానసి పరిణయ మెట్లైన జరుగ వలయును.

రాణా—అదెట్లు జరుగ గలదు.

రాణి—వేగమపోయి మార్వారును ముట్టడించిన, సంగతులన్నియుఁ బిమ్మట దేలును.

రాణా—రాజ్ఞీ! క్షత్రియకాంతవనుటకుఁ దగుప్రమాణము నిన్నిదినములు గడచిన పిదపఁ జూపితివి! సతీ! శక్తికంటె భక్తియెక్కుడైనది. యోధపురభర్త మొగలుభక్తుఁడు—మనము కాము. కేవలము శక్తిపై నిర్భయులమై యున్నాము. ఇపుడాశక్తి కూడ సన్నగిలుచున్నది!

రాణి—అటులైన నీయవజ్ఞను నీరవులై సహించెదరా?

రాణా—నిక్కవముగ సహించెదరు. కాని నీరవుఁడనై సహింపను. ఆర్తనాదముఁ గావించెదను—భోజనసన్నాహము లైనవో లేవో

చూడుము !—రాజ్ఞీ ! ఇఁక మనకేమియు భయము లేదు ! సర్వాంబంతరించును ! ఏజాతియందింత నీచమున్నదో—దాని నీశ్వరుఁడైన రక్షింపఁ జాలఁడు—ఇఁక మానవమాత్రుఁ డేమిచేయఁగలఁడు ? నీవు పొమ్ము ! నాచిత్తమును వ్యాకుల పఱుపకుము.

రాణి—మన జాతియం దెట్టియవినీతులున్నను, మీయందు దోసంబు లేశంబైన నున్నదా ?

రాజా—దోసంబా ! గజసింహుఁడును నేనును ఒకేజాతివారమగుటయే నాదోసంబు ! రాజ్ఞీ ! ఒక యారూఢుని దోసంబుకతన వారి యాన మొండు వార్థిగర్భమున మునుఁగుతఱి, దోషియు, సహాయులైన నిర్దోషులును, గభీరసలిలగర్భమున మునుఁగు టెఱుంగవా—ఇఁక నీవుపొమ్ము.

[రాణి నిష్క్రమించును.]

రాజా—(నింగి వైపుఁగ జూచి) కృష్ణవర్ణము దాల్చి ఆకస మెంత భయాకరముగ నున్నదో !

[నిష్క్రమించును.]

(మానసి మరలఁ బ్రవేశించును.)

రాకుమారా! పోవుటకుఁ బూర్వము నీ సౌందర్యాననము జూపి పోతివిగా వేమి! "కడపటి వీడుకోలు" లంచు లేఖయందు వ్రాయక స్వయముగవచ్చి నన్నుఁ గాంచిన నాయుల్లంబు దల్లడిల్లక జల్లఁబడి యుండుఁగదా! అజయా! కోపించితివా? కృపాళుఁడవగు నీ వట్లు చేయవు. దేశాంతరమునకుఁబోవుతఱి నిన్నుఁ బూజించు నీ మానసికి దర్శన మొనరించిన గడు యుక్తముగ నుండి యుండదా! నాపై నిట్టి క్రూరత్వము జూపితి వేమి? చెనటినై యేల నిన్ను దూషించుచుంటి! మన్నింపుము! శూరాగ్రేసరా! రసపుత్రకులదీపకా! నీకొఱకై శోకాంబుధియందు

మునుఁగజెల్లునా! అయ్యో! అజయసింహా! నీదర్శనము నాకు మరల నెప్పు డబ్బునోగదా! ఇదేమి! చంద్రకాంతి యింత క్షీణించి యున్నది. ఉదయసాగరవారి వక్షు మాకస్మికముగ నింతమ్లానమై యున్న దేమి? ప్రకృతికాంత ముఖ మండలి శృంగారహాస మింత లోనే యదృశ్య మైపోయె నేమి!

గీ తి.

నింగిజాబిల్లి పండువెన్నెల నశింప
అరిగె నెయ్యెడకో మలయానిలుండు;
సౌరభమ్మును బాసె బుష్పంబు లెల్ల
శ్రావ్యగానంబుఁ జాలించె శకునతతులు;
అధికదుఃఖితయయ్యె నీయమృతభూమి
పరుషమాలిన్య ముఖియయ్యె బ్రకృతిమాత
క్షణములో సౌఖ్యమిట్లు దుఃఖముగ మారు
చిరము గాదేదియును పాడు ధరణియందు.

ద్వి తీ య దృ శ్య ము.

మీవారుప్రాంతమందు మహబ్బత్ఖాను
శిబిరము—ప్రభాతకాలము.

మహబత్ఖాను, పరభేజు మహారాజ్ గజసింహులు నిలువంబడి ప్రసంగించుచుందురు.

**మహాబత్**—(పరభేజు నుద్దేశించి) శాహాజాదా! విలంబ మాచరింపక బదివేల సైనికుల దోడ్కొని చిత్తూరుదుర్గమును ముట్టడింపుఁడు.

పరభేజు—సేనాధిపతీ! నీయుఁదల ననుసరించి నే నిదె చిత్తూరు బోవుచుంటిని. [నిష్క్రమించును.]

మహబత్—మహారాజ్జీ! ధ్వంసక్రియయందుఁ దాము సమర్థులు. దానంజేసి వైళంబ మీరు మీవారుజనపదము లన్నిఁటిని తగులఁ బెట్టుఁడు. శత్రువులు నిరోధించుచుచో శంకారహిత స్వాంతులరై, చిన్నపెద్దలని యోచింపక చంపుఁడు. కాని రమణుల కెట్టి యపాయముఁ గలుగఁకుండఁ జూడుఁడు. ఈవిషయమున నప్రమత్తులరై యుండుఁడు.

గజసింహ—సాహేబుజీ! మీపనుపు ననుసరించియే యాచరించెదను. మీవారునందు రసపుత్రపుః వొక్కటియైన మిగుల కుండఁ జేసెద!

మహబత్—దేవరకట్టి సామర్థ్యముఁ గలదనువిషయము నేనీవరకే గ్రహించుకొంటిని. రసపుత్రుల యన్యోన్యవిద్వేషమెంతయాంతరికమైనదో, ముసల్మానులకు రసపుత్రులపై గలవిద్వేషమంత యాంతరికమైనది గాదని నేనెఱుఁగక పోలేదు. స్వజాతీయులఁ బీడించుటచేఁ గలుఁగు నాహ్లాదము భారతీయులకు మఱొండు విధమునఁ గలుఁగదను విషయమును భారతవర్షపురాణేతిహాసములఁ జదివి బాగుగ గ్రహించితిని. మహారాజ్జీ! రసపుత్రజాత్యుచ్ఛేదమును మీవలె మఱియొకరు గావింపలేరు. అందుచే నీయుద్యోగమును మీకేయర్పించితిని. కనుక కృతకృత్యులరై పోయి రండు.

గజసింహ—మంచిదట్లే కావింతును.

(నిష్క్రమించును.)

మహబత్—రసపుత్రులారా! హిందువులారా! మీవారురాష్ట్రీయులారా! ఇది పరస్పరజాతి సంఘర్షణము గాదు—పరస్పరమత సంఘాతము! ఉభయమతస్థులలో నెవరు జయమొందెదరో జూచెదఁగాక! (నిష్క్రమించును.)

తృ తీ య దృ శ్య ము.

*ఉదయపుర మందలి రాజాంతఃపురము—రాత్రికాలము

(రాణా అమరసింహుఁడును, సత్యవతియుఁ బ్రసంగించు చుందురు)

రాణా—ఏమి! మహాబత్ఖాను యుద్ధమొనరింప వచ్చెనా?

సత్యవతి—అవును! నూరువేల మొగలాయీ లతని ననుగమించి యొక్క త్రుటిలో మీవారును కబళింప నువ్విళులూరు చున్నారు.

రాణా—(దీర్ఘనిశ్శ్వాసమును విడచి) సత్యవతీ! మొదటనే నేనువచించి యుండలేదా?

సత్యవతి—ఏమివచించితిరి?

రాణా—అంతయు నాశంబగునని. రసపుత్ర స్థానమంతయు స్వాతంత్ర విభవముఁ గోల్పోవ, కేవలమొక మీవారు శిరమెత్తి యుండ నేర్చునా? మీవారుకూడ గతింపవలెనని విధాతనియయముకాఁబోలు. లేకున్ననిట్టి యసాధ్య కరణమొనరింప నేలగమకింతుము. సత్యవతీ! మనమీవారుకడ తేరును. మనము కడ తేరుదుము! వీర రమణీ! మోమువంచు కొంటివేల? దుఃఖించుచుంటివా! ఇప్పట్టున మనము శోకింపరాదు. పరమహర్ష సంభరితస్వాంతులము గావలయును.

సత్యవతి—ప్రభూ! ఇదియానందింప వలసిన సమయమా?

రాణా—నిక్కముగ నట్లే? శయ్యనంటియుండి మీవారుమాత యెఁ కెంతకాలము మరణబాధఁ పడఁగలదు? అచిరంబులోనే జనయిత్రి తీవ్రవేదన తీరిపోగలదు. దానంజేసి చింతించుటకుమారు మనము ప్రహృష్టమానసులము గావలయును.

సత్య—ప్రభూ! అట్లగుచో మీరుకదనము సలుపరా?

రాణా—సలుపకేమి! నిక్కవముగ సలిపెదను. ఇంతకుముందు జరిగిన సమరములన్నియు శైశవక్రీడల మాడ్కి సలుపఁ బడియెను.

ఇపుడు జరుగఁ బోవుసంగ్రామమట్లుగాక విప్లవభూయిష్ఠమై మహా దానందదాయకమై యుండును. మహాబత్తా నరుదెంచినకతన, అన్నదమ్ముల పోరుసంభవించును. భారతవర్షమంతయు నయ్యపూర్వదృశ్యము నబ్బురంబున వీక్షింపఁగలదు!

సత్యవతి—మహాబత్తాను ననుసరించి, యోధపురయేలికయైన గజసింహుఁడు కూడ విచ్చేసెనని వింటిని.

రాణా—ఆనందమానందము! గజసింహా! మహానుభావా! మాతృవర్షవిధ్వంసనోత్సకుఁడవైననీవు శతవర్షంబులు ధన్యుఁడవైమనుము. అవిలంబముగ మదాహ్వానము స్వీకరించి నీయసమానౌదార్యము జూపితివి. ఈదీనుని యాహ్వానమును గ్రహింపకుండుటకు నాయెడల నీవంతగృపారహితుఁడవై యుండవని నేనెఱుఁగక పోలేదు.

సత్యవతి—గజసింహా! కులద్రోహీ! మాతృద్రోహీ!! భ్రాతృద్రోహీ!!!

రాణా—సత్యవతీ! అట్లనబోకుము! అతఁడు పరమభక్తుడు!—భాగవతోత్తముఁడు! మనమే—మీవారు క్షత్రవంశజులమైనమనమే కులద్రోహులము! యిన్నిదినములుగడచినను, గజసింహుఁడుపూజించువేలుపునొక్కమారైన మనము విశ్వసింపలేదు. "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా!" యని యీశ్వరసంస్తవముఁ గావింపలేదు! గజసింహా! ఏమిరా నీనామధేయము! గజంబవు సింహంబవుగూడ నైతివి! రణమందు తుండమును కేసరంబులనుగూడ నూగింతువా యేమి! ఏమిరా నీమహిమ!

సత్యవతి—గజసింహా! రసపుత్రకులోద్భవుఁడవయ్యు, పుత్రులతో రణముసలుకు నీవెట్లు సాహసించుచుంటివిరా?

రాణా—అట్లు సాహసింపనిచో నధ్వరనాశసంపూర్తి యెట్లుకాఁగలదు?

సందీభృంగులు మహాదేవుననుగమింపకుండుటెట్లగు!—శాస్త్రవచ
నంబు లసత్యములు కానేరవు.

సత్యవతి—హా! హతభాగ్యమీవార్! [నేత్రములమూసివైచును.

రాణి—సత్యవతీ! నీసంతానముచేతనే నీకు నాశనప్రాప్తి కలుఁగునని
విధాత సృష్టికాలమున నీభరతమాత లలాటమందు లిఖించెను.
తక్షశిలనుజ్ఞప్తికిఁ దెచ్చుకొనుము! జయచంద్రుని' స్మరింపుము!
శక్తసింహమానసింహుల మదిఁదలంపుము! ఇప్పట్టున విపక్ష
పక్షావలంబకులైన గజసింహ మహబ్బత్ఖానులఁబరికింపుము! విధా
తృలిఖితంబునకుఁ దగుతార్కాణములు గన్పట్టుచుండుటలేదా!
బ్రహ్మలిపి యక్షరమక్షరముగ జరిగితీరును! విధికృతమును దప్పింప
నేరితరము? సత్యవతీ! ఇఁకమనము కాలయాపన మొనరింపరాదు.
నీవరుగుము. నేసైన్యముల నాయత్తమొనరించెద.

[సత్యవతి నిష్క్రమించును.]

రాణా—జాతి యెల్లపుడు నిజదోషంబుననే నాశమొందును. ఆత్మగౌ
రవముఁగోల్పోయిన కొలంది జాతి, భీషణవ్యాధి పీడితమగును.
క్రమక్రమముగ నారోగము ప్రబలమై ప్రతికుటీరమందును, ప్రతిప్ర
దేశమందును ప్రసరించును.

(గోవిందసింహుఁడు ప్రవేశించును.)

రాణా—చిరమిత్రమా! రమ్ము! వార్తలేమి?

గోవింద—ప్రభూ! [illegible] మహబ్బత్ఖాను నిరీహగ్రామవాసుల
గృహములనన్నిఁటిని దహించు చున్నాఁడు.

రాణా—అట్లా! ఆమహాత్ముఁడుచితకార్యమునే సలుపుచుండెను.

గోవింద—స్వామీ! ఇదియుచితకార్య మెట్లగు! మేమిప్పుడపోయి
యాదురాత్మునకుఁ దగు విధంబున బుద్ధిచెప్పివచ్చెదము.

రాణా—అట్లే గోవిందుఁడు. అట్లొనర్పకున్న మీవాంఛధ్వంసపూర్తి

యెట్లగును ?

గోవింద—దేవర యవశ్యముగ యుద్ధమాచరించెదరా ?

రాణా—అవశ్యముగ నాచరించెదను. సందియ పడకుము. మనసైని కు లెందరుందురు ? అయిదువేలుందురుగదా ! చాలు ! యథేష్టముగ మరణింప నాసంఖ్యను మించిన సైనికులుండ నవసరము లేదు. మహాబత్ఖాను సైనికులు లక్షమంది యుందురుగదా. ఉండనిమ్ము ! ఎందరున్న నేమి !

గోవింద—ప్రభూ !—(తలవంచుకొనును.)

రాణా—గోవిందసింహా ! నీవుకూడఁదలనువంచుకొంటివేమి ! మిత్రమా ! అధైర్యపడకుము ! లెమ్ము ! మేల్కానుము ! నేడుమహోత్సవ దినము ! ప్రతి గృహమునందు మంగళవాద్యములు మ్రోగుగాక ! కాహళధ్వానములు భోరుకొనుగాక ! శంఖారవంబులు మిన్నుముట్టుగాక ! భేరీ నినదములెల్లెడల ప్రతిధ్వనించు గాక ! సౌధశిఖరముల రక్తధ్వజములెగురునుగాక ! గోవిందసింహా ! చింత మానుము. ఆలస్యమాచరింపకుము. ఉదయపుర దుర్గాగ్రమందు మీవారు రుధిరధ్వజమును నెలకొల్పుము. సర్వాంగసుందరియైన జనయిత్రిని విలోకింపుము. ఇట్టిభాగ్యము మరల దొరకుట యసంభవము !

గోవింద—స్వామీ ! ప్రాణములుండు నంతదనుక నిక్కముగ సంగ్రామము సలుపుదుము. అట్లొర్చినను, మాత నీమారు రక్షింపఁజాలమని వగచు చుంటిని.

రాణా—సుహృద్వరా ! మాతమరణించునని వగవనేల ? ఎవరితల్లి మరణింపకుండ నుండఁగలదు ? చిరంజీవియై యెవనితల్లియు మనియుండజాలదు. తల్లినిగలసి మనముకూడ మరణించుటకువ్విళులూరుచున్నతఱి, విచారించెదవేమి !

గోవింద—ప్రభూ! విచారింపను. సంగ్రామమొనరించెదను.

రాణా—వీరపురుషోచిత కార్యమదే! మిత్రరత్నమా! వీరస్వర్గమునఁ గలియుటకుఁ బూర్వమొకసారి నిన్ను బ్రణయంబున గ్రుచ్చి కవుంగిలించుకొననిమ్ము! రమ్ము! [కౌగలించుకొనును.] గోవిందా! ఇఁక వెడలుము.

[గోవిందసింహుఁడు నిష్క్రమించును.]

(రాణీ ప్రవేశించును.)

రాణా—ఎవరది? రాజ్ఞియా! సతీ! ఇఁక నీవుత్సవ మొనరింపుము. ఆలస్యమొనరింపకుము.

రాణి—ఉత్సవమెందులకు? మానసి వివాహమా?

రాణా—మానసి వివాహము కొఱకు గాదు—మేవారు—వివాహము కొఱకు!

రాణి—మే—వారు వివాహమేమి? (తనలో) మావారివెఱ్ఱి యంతకంతకెక్కుడగుచున్నది.

రాణా—ధ్వంసముతోఁ గూడ నీమారు మేవారునకు వివాహమగును!

రాణి—అల్లనుచుంటి రేమి?

రాణా—సతీ! అచిరంబులో నీవెంతయో వేడుకను వీక్షింపఁ గలవు. అన్నదమ్ముల పోరాటమందంతయునంతరించును. భ్రాతృభండన దృశ్య మద్భుతముగ నుండును. శీఘ్రముత్సవసన్నాహములఁ గావింపుము. (స్వగతమున) మేవారుకాంతా! రసపుత్రమాతా! వివాహమా! వినాశమా! ధ్వంసమా! అమరసింహా! ఛీ! ప్రియజనకా! రాజ్యలక్ష్మీ! ప్రతాపసింహా! లలాటమా! విధీ! పాపమా ప్రారబ్ధమా! జననీ! మేవార్! పతన—! హా! తల్లీ! తల్లీ!! తల్లీ!!! (నేలగూలును. తెరపడును.)

(కొంతసేపైనపిదప రాణి ప్రవేశించును.)

రాణి—అయ్యో! ఇదేమి కర్మము! రాజు పిచ్చివాఁడైపోయినాఁడు. ఇఁక రక్షించువా రెవరు! "యథారాజాతథాప్రజా" యను నట్లు జరుగునేమో! ఇఁక—

(మానసి ప్రవేశించును)

మానసి—జననీ! జనకుఁ డేలకో ప్రాంగణమునుండి గృహాభ్యంతరము నకును, గృహాభ్యంతరమునుండి ప్రాంగణములోనికిని పర్వులిడుచు, నేమేమో యుచ్చైస్స్వనమున బలుకుచున్నాఁడు. వచ్చిచూడుము అతఁ డట్లుండుటకు గారణమేమి?

రాణి—ఉన్మాదమే కారణము. రమ్ము! చూచిపత్తము!

(నిష్క్రమించును)

మానసి—(కొంచెముసేపు నిలచి)—ఉన్మాదమా! ద్రోహజనితోన్మాదమా! రసపుత్రకులమా! మహాబత్తానూ! నీవురసపుత్రుఁడవు కావా? గజసింహా! దురాత్మా! నీవు రాజపుత్రుఁడవేనా! ఓ ఈర్ష్యామూర్తులారా! ద్వేషస్వరూపులారా! ఇట్టిదురంతమునకుఁ దలపడితిరేమి! ఓరసపుత్రజాతీ! అధమజాతీ! పతనమునీకు గాకున్న మరెవ్వరికగును. వినాశము నీకుఁగాకున్న మఱెవ్వరికి? సోదరులే వివాదపడుచుండ—అన్నదమ్ములే పోరుచుండ, నిఁకనిన్నురక్షించు వారెవరు? పతనమే నిక్కువము! నాశమే నిక్కువము?! ధ్వంసమే నిక్కువము!!!

(నిష్క్రమించును)

చతుర్థదృశ్యము.

మీవారు నందొక గ్రామపథము—సాయంకాలము!

అరుణసింహుఁడును, సత్యవతియు కాలినడకను పోవుదురు.

సత్యవతి—నాయనా! అరుణా!

అరుణ—ఏమమ్మా!

సత్యవతి—తండ్రీ! నడుచుటకుఁ గష్టముగ నున్నదా?

అరుణ—అమ్మా! లేదు.

సత్యవతి—నేఁటికి మనమీపల్లెయందాగుదము.

అరుణ—అమ్మా! ఇచటనుండు టెందులకు?

సత్యవతి—మనకార్యమునకుఁ బల్లెటూరివారి సాయము వేఁడుదుము.

అరుణ—వారుతోడుపడకున్న, సంగ్రామము సలుపలేమా?

సత్యవతి—సంగ్రామమునకెట్టి ప్రతిఘటనము వాటిల్లదు. కాని మన శూరులందఱీవరకే మడిసిరి. దానంజేసి మనమిపుడును నూతనవీరుల సిద్ధపరచుకొన వలెను. పూజార్థము నూతనసన్నాహములఁ గావింపవలయును. సాయంకాలమై పోయెను. త్వరగా పోదమురమ్మా.

[ఉభయులు నిష్క్రమింతురు.]

(కతిపయగ్రామ వాసులు ప్రవేశింతురు)

కొండయ్య—ఏంటీ! యీకాలమహానం! యింతసక్కని రాజ్యం యీ మాటు నాశనం అయిపోతుంది!

సుబ్బయ్య—ఏంకేమవుతుంది! యీమహాబత్తుసాయీబు సాయంగా వచ్చాడు. మనకాలం మూడింది!

వెంకయ్య—చుబ్బయ్యబావా! ఆసాయిబు బాగా యిద్దం సెయ్యగలడంటోసి?

సుబ్బయ్య—యెంకయ్య బావగోరికేమీ తెలవదు. ఆ సాయీబుకి యిద్దం చెయ్యడంచేతవుతుందేంటి అని అడుగుతున్నాడు!

ఎరకయ్య—ఏమోయీ చుబ్బయ్యమామా! మాపెద్ద కబుర్లు సెప్తుతున్నావు! ఆ సాయీబు యిద్దం సెయ్యడం యెప్పుడు నేరుసుకున్నాడు! ఆడికి యిద్దమంటే యేంతెల్సును!—ఆడు నా కళ్ళ

ముందే పుట్టేడు.

సుబ్బయ్య—అందరి పుటకా యెవరో వొకరు సూస్తారు. పుట్టటం సూచానంటే ఆపుట్టినోళ్ళ కేమీ తెలవదని రుజువు చెయ్యడం వేంటీ? ఆ సూపే రుజువై పోతుందా?

ఎరకయ్య—చుబ్బయ్యమామా! నువ్వు గొప్ప తరకం సదికావు. నీ దగ్గిర మేము మాట్లాడగలమా? అవునా కాదా కొండయ్య తాతా?

కొండయ్య—అదిగో! చూడండి! చూడండి! మనూరంతా తగలడు తోంది!

అందఱు—ఏదీ! ఏదీ!

కొండయ్య—సూడండి—అదిగో పొగొస్తోంది!

ఎరకయ్య—కొండయ్యతాతా! నీకు పెద్ద సెముడు! అదేంటో తెలిసిందిగాదు నీకు. అది మేగం!

సుబ్బయ్య—మేగం బూమిలో నుంచి వస్తుందేంటీ! అది మేగంకాదు. కాపడటం లేదూ?—పొగ గుండ్రె గుండ్రంగా మెలిక లిరిగి పైకి పోతోంది! మేగమైతే అల్లా తిరుగుతుందేంటీ!

ఎరకయ్య—అల్లా అయితే అది దుమ్ము: గాలి దుమారం-పట్టింది!

సుబ్బయ్య—దుమ్ము నల్లగా వుంటుందేటీ?

ఎరకయ్య—చుబ్బయ్యమామా! నీతో వాదం చెయ్యలేము. నీవు గొప్పోడివి.

కొండయ్య—యిదిగో! యిదిగో! వూళ్ళోవాళ్ళు కేకలూ పెడబొబ్బలూ పెడుతున్నారు! యినపడ్డం లేదేంటీ! శత్వారం యేటీ!

అందఱు—ఏంటీ! ఏంటీ!

ఎరకయ్య—ఓ రెడ్డి పెద్దామ్మారులారా! అదేంటో తెల్సింది కాదూ. వూళ్ళో బాగోతం అవుతోంది కాఁబోలు! బాగోతపోళ్ళు పదం

ఆడుతున్నారు!—లేకపోతే గాడిదలు కూస్తూన్నాయనుకుంటాను.

వెంకయ్యా—ఇప్పుడది పదమంటావా, గాడిదకుయ్యాడం అంటావా?

ఎరకయ్యా—నాకేమీ యిడిపోవడం లేదు.

సుబ్బయ్యా—నాకు యిడిపోవటం లేదు. రెండురకాల సప్పుళ్ళు వొక మోస్తరుగా కనపడతాయి—యేవంటావు వెంకయ్యబావా!

వెంకయ్యా—సప్పుళ్ళు కనపడటం యేంటీ! సీతలకాయి కాకపోతే!

కొండయ్యా—ఇరుగో కొండఱు మనుష్యులు యేడుస్తూ యీ వైపు పరుగెత్తుకొస్తున్నారు.

వెంకయ్యా—ఎనకాల నుంచి తురకోళ్ళు గుండుదెబ్బలు కొడుతున్నారు.

సుబ్బయ్యా—తురకోళ్ళెవళ్ళూ?

వెంకయ్యా—గెడ్డపోళ్ళు!

నేపథ్యమున—చాయీబుగోరూ! రచ్చించండి! రచ్చించండి! పిల్లలుగలోళ్ళము! సంపకుండి! సంపకుండి!

కొండయ్యా—అయ్యో! పాపము!—యీబీదోళ్ళకి యెన్నితిప్పలొచ్చాయీ!

(అజయసింహుఁడును కళ్యాణియుఁ బ్రవేశింతురు)

అజయ—పల్లెవాసులారా! మీరేల యిట్లు నిల్చియే యుంటిరి! మీతోడి యూరివారలను రక్షింపుఁడు.

ఎరకయ్యా—బాబయ్యా! మేమేం సెయ్యగలమండే?

అజయ—ఊరక నిలువఁబడి వేడుకఁ జూచెదరా?

వెంకయ్యా—లేకపోతే సచ్చిపొమ్మంటావేంటెయ్యా? నడండ్రా పోదాం! యిల్లావస్తున్నారు!

కల్యాణి—మూఢాత్ములారా! పలాయన మొనరించి ప్రాణములఁ దక్కించుకొనఁగలమనుకొనుచుంటిరా! అట్లు తలవకుఁడు. ఎవరును మిగులరు. మీవంతుకూడ రాఁగలదు. మీయిండ్లు కూడ

దగ్ధములగును.

సుబ్బయ్య—అవి తెగలడినపుడు సూద్దాంలే! పేణం వున్నంతమట్టుకు సావటంయెందుకు? వూపిరివున్నంతచేపూ సావమన్నా సావము. బతికుంటే బల్సాచ్చకుతినొచ్చు. ఎంకయ్యాబావా! ఎరకయ్యమావా కొండయ్యతాతా! రంద్రా సూత్తారేంటి! యిరిగో! వోరినాయనో! వోలమ్మో! వొరిబాబో! వచ్చిపడ్డారు! పరిగెయి! పరిగెయి! పరిగెయి!

(కల్యాణీ అజయులుతక్క అందఱుఁ బలాయన మొనరింతురు)

అజయ—ఆర్తనాదము మనల సమీపించుచున్నది! అవిగో! తుపాకి శబ్దములు వినవచ్చుచున్నవి! కల్యాణీ! నీవాకించుక ప్రక్కగ నిలువంబడుము—నేనీ నిరుపేదల రక్షించెదను.

కల్యాణి—అన్నా! సాధ్యమగుచో వారలఁ గాపాడుము.

(కొంచెము దూరమరుగును.)

అజయ—సోదరీ! ఆయభాగ్యుల రక్షింపఁగలుగుదునో లేనో చెప్పఁజాలను. కాని వారలకొఱకై ప్రాణముల విడువఁగలను. మానసి కడ నుపదేశమొందిన మహామంత్రమును, నేఁడు నేను పఠించి తత్సాధనోద్యోగము సలిపెదను. చూడుము! వారలీదిక్కుగనే వచ్చుచున్నారు.

(ఇట్లుపలికి అజయసింహుఁ డొరనుండి తరవారిని వెలికిదీసెను)

గ్రామవాసులు (రొజుచు బరువెత్తుకునివచ్చి)—రక్షింపుఁడు! రక్షింపుఁడు (అజయుని పదతలమున బడిరి.)

అజయ—(వెన్నుదరిమివచ్చు మొగలుసైనికుల నుద్దేశించి)—అరే! నిలువుఁడు! నిలువుఁడు! లేకున్నఁ జచ్చెదరు!

ఒకసైనికుఁడు—అరే! నోరుమూయుము? గాడిదీ!

(అని కత్తిఝళిపించును)

[అతఁ డట్లొనరించుచుండగనే అజయసింహుఁ డొక్క వ్రేటున వానిని నేలపైఁ గూలనేసెను.]

తక్కిన సైనికులు—అరే! చంపుఁడు! చంపుఁడు! కాఫరును నరుకుఁడు పొడువుఁడు! కాల్చుఁడు!

మొగలు సైనికులంద అజయుని ముట్టడించిరి. అజయుఁడు ఘోరసంగ్రామము సలుపుచు, సైనికులనొక్కరొక్కరిని నేలగూల్చును. వెంటనే మఱొండు సేనాదళ మచటకు బరువునవచ్చి యజయసింహునిచుట్టు ముట్టుదురు. అతడా నూతన దళమునుగూడ దునుమాడ దొడంగెను. కాని తురకలెట్లో అజయుని కరవాలమును భూమిపైగూలనేసి వానిపైఁబడిరి.]

అజయ—సోదరీ! ఇఁక ప్రాణములు నిలుచుట సున్న. పరువిడిపోయి ప్రాణరక్షణమాచరించుకొనుము.

కల్యాణి—(కాతరస్వరమున) అన్నా! నీవీరక్కసులకుఁ బ్రాణముల నర్పించుచుండ నేఁబలాయన మొనరింపనా? [అనిపలికి ఆరసపుత్రరమణి సైనికులపైలంఘింప గమకించును. అయ్యవసరమందే మొగలు సైనికుని తుపాకి దెబ్బచే నజయసింహుఁడు వసుంధర పైఁగూలును.]

కల్యాణి—అన్నా! అన్నా!! (అని అజయుపైబడును)

సైనికుఁడొకఁడు—ఈమె యెవతె? అరే! యీఆడవాడినిపట్టుకొండి.

మఱొండుసైనికుఁడు—[illegible]! అరే! అదికూడదు! ఆడామనిషిని పట్టుకోవద్దాని మనసేనానిపతి చెప్పేడు.

అజయ—(దీర్ఘబాహులఁ గల్యాణి గళమునకుఁ జుట్టివైచి) చెల్లీ! నిన్ను విడిచిపోవుచుంటిని!—విలపింపకుము! సర్వేశుఁడు నిన్ను రక్షించుగాక!

[ప్రాణముల విడచును.]

కల్యాణి—(అన్న మృత దేహము పైబడి) అన్నా! ఎందరిగితివి? నన్ను గూడ

దోడ్కొనిపోవేమి? వెంటగొనివచ్చి, నిన్నీరక్కసుల పాల్గావించితినా! అన్నా! మాటలాడవేమి? నీసోదరినిజూడవేమి? ఇంతలో నీరవుఁడవైతివేమి? అయ్యో! ఎంత బిలచినను మాటాడవేమి? అన్నా! నీచెల్లిపైఁ జాలిలేదా? భర్తృపరిత్యక్తయైన యీ యభాగిని మరణింపక నీవు మరణించితివేమి? నన్ననుగమింపకున్న నీకిట్టి యకాలమృత్యువు ప్రాప్తింపదుగదా! నావంటి పాపినిమఱొకతె గలదా? అన్నా! ఒకసారి కన్నులు తెఱచి నీచెల్లి నూరడింపుము! అయ్యో! నిముసంబులో నెగిరిపోతివా! అన్నా! ఇఁక నన్నుబలుకరింపవా! అయ్యో! అన్నా! అయ్యో! అయ్యో! ! అన్నా! అన్నా!!

సైనికుడు — బేటీ! (పిల్లా!) ఎందుకేడుస్తావు. ఎప్పటికైనా మనకు యిదే గతి.

ల్యాణి — ఇఁక నేను శోకింపను! క్షత్రశూరా! వీరోచిత కార్యము సలిపితివి! ఆర్తరక్షణదక్షుండవై యుసురులఁ బాసితివి! అజయసింహా! నీకీర్తిచంద్రికలు దిగంతములందుఁ బ్రసరించుగాక! (సైనికుల నుద్దేశించి) అరే దురాత్ములారా! యమదూతలారా! హంతకులారా! రక్తలోలుపఘాతుకశ్వానములారా! నిర్దోషుల గృహములదగ్ధ మొనరించుచు, యౌవనుల ఖండించుచు, వృద్ధుల బొదుచుచు, పసిబాలలజంపి యాకసమున కెగురవైచుచు, అడ్డుపడినవారలనెల్ల నగ్నిజ్వాలలఁ ద్రోయుచు యుక్కుమిగిలి రక్కసులై చెలరేగుచుండిరి! మృత్యువుగూడమిమ్ముభయపెట్టలేదు. పలువురుగూడి, భీరులభంగి శూరుడైన నాసోదరుని జంపితిరి! నేఁగూడ నాయన్న ననుగమించెద! కానిచో మిమ్మెన వానికడ కంపెద! దుర్మతులారా! కాచుకొనుఁడు! రసపుత్రరమణి రణంబునకు వెలువడు! చూడుఁడు! మిమ్మిదె కృతాంత మందిరమున కంపుచుంటి (అని క్రోధ విస్ఫులింగముల వెదజల్లుచు, చండత

రోగ్రియై, అన్నగారి శవముప్రక్కనున్న కత్తినిఁగైకొని సైనికులపై బడి వారలనందఱ జంపసాగును. ఇంతలో మఱికొందఱు సైనికు లచటి కరుదెంచి, యామెను విలోకించి భయకంపితులై కత్తులు నేలబడవైచి నిలుతురు.)

సైనికులు—"బీబీ! శాంతింపుము! శాంతింపుము!! మాదోసమొ వంతయైనలేదు! సేనాధిపతి పనుపున నీకృత్యములఁ గావించు చుంటిమి"

కల్యాణి—(సైనికులఁదేఱిజూచి) మీసేనాధిపతి యెవఁడు?

సైనికుడు—బీబీ! మా సేనాధిపతి యెవరో యెఱుగవా?

కల్యాణి—ఎవఁడు!

సైనికుడు—మహాబత్ఖాను సాహేబు.

కల్యాణి—(అబ్బురమును సూచించుచు)—ఏమి! మీసేనాధిపతి మహబత్ఖానా! ఇట్టిఘాతుక కృత్యముల నతని యానతిచేఁగావించు చుంటిరా? అట్లని నేననుకొనను! ఇట్టియాజ్ఞ నతఁడొసంగఁడు అసంభవ మసంభవము!! (కత్తి విడచును.)

సైనికుడు—బీబీ! అసంభవముకాదు.

మఱొకసైనికుఁడు—ఈమెతో మనకేమిపని. నడవండి! నడండి!

కల్యాణి—సైనికులారా! నిలువుఁడు! నిలువుఁడు! నేఁగూడ మీతో వచ్చెదను.

ఇంకొకసైనికుడు—అమ్మతల్లీ! మమ్మింకను విడిచి పెట్టవా యేమి

కల్యాణి—భయమేల! నన్నుకూడ మీవెంటఁ దోడ్కొని పొండు

ప్రథమసైనికుఁడు—ఎక్కడకు తీసుకొని పొమ్మంటావు?

కల్యాణి—మీసేనాధిపతి కడకు.

ప్రథమసైనికుడు—నిన్నుగొంపోయిన మాకు—

ద్వితీయసైనికుఁడు—అవునవును! మనపని అవుతుంది. యీ అమ్మన

యిక్కడే దిగబెట్టడము మంచిది.

తీయసైనికుఁడు—మనకేమిభయము ! ఆమె స్వయముగా వచ్చే టప్పుడు రానీయండి.

థమసైనికుఁడు—సరే ! రానీయండి. అల్లాఅయితే నన్ను మీదగ్గి అగా నడవనియ్యండి !

తృతీయసైనికుఁడు—బీబీ ! నడువుము.

ల్యాణి—నడువుఁడు.

పంచమదృశ్యము

ఉదయపురరాజసభ—ప్రభాతకాలము.

రాణాఅమరసింహుఁడును, గోవిందసింహుఁడును సామంత గణంబులును, ఉపవిష్టులై యుందురు.

ఘువరుఁడు—ప్రభూ ! సాధ్యమైనంతవరకు సంగ్రామము సలిపితిమి. ఇఁక సమరమునలుపుట సాధ్యముకాదు.

ాణా—రఘువరా ! అట్లనబోకుము. సాధ్యముకాకేమి ? యుద్ధము చాలించుటకు నేనిష్టపడను. రణముసేయవలయును. సైనికుల సిద్ధ పఱుపుఁడు.

శవరావు—సైనికులుమాత్ర మెందఱుందురు ? మీవారు రాష్ట్రము నంతయు గలగొట్టినను, అయిదువేలసైనికులనైన జేర్చుట దుర్ఘ టము ! స్వల్పసంఖ్యాకులమగు మనము నేలయీనినట్లు వచ్చు మొగలుశూరులతోఁ బోరగలమనుట గలలోనివార్త. అయిదువేల రసపుత్రులెక్కడ ! నూఱువేల మొగలాయీ లెక్కడ !

ాణా—కేశవా ! నాయైదువేల సైనికులైదులక్షల మొగలులతో సములు !

జయసింహుఁడు—ప్రభూ! ఇపుడు మొగలాయీలతో సంధిగావిం
చుటే యుత్తమము.

రాణా—నేనట్లొనరించుటకియ్యకొనను. సంధిఁగావింపఁ దలఁచినపుడు
మీరలెవ్వరును నాపలుకుల నాలింపలేదు. మొగలాయీలపుడు
మనపొందు నపేక్షించిరి. ఆతరుణము గడచిపోయెను. మొగలు
కడకు సంధిభిక్షార్థినై నేనిపుడు బోఁజాలను.

కేశవ—కాని—

రాణా—కేశవా! ఇఁకనేమియుఁ బలుకకుము. వేరుమార్గములేదు
ప్రాణముల సర్పింపవలయును! ఏమనెదవు గోవిందసింహా!

గోవింద—ప్రభూ! మేము ప్రాణములనే యర్పించెదము! మానము
నర్పింపము!

రాణా—గోవిందసింహా! యుక్తము వచించితివి. అసువుల విడుతుము
గాని యవమానమును పొందము.

రఘువరుఁడు—మహారాణా!—

రాణా—రఘువరా! నిరర్థకప్రయత్నములఁ గావింపకుము. నీప్రార్థన
మును నే వినసిచ్ఛగింపను. యుద్ధము జరుగవలయును. ముమ్మా
టికి యుద్ధముజరుగవలయును. దీర్ఘాలోచనతో, పెద్ద యుపన్యాస
ములతో, గాలహరణ మాచరింపకుఁడు. సమరసన్నాహంబుల
గావింపుఁడు! మీవారు రక్తధ్వజమును నిల్పుఁడు! రణభేరీల మ్రో
గింపుఁడు! పొండు! సంసిద్ధులు కండు!

[అమరసింహుఁడు తక్క దక్కిన వారందఱు సభాస్థలమునుండి
నిష్క్రమింతురు. శూన్య దృక్కులగగనంబుపై సారించి
"మీవార్! సుందరమీవార్! జననీ! నేఁడేల నీవిట్లసమాన
సుందరరూపమును దాల్చితివి? నీవిట్లు సర్వాంగ సుందరివై
యుండుటెన్నఁడును నే గాంచియుండలేదు. మాతా! నీనైధనతా

మమ్మెల్ల నదృశ్యస్థలమునకుఁ దీసికొని పోవుచున్నది. జనయిత్రీ! భిన్నవసనా! ధూళిధూసరితా! ఆలోలవేణీభరా! ఇదేమి యపూర్వ లావణ్యము తల్లీ! ఇన్నాళ్ళకు నిన్ను గుర్తింపఁగలిగితిని, సౌభాగ్యసూర్యుఁడింతకు పూర్వము నిన్ను భాసమాన నొనరించి యిపు డస్తమించుచున్నాఁడు. దానంజేసియే భవదంబర సీమనేఁ డపూర్వాగణ్యాద్భుతాలోకమున నుద్భాసితంబగుచున్నది.!—ఆహా! ఈజ్యోతి యెంత యద్భుతముగనున్నది! ఏమి యీభిన్నభిన్నరాగరేఖా విలసితాకాశ సౌందర్యము! ఏమి యీజగచ్ఛోభ!! ఏమి యీనీరవమహిమము!!!

[తెరపడును.]

## షష్ఠదృశ్యము

### మహాబత్ఖానుశిబిరము—ప్రభాతకాలము

మహాబత్ఖాను, మహారాజ్ గజసింహులిరువురు నిలువంబడియుందురు.

గజసింహ—సాహెబుజీ! సైన్యసమేతముగా రాణాసమరాంగణమున కరుదెంచెనా?

మహాబత్—మహారాజ్జీ! వచ్చెను. కాని యతఁడొకఁడు మాత్రమే యింటికిఁ జనియెను. అతని యైదువేల సైనికులలో నాలుఁగువేల సైనికులు రణరంగమున హతులైరి.

గజసింహ—అయిదువేల సైనికులను వెంట నిడుకొని యతఁడునూఱువేల సైనికులతోఁ బోరవచ్చెనా! ఆహా! ఏమివానిసాహసము!

మహాబత్—అద్భుతసాహసము! సందియ మిసుమంతయైన లేదు! మహారాజ్జీ! నిశ్చయముగ నేఁడు నేను మిగుల గర్వపడుచున్నాను.

గజసింహ—విజయానంతరము గర్వపడు టుచితమే.

మహాబత్—మహారాజ్జీ! నేనెందులకు గర్వపడుచుంటినో మీరు తెలిసికొన లేక పోతిరి.

గజసింహ—ఎందులకో దెలుపుడు.

మహాబత్—మతమున నేను మునల్మానునైనను, జాతియందు రసపుత్రుఁడనని గర్వించుచుంటిని. శూరుఁడైన యమరసింహుని సోదరుఁడనని సంతోషించు చుంటిని. అయిదువేల సైనికులను వెంటబెట్టుకొని మనయపార సేనాసమూహముతో సమరము సలుప వచ్చిన శూరాగ్రేసరుని మఱొకని మనమెచ్చటను జూడము. చూడలేము. ఎవ్వరును, ఎప్పుడును జూడఁజాలరు. అట్టిశూరుఁడు రణక్షేత్రమునఁ బ్రాణముల విడచుటకే వచ్చును! ఇట్టి ధీరత— ఇట్టి స్వదేశభక్తి—ఇట్టి స్వార్థత్యాగము!—ఇట్టి యాత్మోత్సర్గము! భారత వర్షమందొక రసపుత్రులకే గలదు. నేనట్టి రాజపుత్ర వంశమం దుద్భవించితినని గర్వమొందుచుంటిని!

గజసింహ—పరాక్రమశాలీ! మీరు వచించినది నిక్కువమే!

మహాబత్—మహారాజ్జీ! పతితులయ్యు మీరును రసపుత్రులే! నావలె మీరుకూడ గర్వింపవలయును. రసపుత్రజాతియందు పుట్టితినని గర్వపడుటయేగాక విక్రమశాలులగు మీరేమి కాదగినవారేమై తిరో తలఁచుకొని సిగ్గున దలవంచుకొనుఁడు. నావిషయము వేరు! ఎట్లైనను నేను రాజపుత్రనామమును బరిత్యజించితిని. అందుచేఁ గుత్సిత రసపుత్రునివలెఁ గన్పట్టును. గుణాగుణములెట్లున్నను వేష భాషలందు, నామధేయమునందు మీకేమార్పును గలుగలేదు.

గజసింహ—సాహేబుజీ! యుద్ధమునం దోడిపోయిన రాణా బంధింపఁ బడ లేదా?

మహాబత్—లేదు. అతనిని బంధించుటగాని వధించుటగాని నా యభిమతముగాదు. దానం జేసియే రాణా శరీరమును స్పృశింప

నైన స్పృశింపరాదని నాసైనికుల కాదేశమొసంగితిని. ఇట్టి క్షాత్ర వులు తమకీర్తి చంద్రికలచేఁ బృథివినంతయుఁ బ్రకాశింపఁజేసెదరు. వారి కతన జగంబంతయు మహిమాస్పదమైపోవును. అట్టిమహిమకు నేఁ గళంకమును దేఁ జాలను. అమరసింహునిగాంచిన నా హృదయముకూడ నీరగుచున్నది. !

గజసింహ.—సేనాపతీ! నేనిఁక వెడలి పోయెదను.

మహబత్.—మహారాజ్ఞీ! నడువుఁడు.

[గజసింహుఁడు నిష్క్రమించును.]

[దూరమునుండి తగులఁబడుచున్న గ్రామములు గనబడుచుండును. పల్లెవాసుల హాహాకారధ్వనులు వినవచ్చుచుండును.]

మహబత్.—హిందువులారా! మీరు, మీధర్మముకూడ, ఈజాజ్జ్వల్యమానాగ్ని శిఖావిస్ఫులింగరాసులందు దగ్ధముకండు! మీదంభము! మీవిద్వేషము! మీస్పర్థ! మీఅహంకారము, నేఁటితో నశింపక తీరదు! మీ— [అర్థోక్తిలో]

(సైనికుల ననుసరించి కల్యాణి ప్రవేశించును.)

మహబత్.—ఈమె యెవరు!

ప్రథమసైనికుఁడు.—జనాబ్! ఎవరో యెఱుఁగము. దారిలో జూచితిమి—తనంతటఁదానే యీామె మావెంట వచ్చినది.

మహబత్.—అమ్మా! మీరెవరు?

కల్యాణి.—మొగలాయీ సేనాపతీ! నే నెవర్తుకనో తెలిసికొని లాభము లేదు.

మహబత్.—మీ రిచటకేల వచ్చితిరి?

కల్యాణి.—మీ విచారణ కొరకు.

మహబత్.—విచారణ మేవిషయమున?

కల్యాణి.—మీసైనికులు నిర్దోషియైన నాసోదరుని హత్యఁగావించిరి.

మహాబత్—ఏమి! మీసోదరుని హత్య గావించిరా! సైనికులారా. మీ రట్టి ఘాతుక కృత్యమేల చేసితిరి?

ద్వితీయసైనికుఁడు—ఖోదాబన్ద్! (స్వామీ!) ఈమె సోదరుని హత్యఁ గావించినది మేము కాము. కొందఱు భవదాజ్ఞానుసారముగ గ్రామవాసుల వధింపుచుండ, నీమె సోదరుఁ డా బీదల పక్షము నవలంబించి మన సైనికుల ననేకులఁ దునిమి తుదకు తానుగూడఁ బ్రాణముల విడచెను. పిమ్మట నీమె మహాశక్తివలె కత్తిని బట్టి తన యన్నగారిని జంపిన వారిని జంపివైచినది.

మహాబత్—శహబాస్! శహబాస్!! రమణీమణీ! మీపరాక్రమము శ్లాఘనీయమైనది. మీసోదరుఁడు యుద్ధమున మడిసెను!

కల్యాణి—అవును.

మహాబత్—దేవీ! నాసైనికుల దోస మావంతయైన లేదు. నా యానతిచే వారలట్లొనరించిరి—సైనికులారా! మీరిఁక వెడలిపొండు.

[సైనికులు నిష్క్రమింతురు.]

కల్యాణి—నిరీహగ్రామవాసుల వధింప మీరానతిచ్చిరా?

మహాబత్—అవును! నేనట్లానతిచ్చితిని.

కల్యాణి—ఇండ్లను గాల్చివైచుటకుగూడ సెలవిచ్చితిరా?

మహాబత్—అవును—

కల్యాణి—నేను విశ్వసింపఁజాలను. మీరిట్టి క్రూరులు గానేరరు.

మహాబత్—దేవీ! నావిషయమై మీకట్టి యుదారాభిప్రాయ మెట్లు కలిగినది?

కల్యాణి—నాహృదయేశుఁ డిట్టి దురాత్ముఁడు కాఁజాలఁడు!

మహాబత్—ఏమీ! హృదయేశుఁడా!

కల్యాణి—అవును! నాహృదయేశుఁడే! బాగుగ నావైపుచూడుఁడు,

నన్ను మీరు గుర్తింపలేరా! మీయెదుర నిలిచియున్న యీ మందభాగ్యురాలు, ఈకల్యాణి-మీరువిడిచిపెట్టినమీహిందూపత్ని.

మహబత్—కల్యాణీ! ప్రేయసీ! ప్రేయసీ! అటులైన నాసైనికులు నీసోదరుఁడైన యజయసింహుని వధించిరా?

కల్యాణి—అవును. సతికుండవలసిన పతిప్రేమయే ధ్రువతారగాఁదలంచి ఏదినమున నేను మీసన్నిధింజేర, నాజీవననౌకను, ఈయపార సంసారాంబుధియందు విడచితినో, యానాఁడే నాసోదరుఁడైన యజయసింహుఁడు, నాకు రక్షకుఁడై, నాసహయాత్రికుఁడై సంతోషముతో నా వెంటవచ్చెను. మార్గమధ్యమున భవదనుచరులైన ముసల్మాను హంతకులు కొందఱు నన్నుఁ జంపయత్నింప గంధ సింధురబృందంబుపై నుఱుకు సింహడింభకంబువలె, నాయన్న యవార్యశౌర్యంబున దస్యులఁ దునిమి నన్ను బ్రదికించెను. దస్యులతోఁ బోరుతఱి నాసోదరుని శరీరమునఁ బెద్ద గాయమయ్యెను. దానంజేసి యచ్చోటనున్న పాడువడ్డ కుటీరమందుండి, యూరూర బిచ్చమెత్తుకొనుచు, నాయన్నకు సేవఁజేయుచు నెట్లో బ్రదికించుకొంటిని. కాని యిప్పు డాయన్నను, కఠినాత్ములై మీరు బ్రమింగి వైచితిరి. ప్రభూ! ఇఁక నేను మాత్రము బ్రదుకు టెందులకు? ఆలసింపక నాశిరమునుగూడ మీకరవాలమున కెరఁజేయుఁడు.

మహబత్—కల్యాణీ! నన్ను క్షమింపుము.

కల్యాణి—గృహదహన నరహత్యలు మొదలైన ఘోరకార్యములు మీవలననే జరిగెనా?

మహబత్—ఆపనులన్నియు నాయాజ్ఞచే జరిగినవి. రసపుత్రజాత్యుచ్ఛేద మొనరింపుఁడని నేను నాసైనికుల కాజ్ఞయిచ్చితిని.

కల్యాణి—(నింగిని విలోకించి, శోకార్తయై)—హే భగవాన్! ఇదేమి గతి! ఇదేమి ఘోరము! అయ్యో! ఏమి యీభయానకమైన

యాజ్ఞ! నాయారాధ్యదేవత యితఁడేనా! ఈహంతకుని నామాక్షరములే నాకు మంత్రాక్షరములయ్యెనా! అహర్నిశ మీ క్రూరునే సంస్మరించి నేసన్యాసిని నైతినా! సర్వేశా! నన్నుఁ జంపివేయవేమి? అయ్యో! ఒక్కమాటుగా నేను, సోదరుని, భర్తనుగూడ గోల్పోయితినా! అయ్యో నే బ్రదుకుటెందులకు! మొగలు రక్కసులారా! నా హృదయమును జీల్చివేయరేమి? ఆకాశమా! విఱిగి నాపైఁ బడవేమి? వజ్రమా! నాశీర్షమును వేయివ్రక్కలు సేయవేమి? అయ్యో! కల్యాణీ! ఎంత యభాగ్యురాలవే! అయ్యో! అన్నా! రసపుత్రా! అన్నా! అయ్యో!! అయ్యో!!! [ముఖమును మూసికొనును.]

మహబత్—కల్యాణీ! ఎఱుఁగవా నేనెందులకు—

కల్యాణి—ప్రభూ! నాకేమియుఁ దెలియనక్కరలేదు. నామోహస్వప్నంబులన్నియు భగ్నములై పోయినవి! నాయాసలన్నియు వ్యర్థములై పోయినవి. తేజోధనులని విశ్వసించి ఏకాంతముగ హృదయమున మిమ్ముఁ బూజించుచు, కష్టముల లెక్కసేయక నేనింతదనుకఁ బ్రమోదమున గాలముఁ బుచ్చితిని. ఇపుడు కన్నులఁ దెఱచి సర్వంబును తెలిసికొంటిని. మీరు పరమశత్రువులని యెఱింగితిని. మొగలులకన్న మిమ్మే యిప్పుడు ఘోరశత్రువులుగఁ దలఁచుచుంటిని. మొగలాయీలతో నాకుగాని నాజననియైన రాజస్థానమునకుగాని యెట్టిసంబంధములేదు. కాఫరుల వధింపుఁడని వారి మతము వారికి బోధించును! వారిమత ప్రబోధములతో మాకెట్టి జోక్యములేదు; కాని మీరు ముసల్మానులై జన్మింపలేదు—పవిత్రరాజస్థాన క్షేత్రమం దుద్భవించితిరి. మీజీవనాళములందు విశుద్ధ రసపుత్రరుధిరము ప్రవహించుచున్నది. తుచ్ఛైశ్వర్య లోభమున, విద్వేషకాంక్షచే స్వజాతిని ధ్వంసమొనర్చుటకు, స్వభ్రాతృరక్త

మును ద్రావుటకు నువ్విళులూరుచుంటిరి. మ్లేచ్ఛభృత్యులైన మీరు మ్లేచ్ఛులతలఁ దాఁటిపోయితిరి. మొగలులకోరిక మీవారు రాజ్యమాక్రమించుటయే—ఈ పేదమనుజుల హింసింప వారలు వాంఛింపలేదు. వారలెన్నఁడుగృహదహనోద్యుక్తులుగాలేదువారల లోటులన్నియుఁ దాము తీర్చివైచి, మీహింసావైదుష్యమును జూపితిరి! జాత్యభిమానమునేగాక, దామాత్మగౌరవముఁ గూడ ధ్వంసమొనరించి, మనస్సున సంకోచింపక—ముసల్మానుల మతోచ్ఛిష్టమును మెక్కి- కృతాంతభృత్యులఁబోలు నీమాంసాలోలకఠిననరశునకములను—నిరుపేదలైన జానపదులపై విడచితిరి! భూలోకస్వర్గమైన మీవారును శ్మశానముగ మార్చివైచితిరి! ఆర్త నాదములతో దేశమును బ్రతిధ్వనింపజేసితిరి. హాహాకారములతో రోదసీకుహరమును నింపితిరి. ఇట్టి ఘాతుకకృత్యములఁ గావింప మొగలు లిచ్ఛగింపలేదు. ఓభగవానుఁడా! ఇట్టి దురాత్ముల దండింప సరియైన యాయుధము నీకడలేదా? వీరల నెట్లు శిక్షింపవలయునో యెఱుఁగకుంటివా? వీరిపై పిడుగులఁ గురిపింపక యిప్పుడు గూడ నూరకుండెదవేమి? శిలావర్షంబుచే నీహంతకుల నంత మొందింపవేమి?

మహబత్—కల్యాణీ! నేనీకార్యమునకుఁ దలయొగ్గుట నీకొఱకే!

కల్యాణి—నాకొఱకా! అది వట్టిమిథ్య!

మహబత్—కల్యాణీ! మిథ్యకాదు. ముసల్మానులపైఁ గల విద్వేషంబుచే నీజనకుఁడు కృపారహితాత్ముఁడై నిన్నిల్లు వెడలఁగొట్టెనని యేముహూర్తమందు వింటినో, యాముహూర్తమందే మీవారును విధ్వంసమొనర్ప నేనస్త్రధారణ మొనరించితిని.

కల్యా—అటులగుచో దానేధర్మము ననుసరించి యొక్కని యపరాధమునుబట్టి యొక జాతినంతయు నాశన మొనరింపఁ గడంగితిరి?

మహబత్—కల్యాణీ! అందాశ్చర్య మేమున్నది? ఒక్క రావణుని మూలమున లంకయంతయు ధ్వంసముగాలేదా! మునల్మానులకు విద్వేషులై యున్నవారు హిందువులలోఁ బెక్కండ్రు గలరు—నీ జనకుఁ డొకఁడేకాదు. మునల్మానులపై హిందువులకుఁగల ద్వేష మెట్టిదియో నీతండ్రి తెలియఁబఱచెను. ఇట్టి ద్వేషంబునకుఁ దగు రీతి ప్రతిహింసగావింప నేను బద్ధకంకణుఁడ నైతిని. నాయుద్దేశ్య మదేయని యెఱుగుము.

కల్యాణి—తుచ్ఛమ్లేచ్ఛభృత్యా! అట్టి ప్రతిహింసఁగావింపఁ మునల్మానులై జన్మించినవారేకాని మఱెవ్వరు సిద్ధపడఁగూడదు. హిందువులకు మునల్మానులపై విద్వేషముండుటకు గారణము లేకపోలేదు. అట్టివిద్వేషమునెరింగియే, తమ సనాతనహిందూమతమునుత్యజించి అన్యులైన మ్లేచ్ఛులమతమును మీరు స్వీకరించితిరి! మీప్రస్తుతావస్థను మీరే సృష్టించుకొంటిరి. ఏదియో యొక యన్యాయమునకుఁ బ్రతీకారముఁ గావించుచుంటినని వృథా యత్నంబులతో, చిత్తపరిబోధ మేల గావించుకొనెదరు? మీలోని మునల్మాను ధర్మమే, హింసాపరత్వమునకు మిమ్ముఁ బురికొల్పుటలేదు. మీ యందున్న గర్విష్టమైన మహబత్ఖానే ఇప్పగిది ప్రతిహింసఁగావింప మిమ్ముత్సహించుచున్నాఁడు.

మహబత్—(అర్ధస్వగతమున) ఏమీ!—సత్యమేనా!— అట్లే కావచ్చును!

ల్యాణి—మీరావ్యక్తి గత విద్వేషంబున మీవారురాజ్యము నెడారుగావింప బయల్వెడలితిరి! విధ్వంసపిశాచిని విచ్చలవిడిగా వదలివైచితిరి. ఇదియేనా మీమతజ్ఞానము! ఇది యేనా మీ ధర్మము! ఇదియేనా మీశౌర్యము! ఇదియేనా మీ మనుష్యత్వము!—హా! భగవాన్! ఇదేమిదురంతము!—ఆహా! ఏమి యీ

దౌర్జన్యము ! ఇన్నాళ్ళనుండియు నేనాకాశసౌధములఁ గట్టుకొనుచుంటిని. ఇప్పు డాభవనములన్నియు నేలఁగూలిపోయి ధూళిలోఁ బొరలాడుచున్నవి.

మహబత్—(నిర్విణ్ణుఁడై)—చూడు కల్యాణీ !—

కల్యాణి—(దుఃఖావేగమున) ఇఁకఁ గల్యాణి యెందులకు ? అయ్యో ! ఏమి యీవినాశము ! ఏమి యీవిపరీతము ! సర్వేశా ? ఇఁక నే మున్నది ! నాయనురాగమంతయు మంటగలసినది ! నాప్రేమ స్వప్నంబులన్నియు భగ్నంబులైనవి. మ్లేచ్ఛభృత్యా! పరిచయంబు వలన మీకు నేను భార్యనైతిని. మన యిరువురకు వియోగము గలిగింప నెవరితరమని గర్వముతోఁ బలికెడిదానను. కాని యిప్పట్టున మన యుభయులనడుమ మహార్ణవమువంటి వ్యవధానము గన్పట్టుచున్నది ! నేఁదలఁచినట్లుగాక వేరుగతి మీరిప్పుడు నాకంటికిఁ గన్పట్టుచున్నారు. మొగలుభృత్యుఁడా ! నీపరిసరమున నాయనుజుని మృతదేహము పడియున్నది. అంతేగాక సోదరులైన స్వదేశీయుల శిథిలశరీరములనుండి బయలువెడలిన రుధిరస్రవంతి నీప్రక్కనే పొంగి పొరలిప్రవహించుచు గభీరమైన నరకకూపమునకు నిన్నుగూడ లాగుకొనిపోవ యత్నించుచున్నది. స్వర్గమునుండి యదిగో ! నాసోదరుఁడు శాపవృష్టి గురిపించుచున్నాఁడు. ఇఁక నా హృదయావేగము సరిగట్టనేరను! మహబత్ ! దుర్మతీ! దురాత్మా! కులద్రోహీ ! ధర్మద్రోహీ ! భ్రాతృద్రోహీ ! మాతృద్రోహీ ! రక్తపిపాసూ ! మనుష్యహంతకా ! పయోముఖవిషకుంభమా ! ఏమి నీదారాత్మ్యము ! ఏమి నీదౌర్జన్యము ! ఏమి నీదౌష్ట్యము ! ఆహా ! నాదౌర్భాగ్యము ! విశ్వేశ్వరా ! సర్వాంతర్యామీ ! నీర వుఁడవై ఘాతుకఘటనల నన్నిటిని గాంచుచుంటివేమి ? ఈనీచుల,

యీ భ్రాతృహంతకుల, ఈయుచ్ఛిష్టభక్షకుల ఈభిక్షుకుల, వికటాట్టహాసధ్వని విని కడకు నీయందలి భక్తివిశ్వాసములఁగూడఁ గోల్పోవక యుందునుగాక! హా! హా! భగవాన్! నీవు!— కృపాళూ! రక్షింపుము! రక్షింపుము!! రక్షింపుము!!!

[ పడిపోవును. ]

[ తెరపడును ]

శ్రీ

# మీ వా రు ప త న ము

## ప ం చ మాం క ము

### ప్ర థ మ దృ శ్య ము

ఉదయపుర రాజాంతఃపురము—రాత్రికాలము.

ఏకాకినియై మానసిపాడును.

గీ తి.

చిత్తమందలి ఖేదముఁ జెప్పలేదు;
ప్రేమతో నెన్నఁడును బల్కరింపలేదు
నవ్వుమొగమున, దరినైన నిలువలేదు
శాప్పమలినాననం బెత్తి యిప్పుడకట!
నన్నుఁ ద్యజియించి చనినట్టి నాథుఁ దలఁచి
ఘోరహృదయవ్యథానల జ్వాలయందు
నిలువునను దగ్ధనైపోవుచుంటి నిటులు.

-రాణా ప్రవేశించును.-

మానసి—అరిగో? బాబయ్యగా రిటు వచ్చుచున్నారు. జనకా! సమ
రాంగణమునుండి వచ్చుచుంటిరా?

రాణా—అమ్మా! అవును.

మానసి—మీరి ట్లుంటిరేమి ? అచట నేమి సంభవించినది.

రాణా—ఊరకుండుము. పలుకరింపకుము. నేనొకయాశ్చర్యకదృశ్య మునుజూచి వచ్చితిని—అద్భుతము! అతులము!! అపూర్వము!!!

మానసి—అదేమి దృశ్యము—కదన—

రాణా—నందనీ! ఈసారి యుద్ధము జరుగలేదు. రణస్థలమున నొక భీషణానలవాయువు వీచెను. మన సైనికులంద ఱొక్కమారుగ నావిస్ఫులింగోగ్రమారుతమునందు దగ్ధులైపోయిరి!

మానసి—ఏమి!

రాణా—నాకదేమియో బోధపడలేదు. అంతయు వింతగఁదోఁచె. అది యిహలోకదృశ్యమై యుండదు! అది యొక యులాకవృష్టి వలెఁ దోఁచినది. ఒకయభిశాపవన్యంబు రీతిఁ గన్పట్టినది. అచటఁ గొంతసేపు కనులుమూసికొని నిలువంబడితిని—హృత్కంఠముచే నొడలంతయు సడలిపోయినది. మస్తిష్కమంతయు ఘూర్ణితమై పోయినది. నే నెచటనుంటినో యెఱుఁగఁజాలనైతిని. చాలసేపటు లుండి, సుప్తోత్థితవ్యక్తి వడువున, నేత్రములఁ దెఱచితిని. ఆజిరంగ మున నేనొక్కఁడనే యుంటిని. వేరెవ్వరును లేరు. దొంతరలైపడి యున్న మృతకాయంబులు భయంకరములై దోఁచినవి. ఆహా! ఏమి యాదృశ్యము! ఏమి యాదృశ్యము!

మానసి—జనకా! మీ రుత్తేజితులైతిరి. కూర్చుండుఁడు. నేను మీకు శుశ్రూషఁ గావించెద.

రాణా—ఏకాకినై యాశ్మశానమున దిరిగితిని. కాని న న్నెవ్వరును వధింపలేదు!

మానసి—ఈరణమున నోడిపోయినటు లొప్పుకొంటిరా?

రాణా—దానికి సందేహమేమి? పరాజయ స్వీకార మొనరింపక జయించితిననుటకు యుద్ధము తర్కంబుగాదు. ఆజిపరీక్ష మిగులఁ

గలినమైనది. దాని ఫలము ప్రత్యక్షము. దానిసత్యము స్పష్టంబుగ విదితమే!—కాని వారలు నన్నేల వధింపలేదు? అమ్మహాశ్మశానమున నిలువంబడి యెలుగెత్తి "మహబత్ ! గజసింహా!" అని పిలచితిని. ఎవ్వరును రాలేదు! మానసీ! ఎవరును రాలేదేమి ? "

మానసి—జనకా ! మీరాలోకించుక విశ్రమించి శాంతింపుఁడు.

రాణా—విజిగీషుఁడైన మహబత్ విజయగర్వమున నుదయపురదుర్గము నేల ప్రవేశింపలేదో గ్రహింపఁజాలకుంటిని. దుర్గాక్రమణ మొనరించుట వాని కర్తవ్యముకాదా ?

మానసి—తండ్రీ! అపజయమునకు విచారించుచున్నారా ! ఇరుపక్షములం దొకపక్షము నిక్కువముగ బరాజయ మొందకతప్పదుగదా.

రాణా—అమ్మా! నిజము వాక్రుచ్చితివి. ఒకపక్షమువారెట్లైన నోడిపోవలయును. ఇఁక విచారించుటెందులకు? అదియయుక్తము! కుమారీ! వారలు నన్ను వధింపలేదేమి?

[రాణిప్రవేశించును]

రాణా—రాజ్ఞీ! నే నిపు డొక మహాసమస్యయందుఁబడి పోతిని! అదేమియో యెఱుంగుదువా?

రాణి—ఏమది?

రాణా—వారు నన్ను దునుమలేదేమి?

(రాణిమానసిని విలోకింపసాగెను)

రాణా—రాజ్ఞీ! ఆగభీర విభావరియందు ఆభయంకర భండనాంగణమందు—అస్త్రాపి కృతమృతకాయముల పొంత నొక్కఁడనే నిలువం బడితిని!—ఆహా! ఏమి యాదృశ్యము! సతీ! కల్పనయం దైన నీవట్టి దానిఁ గాంచనేరవు. నిశ్చలోజ్జ్వలతారా రాజయాకాశమున దోఁచినది!—అగణ్యశవరాశి నలుగెలంకుల భీషణమై గన్పట్టినది.! భూనభోంతరాళములందు గభీరాంధకారము

దక్క నొండేమియుం గాన్పింపలేదు. నే నపుడే పృథ్వియందు లేనట్లు దలంచితిని. నేంగూడ మరణించినట్లు దలంచితిని. ఆ మరణ మొక సజీవజాగ్రన్మృత్యువువలెం దోంచినది! ఆభీకర సమర క్షేత్రమున నొఱనుండి కరవాలమును బెరికి ఝుళిపించితిని. నిశా మారుత తరంగములం దా కృపాణము ఘూర్ణిల్లినది! "మహబత్!" అని కేక వైచితిని. మహాబత్తును జేర వృథా ప్రయత్నంబు సలిపి ఆధ్వని మరల నన్నే జేరినది. పిదప (భుగ్నస్వరమున) కదనరంగమును తేఱిచూడ—నక్షత్రాలోకమున మదీయ చిన్న స్వర్ణరాజ్యమొక ప్రకాండ భూకంపమువలన భిన్నమై నలు దిక్కులంబడి యుండినట్లు గానంబడియె! "(నిమ్న స్వరమున) అపుడాశ్మశానమున జరియించుచున్న యున్మత్తానిలుండు మృతశూర కాయముక్తాత్మల మోసికొనిపోవుచు భారంబున భూమిలోనికి దించుకొనిపోయినట్లు దోంచినది.! బహు ప్రయాసమున నొక దీర్ఘ నిశ్శ్వాసమును విడిచితిని. ఆనిశ్శ్వాస మాకాసమున కేగలేక బరువుచే నధఃపతితమై మృత్తికయందు లీనమైపోయినది. అంధకారము గభీరనిగాఢముగా నుండకున్నచో నచ్చోట దానిని వెదకి కనుగొనవచ్చునని దలంచితిని.

రాణి—ఏమి జరుగవలయునో యది జరిగిపోయెను. ఆవిషయమై యిపుడు విచారించిన నేమి ప్రయోజనము! నేను మొదటనే చెప్పివైచి—

రాణా—అవు నవును! రాజ్ఞీ! జరిగిపోయె నందువా? నిక్కువముగ నట్లే! మీవారు మాతమరణించినది. నిలువంబడి నేను మృతజననిం గాంచితిని. ఆయమ్మను నాయొమ్మునం జేర్చుకొని యిచటికిం గొనివచ్చితిని. చూతురు గాని రండు!

## ద్వితీయదృశ్యము

మీవారు రాజాంతఃపురమందలి యొక యాగారము
నకు వెలుపల నున్న మార్గము.—రాత్రికాలము.

ఇరువురుపరిచారికలు ప్రసంగించుకొనుచు నామార్గమునఁబ్రవేశింతురు

మధురిక—పాపము పెద్దవాఁడైన పిదప గోవిందసింహునికి ట్టి యిక్కట్టు సంభవించినది.! ఉన్న యొక కొమరుఁడుఁ నిముసములో మాయమై పోయెను!

చతురిక—అవును. నీటిబుగ్గవలె నున్న యతనికిఁ బెద్దకాలములో నిట్టి కష్టము కలుగుట దుఃఖకరమే! అయితే మధురికా! గానము సలుపు తాకూరాణి శవమును మూఁపున నిడికొని గోవిందసింహుని గృహమున కేల వచ్చినది-

మధురిక—అది నాకును బోధపడలేదు. ఆమెకు మఱొకపనియేమియు లేదు కాఁబోలు. గోవిందసింహుని యింటికడఁ జాలమంగుము గూడి యున్నారా!

చతురిక—మెల్లగ నడుగుచుంటివా! ఆవరణమంతయు జనములతో నిండిపోయినది. ఎక్కడెక్కడి ప్రజలో వచ్చిచేరిరి. గోవిందసింహుఁ డింట లేడు. తాకూరాణి తనయుఁడైన అరుణసింహుఁ డతనిఁ దీసికొని వచ్చుటకుఁ బోయినాఁడు. శవము పొంత తాకూరాణి యొకర్తుకయే నిలువంబడియున్నది. వచ్చిన జనులందఱు దూరంబుగ నిలువంబడిరి.

మధురిక—రాత్రి యగుటచే నాస్థలమంతయుఁ జిమ్మచీఁకట్లతో నిండియున్నది కాఁబోలు.

చతురిక—అవును. కన్ను మిన్ను కనుపించుట లేదు! దూరముగ నింటిలోని దీపము మాత్రము మినుకు మినుకు మని వెలుగు

చున్నది. అదేమి? అదేమి?

మధురిక—ఏది?

చతురిక—ఆవచ్చు వారెవరు?

మధురిక—మనరాజకుమారి ఏమి! ఆమె యట్లున్నది! అగ్నికణముల వలె నామె నేత్రము లెఱ్ఱవారియున్నవి—వసనము నేలపై జీరాడుచున్నది. పిడికిలి బట్టి యాకసమును జూచుచు నామె యిచ్చోటకే వచ్చుచున్నది.

చతురిక—అవును. ఆమె యిచటికే వచ్చుచున్నది. మన మీతావున నుండి మెల్లగ దాఁటుట మంచిది!

[ఇరువురు నిష్క్రమింతురు.]

(రెండవ వైపునుండి మానసి ప్రవేశించును.)

మానసి—అయ్యో! వెడలిపోయెను! అజయసింహుఁడు నన్ను విడచి వెడలిపోయెను! ఈజన్మమందు వాని నిఁకఁ జూచుట యసంభవము. పోవుతఱి నాతో చెప్పనైన లేదు.—నాకుఁ గనఁబడనే లేదు. ఇదంతయు నిజమైయుండునా! అయ్యో! నా నేత్రములు తిరిగిపోవుచున్నవి! శిరము నేల వ్రాలుచున్నది! నాచక్షుస్సమ్ముఖమునుండి యెన్నియో ప్రతిబింబములు మృత్తికనుండి యూర్ధ్వమున కెగసి యాకసమందు గలిసిపోవుచున్నవి. నాశరీరమందొక తరలజ్వాల వేవేగముగ నానరము లన్నిటినుండి బర్వులిడుచున్నది. నాతలమీదినుండి యాకసమెందో వెడలిపోయినది. నాచరణముల క్రింది పృథివి యెందో క్రుంగి పోయినది.! నే నిపుడెచటనుంటిని!—అయ్యో ఇదేమి విఘూర్ణనము! (క్షణకాలము నిస్తబ్ధమైయుండి పిదప మెల్లగ "నిక్కముగ నేను దుష్టాత్మురాలను—మనసిచ్చి వానినిఁ నెన్నఁడుఁ బలుకరింపనైన లేదు. లేశమాత్ర కృపాభిక్షువేఁడి దీనాననుఁడై యాసుందరుఁడు నాప్రా

ల నిలిచి నాకటాక్షపాతమునకై కరంబు నువ్విళులూరినను, ప్రేమమెయి కన్నెత్తి వానిని విలోకింపనైన విలోకింపలేదు. దానం జేసియే నాపైఁగినిసి యతఁడు పోయియుండును!—నాగర్వము నంతయుఁ జూర్ణ మొనరించి నన్ను నేలఁగ్రుంగఁజేసి యతఁ డదృశ్యుఁడైపోయెను.! అజయా! ప్రాణమిత్రమా! అయ్యో! నీవిఁక నాకుఁ గనఁబడవా! నీసుందరాననముఁ గాంచు భాగ్యము నాకిఁక లేదా? నీమధురస్వనము నిఁక వినఁజాలనా! శూరాగ్రేసరా! నిన్ను మఱచుటెట్లు? సుందరాంగా! ఇపుడు నీచరణతలమునఁ బడియుండఁగోరుచుంటిని—నాహృదమును జీల్చి నీయందలి యవ్యాజానురాగంబును జూపఁ దమకపడుచుంటిని. కాని యిఁక సమయములేదు! వేళమించి పోయినది! సుయోగము గడచిపోయినది! ఈదౌర్భాగ్యురాలికట్టి తరుణమేల లభించును? ఈయభాగిని కట్టి యదృష్టమేల నేకూరును?”

[నిష్క్రమించును.]

## తృతీయదృశ్యము

గోవిందసింహుని గృహాంగణము—రాత్రికాలము.

ఝంఝూమారుతము వీచుచుండును

[అజయసింహుని మృతదేహము దాపున సత్యవతియు నలువురు వాహకులును నిలిచియుందురు.

గోవిందసింహుఁడనిమేషలోచనుఁడై చచ్చిపోయిన తనయు విలోకించుచు సత్యవతి నుద్దేశించి]

“ఇది నిశ్చయముగ నా తనయుని మృతశరీరము. సత్యవతీ! ఇది యెచటఁ గాన్పించినది?”

సత్యవతి—పథపార్శ్వమున.

గోవింద—నాతనూజున కిట్టి యకాలమృత్యు వేల సంభవించెను?

సత్యవతి—మహబత్ఖాను సైనికులు పేదలైన పల్లెవాసులఁ జంపుచుండ నార్తరక్షణ పరాయణుఁడగు నజయసింహుఁడు వారల రక్షింప గమకించి, శత్రుసైన్యములతో ఘోర సంగ్రామ మొనరించి తుదకు సురులఁ బాసెననియు, సైనికులు కల్యాణినిఁ బట్టుకొని తమ వెంటఁ గొనిపోయిరనియు మార్గమందు గుమిగూడినవారు తెలిపిరి.

గోవింద—ఏమీ! అటులా! అజయా! తనయా! క్షమాపణ వేఁడు కొనుటకై నవకాశ మొసఁగితివి గావేమి? క్రోధాంధుఁడైన యీ దురాత్ముని కడనుండ రాదని నీవు నన్ను విడిచిపోతివి. పోవునపుడు రాతిబొమ్మవలె నిలువఁబడి యుంటినిగాని వలదని నిన్ను వారింప నైతి. నిన్నేల నేను వెనుకకుఁ పిడికొనిపోలేదు? ఏల నన్ను బోని చ్చితిని? అయ్యో! నే నెట్టి దౌర్జన్యమున కొడిఁగట్టితిని? కుమారా! ప్రాణాధికా! ఇంత కినుక యేల? ఇంత యభిమాన మేల? నాయనా! నేను నీ ముదుసలి తండ్రిని! కొడుకా ఒకమారు లేచి నాతో మాటలాడుము! నాయనా! ఇదేలరా! నా మాట విని నీవు వృద్ధు డనగు నన్ను మన్నింపవా? నా యెడల జాలిఁబొందవా? కన్న తండ్రీ! నాయనా! నాయనా!! (ఏడ్చును)

సత్యవతి—గోవిందసింహా! ఏమి నీ విట్లు విలపించుచుంటివి! అజయ సింహుఁ డార్తరక్షణార్థ మసువులఁ క్షత్రియోచితకార్య మొనరిం చెను. అట్టి వీరునికై దురపిల్లు టనుచితముకాదా?

గోవింద—అవును నాతనయుఁ డార్తరక్షణార్థమై ప్రాణములఁబాసెను. సత్యవతీ! నీవు సత్యమును వచించితివి! ఆర్తరక్షణార్థమై నాతనూజుఁడు తనువు వీడెను! అవును ఆర్తరక్షణ మొనరింప నానందనుఁ డాజిన లిపెను ఇక నే దుఃఖపడుటెందులకు? వాహకులారా! సగౌరవ

ముగ నా తండ్రిని శ్మశాన భూమికిఁ గొనిరండు [ముఖమును మూసికొనును. వాహాకులజయసింహుని కాయమును లేవనెత్త నుద్యమింతురు.]

గోవింద—ఒకసారి నిలువుఁడు! ఇచటనే నా కుమారుని కనులార నొకమారు చూడనిండు. (శవముపైఁబడి) నాయనా! నీవు నాకుఁ జేయఁదగు నగ్ని సంస్కారములను నేనే నీకుఁ జేయవలసి వచ్చినదా! ఏమి యీ కాలవైపరీత్యము! (గుండెలు బాదుకొనుచు) తండ్రీ! ఇదేమిరా! ఇట్లు పడియుంటివి! పుత్రా! నాసర్వస్వమా! ముదుసలినైన నాకీ వొక్కండవే దిక్కైయుండి యిల్లెల విడిచి పోతివి? ఇఁక నీ యంధునకుఁ దారి జూపువారెవరు? వత్సా! ప్రియతమా! ఒకమారు—కాదు కాదు! లేదు లేదు!! దుఃఖమెందులకు? సత్యవతీ! సత్యమును వచించితివి! నాతండ్రి శరణాగతరక్షణంబు కొఱకు మేను విడిచెను—మేవార్! రాక్షసీ! ఎందఱినో మ్రింగి నను నీ కడుపు నిండలేదా? నీవు ధ్వంసమగుటకు సిద్ధపడి కూర్చుంటివి. ఎల్లరఁగూడఁ గుత్తుక బంటిగ మ్రింగకుండఁబోఁగలవా! బంగారువంటి నాసంసారము నా కన్నతండ్రి!—ఏమీ! కాదు కాదు నా నాయన మరణించెనని యెవరనగలరు. అతఁడు మరణింపలేదు. ఇదిగో! చూడుఁడు! రెప్పవాల్పకుండ నన్ను జూచుచున్నాఁడు! ఇతఁడింకను బతికియే యున్నాఁడు!(శవముముఖముననిజవదనంబిడి) అజయా! ఏకమాత్రతనయా! నాయనా! కొడుకా! అయ్యో! అయ్యో! కన్నతండ్రీ! అయ్యో! అయ్యో!!

[గోవిందసింహుఁడు తనయుని మృతదేహముపైబడి గోలుమున నేడ్చుచుండును.]

సత్యవతి—గోవిందసింహా యోధాగ్రేసరుఁడవగు నీవు కూడ నిట్లు బేలవగుచుంటివేమి? దుఃఖమునఁ బిచ్చివాఁడవై పోకుము. నీకు

బుత్రుఁడు లేడనుకొనుము. అజయుఁడు నీవాఁడుకాడు!

గోవింద—వీఁడు నావాఁడు కాడా! ఇతఁడు నాకన్నతండ్రి కాఁడా! సత్యమే! ఈతఁడు నా నందనుఁడు కాఁడు! ఇదంతయు నా భ్రాంతి! నాయనా! నాయనా!! నా సర్వస్వమా!!!—(ముఖమును గప్పివైచుకొని నేలపైఁ జతికిలపడును.)

సత్యవతి—గోవిందసింహా! నీవు వీరపురుషుఁడవు. పుత్రశోకమునని ట్లధీరుఁడవై పోవుట నీకుఁ దగునా?

గోవింద—(డగ్గుత్తికతో) సత్యవతీ! ఏమనుచుంటివి? మఱింత బిగ్గఅగఁ జెప్పుము. నాకేమియు వినఁబడుటలేదు. నాయంతరంగమంతయు జాజ్వల్యమాన మగుచున్నది; నే నేమియు వినఁజాలకుంటిని! నాయనా! అయ్యో! ఈకడుపుశోకము భరించు టెట్లు! నే నీదుఃఖభారమును భరింపజాలను! ఇఁక నే బ్రదుకను! ఏమి యీ వేదన! ఏమి యీజ్వాల! హాహా హాహా! (నిజవక్షమును నొక్కిపట్టి యొకమా ఱూర్ధ్వదిక్కుగఁ జూచి, కండ్లు మూసికొని శవముపై బోరఁగిలపడును.)

(కల్యాణి ప్రవేశించును.)

కల్యాణి (వేగముగ ముందునకు వచ్చి) జనకునిఁ గవుంగిలించుకొని) తండ్రీ! తండ్రీ!! (విలపించును.)

గోవింద—(శిరమెత్తి) నీ వెవర్తుకవు? కల్యాణివా యేమి! సర్వనాశనీ! చూడుము! నీకీ[illegible]. నా కన్నతండ్రిని నీవే దిగమ్రింగితివి! తెమ్మా! నాకొడుకును నాకిచ్చివేయుము!

కల్యాణి—తండ్రీ! (ప్రక్కకుఁ దిరిగి) నాయన్న యిడుగో! అన్నా! అన్నా! అన్నా! (కల్యాణి సోదరుని మృతకాయమును గౌగలించుకొని పెద్దపెట్టున నేడ్చును.)

గోవింద—పొమ్మా! ఇచటనుండిపొమ్మా! నా తనయుని స్పృశింపకుము.

ఢాకినీ! ఇటనుండి తొలఁగిపొమ్ము. (ఇట్లని అతఁడు కల్యాణి కరమును బట్టుకొనును.)

కల్యాణి—(శవముపై నుండి లేచి) జనకా! నేను నిక్కముగ ఢాకినినే! నన్ను వధింపుఁడు! ఈ శాకినికిఁ గల్యాణియను నామధేయ మేల పెట్టితిరి?—తండ్రీ! నేను మీయింటియందు అకల్యాణశిఖ నైతిని! మీవారునకు ధూమకేతువ నైతిని!—పృథివియందు శనిదేవతనై యుద్భవించితిని! జనకా! నన్ను వధింపుఁడు! ఈ పాపిష్ఠురాలి నిహలోకమునుండి దూరీకృత నొనరించివేయుఁడు! నే నంతరింపఁగనే, మరల సర్వశుభములు సేకూరును! తండ్రీ! సంకోచింపకుఁడు పితా! వధింపుఁడు! వధింపుఁడు!! (జనకునిపాదములపైఁ వ్రాల మోకరించికూర్చుండి కంఠమును ముందుకుజాపును)

గోవింద—నాయంతరంగమం దిట్టి యుత్పాత మంకురించెనేమి హృత్సీమయందొక నిరయదాహము సముజ్జ్వలమై జ్వలించుచున్న దేమి? ఎడదయందీ పిశాచనృత్యమేమి! ఇఁకసహింపజాల! ఇఁకస హింపఁజాల? జగదీశా!

సత్యవతి—గోవిందసింహా! దుఃఖమున నున్మత్తుఁడ వగుచుంటివేల! శూరుండైన నీయాత్మజునకు సగౌరవముగ నగ్ని సంస్కారముల నాచరింపుము. అతడువీరపురుషోచిత మరణమునొందెఁగదా?

గోవింద—నిక్కము! నిక్కము!! శరణాగతరక్షణ దక్షుండైనపుత్రు కొఱకై దుఃఖపడను.? అమ్మా! నన్ను క్షమింపుము;—నాతన యుఁడొక మహత్కార్య నిర్వాహ ణార్థమై యునుసుఁలగోల్పో యెనని నేనుమిగుల గర్వింపవలయును —కాని సత్యవతీ? (క్రందనస్వరమున) కడువృద్ధుడనై పోతిని!! కడువృద్ధుడనై పోతిని!!

కల్యా—జనకా!

గోవింద—(కంపిత స్వరమున)—తల్లీ! రమ్మా! అమ్మా? నాహృ

దయముపైఁ జేరుము. గృహనిర్వాసిత, పతిపరిత్యక్త, మాతృహీన, అభాగ్యనందనీరమ్మ! దుర్మతినై, సాధ్వీతిలకంబవైననీకవజ్ఞఁజూపితిని దానంజేసియే జగదీశ్వరుడునాకిట్టి శిక్షావిధాన మేర్పరచినాఁడు—(వాహకులనుద్దేశించి) రండు. ఇఁక నాతనయున కగ్నిసంస్కారముల నాచరింతమురండు. [వాహకులు శవమును లేవనెత్తుచుందురు.]

మానసి—(అచ్చోటికి బరువున వచ్చి) ఆఁగుఁడాగుఁడు ? నన్నొకమాఱు నాథుని గన్నులార జూడనిండు.

సత్యవతి—ఏమీ? రాజకన్యయా ?

మానసి—అజయా! ప్రియతమా! నాజీవనసర్వసమా! నాహృదయేశ్వరా!

సత్యవతి—(అబ్బురమున) మానసీ! ఏమట్లనుచుంటివి! —అజయుఁడు నీకు హృదయేశుఁడెట్లయ్యెను?

మానసి—అటులైనసర్వమును సవిస్తరముగ దెలిపెదవినుము. ఈవరకు నేనెన్నఁడు దెలిపియుండలేదు. నేఁటికిఁ జెప్పుచుంటిని. అజయసింహునకును నాకును పాణిగ్రహణము జరిగెను. ఆవిషయమెవ్వరు నెఱుఁగరు. నాకు కూడ తెలియదు. నీరవమున, నిభృతమున, ఆత్మతో నాత్మకాపరిణయము జరిగెను. ప్రియతమా! ఎందరుగు చుంటివి! ఒకమారు శిరమెత్తి నీహృదయేశ్వరిని విలోకింపుము.—ఇఁక నేను నీప్రగల్భగురువునుగాను. దయామయి యని నీవనెడు రాజకన్యను గాను. నేఁడునేను నీప్రేమభిక్షను వేడు బికారిని. నాథా! ఈదుర్బలరమణివంక నొకమారు చూడుము. నేనిపుడు మార్గమందలి దీనురాలగు బిచ్చకత్తెకంటె దీనురాలను! ప్రియా! నిన్నెట్లు ప్రేమించియుంటినో నీకు నేనెన్నఁడు దెలుపలేదు! ఇట్లగునని గ్రహింపఁజాలనైతిని! నన్నుమన్నింపుము.

సత్యవతి—ఆహా! ఆర్తిచే నీమెయున్మత్తప్రాయయగు చున్నది.—

మానసీ! ఊఁటడిల్లు మూఁగడిల్లుము! దీనరక్షాపరతంత్రుఁడై యజయ సింహుఁడు ప్రాణముల విడచి రసపుత్రోచితకార్యము సలిపెను.

మానసి—నిక్కము నిక్కము. ఇట్లే యుసురుల వీడవలయును! ప్రియ శిష్యా! నీవు నేఁడు నాగురుస్థానము నలంకరించితివి! నీగౌరవరశ్మి తేజోవాహినివలెఁ బరలోకము నుండి పొరలి పృథ్వీకాయమునఁ బడి ప్రవహించుచున్నది! జీవములఁ ద్యజింపవలెనన్న యిట్లే ఈరీతి నేత్యజింప వలయును. వృద్ధగోవిందా! వృద్ధశూరా! మహావీరుఁడైన యిట్టితనయునిఁ బడసినీవుకడుధన్యుఁడవైతివి. ఇట్టిమహాత్ముని పత్నినై నేఁ గూడ ధన్యురాలినైతిని—గోవిందసింహా! ఇపుడు మనము గర్వపడవలయునుగాని దుఃఖపడరాదు.

గోవింద—(శుష్కస్వరమున) రాజపుత్రీ! ఆర్తరక్షణ పరాయణుఁడై తనువువీడి యజయసింహుఁడు పురుషసింహుఁడనిపించుకొనియెను ఇఁక మనకు దుఃఖమెందులకు. [భగ్నస్వరమున] నానందనుఁడు దేశార్థమై—

గోవిందసింహుఁడు మఱేమియుఁ బలుక నేరకపోయెను. ఇంటి మూరుపై కుడిచేయినాని, దానిపై మోమునుంచుకొని దుఃఖపడును. ఆవేగమున వాని దేహము వణకిపోవుచుండును.

మానసి—వృథా? వృథా! వృథా! అంతరంగాభ్యంతరము నుండి యొకప్రబల శోకోచ్ఛ్వాసము సాస్త్వనము పైనుండి పొంగిపొరలు చున్నది! ఇఁకసహింపఁ జాలను. ఇఁకసహింపఁ జాలను!! ప్రియా! ప్రియా!!

కల్యాణి—ఇదేమి! నాకేమియు బోధపడుటలేదు! ఇది స్వర్గమా లేక భూలోకమా? వీర లమరులా లేక నరులా? ఇదిజీవనమా లేక మృత్యువా? నేనెవతెను?—వోః—

[మూర్ఛితయై నేలఁగూలును]

సత్యవతి—కల్యాణీ! కల్యాణీ!!

గోవింద—బిడ్డమూర్ఛిల్లినది! మరణింప నిమ్ము? మనమందఱ మొక్క మారే పోవుదము! పుత్రుఁడు! దుహిత! మీవార్ జననీ!—అంద ఱము పోదుము!—నందనుఁడరిగెను! నందనియరిగెను! మీవార్! ప్రాణాధిక మీవార్! చిరవాంఛితమీవార్? చిరసాధన మీవార్! నీవు కూడమునింగితివి!—మునింగితివి! !—ఇదిగో మునుగుచుం టిని!—నేఁ గూడమునింగితిని! ఏదీ! ఏదీ! ఈవెల్లువ! అదిగో! అదిగో !!కొనిపొమ్ము!! వచ్చుచుంటిని! వచ్చుచుంటిని!! ఆఁగుమాఁగుము!!!

[ఉన్మత్తుని కరణి నిష్క్రాంతుఁడగును-]

సత్యవతి—సర్వము సంపూర్ణమైనది- విలయకాలమిప్పుడసన్నిహితమా గాక!—

చ తు ర్థ దృ శ్య ము.

మీవారుపర్వత ప్రాంతమందు మహబత్ఖాను శిబిరము—
సాయహ్న కాలము.

బహబత్ శిబిరము వెలుపల నిలువంబడి, అస్తమయసూర్యుని కిరణరేఖలచేఁ బ్రకాశించు మీవారుపర్వత శిఖరముల విలోకించు చుండును. "పోనిమ్ము—ఎందులకిఁక—అస్తమించెను." ఆసమయము న గజసింహుఁడు ప్రవేశించి—"ఏమి ఖాన్సాహేబుజీ!"

మహబత్—ఏమిమహరాజ్జీ!

గజసింహ—యుద్ధమున విజయము నందిన మీరింకను—ఉదయపుర దుర్గమును బ్రవేశింపలేదేమి?

మహబత్—మహరాజ్జీకిపుడు వానికారణమును నిశ్చయముగఁ దెలుప వలయునా యేమి?

గజసింహా——అక్కఱలేదు. మాటవరుస కట్లడిగితిని.——సాహేబుజీ! ఈమాఱు మీవారులోని నారీగణ మస్త్రధారణ మొనరించునట మీరావిషయ మెఱుఁగుదురా?

మహబత్ (అబ్బురముతో)——ఏమీ! రజపూతాంగన లస్త్రధారణ మొనరించెదరా!——అంగనలా అంగనలే.

గజసింహా——అవును. ఆయమ్మలక్కలందరేమిపోరెదరో చూడకపోము. సొగసుకత్తెలురాగనే యుద్ధమెంత సొగసుగ నుండునో! పాపము వారు యుద్ధరంగమనినఁ గ్రీడాస్థానమనిదలఁచిరి కాఁబోలు! యుద్ధము చెమ్మచెక్కలాట కాదనియెఱుంగరు.

మహబత్——గజసింహా! వీరమాతలైన రాజపుత్రరమణులఁగూర్చి, రాజపుత్రుడవైయుండియు నీవీతెఱంగున కనికరములేని పరిహాసముఁ గావించుటవిచారముగనున్నది. నీవునిజముగ రాజపుత్రుఁడవేనా? లేక

గజ——ఏమీ!

మహబత్——ఏమీ? నీవునాసమ్ముఖమునుండి తొలఁగిపొమ్ము. నీశౌర్యమునంతయుఁ ముందుముందు పనికివచ్చునట్లు కచ్చితముగా నుంచుకొనుము. నీవంటివానిని జూచినవాడు మహాపాపియగును. ఇపుడేయిచటినుండి తొలఁగిపొమ్ము.

[గజసింహుఁడు నిష్క్రమించును.]

మహబత్——ఈమహాత్ములందఱు సనాతన హిందూ ధర్మ ధ్వజము నెత్తుదురఁట! హిందువులారా! సామ్రాజ్యముఁతో బాటు మనుష్యత్వ మునుగూడఁ మీరు గోల్పోయితిరేమి! రాజ్య విభవమును గోల్పోవుట సహ్యామే కాని మనుష్యత్వమును గోల్పోవుట దుస్సహాము! అసహ్యాము.

(కొందఱు సైనికులు ప్రవేశింతురు)

మహబత్——సైనికులారా! వార్తలేమి?

ఒక సైనికుఁడు—సాహోజాదా ఖురమ్ (Afterwards Shajahan) సైన్య సమేతముగ నరుదెంచెను.

మహాబత్—అరుదెంచెనా! మంచిది. పొండు.

(సైనికులు నిష్క్రమింతురు)

మహాబత్—ఖురమ్ సైన్యసమేతముగా రావలసిన ప్రయోజనము లేదు. ఈ మహాబత్ఖానే విధ్వంసనక్రియను బరిపూర్ణ మొనర్చెను కాని, మహాబతూ! సైనికులఁ దోడ్కొని యుదయపురదుర్గమున బ్రవేశింపదలంపకుము అపనిని మొగలాయీలనే గావింపనిమ్ము. నీ పని యింతటితో ముగిసినది.

(గోవిందసింహుఁడు ప్రవేశించును.)

మహాబత్—ముదుసలీ! నీ వెవ్వఁడవు?

గోవింద—మీవారు సామంతులలో నొకడను.

మహాబత్—ఇచటి కేల వచ్చితివి?

గోవింద—చెప్పెదను (వగర్చుచు) కొంచెము సేదదీర్చుకొననిమ్ము.

మహాబత్—నీవు రాణా అమరసింహుని దూతవా? సంధివిషయమై ప్రసంగింపవచ్చితివా?

గోవింద—సంధివిషయమై ప్రసంగమా—అంతకు బూర్వమే నాశిరంబున నశనిపాతమగు గాక!

మహాబత్—అయిన, నీ కిచట నేమి కావలసివచ్చెఁజెపు.

గోవింద—మరణము కావలయును. ముదుసలినైతిని. మరణింపఁగోరుచుంటిని. అట్టులయ్యు సామాన్యసైనికుని కరముల మడియుట కిష్టములేదు. నాయభీష్టము నీచే వధింపఁబడవలెనని—నీతోఁ బోరి మరణింతును.

మహాబత్—వృద్ధుఁడా! నీకుఁ బిచ్చిపట్టినదా యేమి?

గోవింద—నాకుఁ బిచ్చిపట్టలేదు. సాధ్యమగుచో ద్వంద్వయుద్ధ

మందునిన్ను వధియించెదను. లేకున్న నీచే వధింపఁబడెదను. హా! యీశ్వరా! ఆశక్తి యిపుడుండెనా!—మహాబత్! నీతో నిపుడుసమముగఁ బోరఁజాలనని యెఱుంగుదును. కాని మరణింపఁజాలుదును. దిట్టరివైన నీవు నన్ను జంపివేయుము. అదియే నాయభీష్టము. అదియే నాయిచ్ఛ!

మహాబత్—ఇది మిక్కిలి యద్భుతమైన కోరికయే.

గోవింద—ఇం దద్భుతమేమియు లేదు. స్వర్గీయుఁడైన మహారాణా ప్రతాపసింహుని పార్శ్వమున నిలువంబడి నేను సుమారు-ఏఁబది యుద్ధముల నలిపితిని. క్షతచిహ్నము లనేకము లీ శరీరముపై నున్నవి. నాకాయమందలి కడపటిగాయము నీ ఖడ్గాఘాతముచే గలుగుగాక.

మహాబత్—దానివలన నీ కేమి ప్రయోజనము?

గోవింద—ప్రయోజన మే మైననేమి! మహాబత్! మతముచే నీవు యవనుఁడ వయ్యు, జాతిచే రసపుత్రుఁడవు! అంతియకాక నీవు రాణాప్రతాపసింహుని యన్నగారి కొమరుఁడవు. నీచేతి మరణమందొక గౌరవమున్నది.

మహాబత్ (తేఱిచూచి)—మీరు రసపుత్రసేనాధిపతులును, సాలుంబ్రాపతులునగు గోవిందసింహులు గారా?

గోవింద—అవునవును. మహాబత్! నన్నిప్పటికి గుర్తింపఁగలిగితివా? ఎందులకు మడియఁగోరుచుంటినో యిపుడు గ్రహించితివా? మహాబత్!—దుర్వారగర్వంబున నీవు మీవారును స్వాధీనపఱచుకొంటివి—మీవారును ధ్వంస మొనరించితివి! అట్లయ్యు నిన్నిపుడుదయపురదుర్గమందుఁ బ్రవేశింప నీయను! మీవారు శూరులందఱు నిర్జీవులైరి. దానంజేసి నీవిఁక యుద్ధమొనరింపనక్కర లేదు. మీవారు వీరశేష మీ గోవిందసింహుఁ డొక్కఁడే.

ఒక్కఁడనయ్యు, నుదయాపురదుర్గమునకు రక్షణంబొనఁగ మొగలు వాహినుల నెదురించి నిల్చెదను—నిల్వ యత్నించెదను!-నన్నుఁ దుదముట్టింపక నీవా దుర్గమున నడుగు వెట్టఁజాలవు! మహబత్! ఇఁక విలంబన మాచరింపక కత్తిదీసికొనుము.

[ఒరనుండి నిజకరవాలమును వెలికిఁ దీయును.]

మహబత్—వీరవరా! నేనా దుర్గమును ప్రవేశింప నిచ్చగించుటలేదు.

గోవింద—ఇపుడు—ఇష్టపడుటయు— ఇష్టపడకపోవుటయు— సమమే—ఒకటియే—నీయుము. అస్త్రమును వెలికిఁ దీయుము.

మహబత్—వినుఁడు తాము—

గోవింద—ఇఁక నేనేమియు వినువాఁడనుకాను. నీపలుకు లేవియు నాచెవిసోకవు. నాయంతరంగమున నొకదావాగ్ని జ్వలించుచున్నది. నాకు పుత్త్రుఁడులేఁడు! పుత్త్రికలేదు!—నేను మరణింప నువ్విళు లూరుచుంటిని! నాయనుఁగు జనయిత్రియగు మీవారు యవనపద దలితగాక పూర్వమే నేఁ బ్రాణములఁ బాయవలయును—ఎవ్వఁడు, నాయల్లుడయ్యు, నాపుత్త్ర హంతకుఁడయ్యెనో, ఎవ్వఁడు నా ప్రియ మీవారునకుఁ దనయుండయ్యు, యవనదాసుఁడయ్యెనో, ఎవ్వఁడు నావలె హైందవుఁడై జన్మించియు, ముసల్మానయ్యెనో, ఎవ్వఁడు నా రాణాకు సోదరుఁడయ్యు, రాణాకు బగవాడయ్యెనో,—అట్టి పితృద్రోహి, అట్టి సతీద్రోహి, అట్టి ధర్మద్రోహి, అట్టి మాతృద్రోహి, అట్టి [illegible]ద్రోహి కరములందే చావఁ గోరుచుంటిని—మహబత్? ఇఁక నీవస్త్రధారణ మొనరింపుము!—

మహబత్—[తరవారిని నిష్కాసన మొనరించి, దీనవదనుఁడై] "మామగారూ! శాంతింపుఁడు! మిమ్ముఁ వధింప నాకు చేతులురావు" అనియెను.

గోవింద—ఇఁక నేనేమియు విననొల్లను ఇపుడు నిన్ను నీవు రక్షించు

కొనుము. లేకున్న నన్నుఁ జంపుము—

మహబత్—మామగారూ!

గోవింద—నన్ను వధింపుము!—వధింపుము!

మహబత్—నేనస్త్రముకు పరిత్యజించుచుంటిని. (కృపాణము విడువఁ బోవును)

గోవింద—మహబత్! దానిని విడువకుము. నిన్ను నేను విడచువాఁడనుకాను! అస్త్రమునుదూసి నాపై లంఘింపుము. నేఁడు నేను చావఁ గోరివచ్చితిని! తప్పక చచ్చిపోయెదను. రమ్ము! కరవాలముచే నాకంఠమును నఱకుము! లేకున్న నిన్ను నేను వదలను. యుద్ధము చేయుము.

[ఆక్రమణమొనరింపనుద్యుక్తుఁడగును.]

[ఈసమయమందు గజసింహుఁడు వెనుకనుండి మెల్లగవచ్చి, గోవిందసింహునిపై దుపాకిఁ బేల్చును. గోవిందసింహుఁడు చివాలున నేలపైఁగూలును.]

మహబత్—(రోషభీషణుఁడై గజసింహు నుద్దేశించి)—అరే! దురాత్మా! పిఱికిపందా! ఏమిచేసితివిరా! నిజమైన రజపుత్రుఁడవగుచో నెదురుగావచ్చి యీశూరశిఖామణితోఁ గయ్యమాడకపోతివేల? దుర్మతీ! కాచుకొనుము! ఇప్పుడె నిన్ను దండధరుమందిరమునకంపెదను! (కరవాలమును ఝళిపించుచు గజసింహునిపై నుఱుకగమకించును.)

గజసింహుడు—[గజగజ వడంకుచు, మహబత్ఖాను పాదములపైఁబడి, హీనస్వరమున, "సాహేబుజీ! నన్ను వధింపకుము! రక్షింపుము! రక్షింపుము!"

మహబత్—దురాత్మా! ఎట్టి నీచకృత్యముఁ గావించితివిరా!

గజసింహ—ఇట్టి దస్యులు మడియకున్న, మనకుఁ జేటుమూడదా?

మహాబత్—ఓరీ! మూర్ఖా! ఈవీరాగ్రేసరుని దస్యుఁడనుచుంటివిరా?

గోవింద—గజసింహా! దస్యుఁడనునేనుగాను. దస్యుఁడవు నీవు! దస్యుడు మహాబత్ఖాను! మీవలె నేను పరరాజ్యమును గొల్లగొట్ట యత్నింప లేదు! మహాబత్! ఇఁక నీవరుగవచ్చును! వేగ నుదయపురదుర్గ మును ప్రవేశింపుము! నిన్నిఁక నెవ్వరు నిరోధింపరు. నీమాతృదేవ తనుబట్టి మ్లేచ్ఛులకడకీడ్చుకపోయి, వారల కామెను దాసిగా జేయు ము! పుత్రుని కర్తవ్యమును దీర్పుము—నాయనా! అజయా! అమ్మా! కల్యాణీ! మాతా! మీవార్!

[ప్రాణములవిడచును.]

పంచమదృశ్యము.

ఉదయపుర దుర్గమునకెదుటి రాజమార్గము—రాత్రికాలము.

దుర్గరక్షకుఁడైన యొక రాజపుత్ర సైనికుఁడును, కొందఱు పుర వాసులును ప్రసంగించుచుందురు.

వెంకటావధానులు—ఏమంఛావు?

సైనికుఁడు—చావు! నీవే చావుము.

వెంకటావధానులు—ఏరా మాటలు మిగులుతున్నావు! ఏమంఛావంటే జవాబుసరిగ నీయలేవా?

సైనికుఁడు—ఏమనవలె?

వెంకటావధానులు—నువ్విక్కడెందుకు?

సైనికుఁడు—దుర్గమును గాఁపాడుటకు.

వెంకటావధానులు—అయితే రాణాదుర్గమునుంచి వెళ్ళిపోయాడెం దుకు.

సైనికుఁడు—ఎందుకో నేఁ జెప్పఁజాల. మీవారునకు విరుద్ధముగ నిఁక యుద్ధమొనర్పనని మహాబత్ఖా నస్త్రపరిత్యాగముఁ గావించి, సామ్రా

ట్టున కొనసంగతి వ్రాసితెల్పెనని వింటిని. దానంజేసి ఖురమ్ పాదుషా యీయుద్ధమునకు స్వయముగ వచ్చెను. వానికడనుండి మొగలుదూత యొకజాబును గొనివచ్చెను. ఆజాబుమూలమున ఖురమ్ రాణాను మైత్రిభిక్ష వేఁడెనని వింటిని. మొగలాయిదూత మగుడిచనినపిదప అనఁగా—నేఁటి ప్రత్యూషమునఁ దురగమునెక్కి రాణా మొగలుశిబిరాభిముఖుఁడై చనియెను.

రాంభొట్లు—తర్వాత తర్వాత?

సైనికుఁడు—తర్వాత నేమి జరగినదో నేనెఱుంగను.

సుబ్బన్నదీక్షితులు—రాణా ఇంకా తిరిగిరాలేదా?

సైనికుఁడు—లేదు—రాలేదు.

కుంకంభొట్లు—రాణా వెంట ఎవరు వెళ్ళారు!

సైనికుఁడు—ఎవరును పోలేదు. అతఁడొక్కఁడే పోయినాఁడు.

వెంకటావధానులు—ఆ వస్తున్నవారెవరు?

సుబ్బన్నదీక్షితులు—(సైనికు నుద్దేశించి)—ఓరే! నీకు పెండ్లైనదిరా?

వెంకటావధానుల్లు—ఛీ! ఊరుకో! వాఁడిపెండ్లిజోలి నీకెందుకు? ఓరే కుంకంభొట్లు! ఆవచ్చే వారెవరంచావు?

కుంకంభొట్లు—ఉండవో! నీతో రావడంచేత నాసంభావన డబ్బులూడిపోయినాయి!

రాంభొట్లు—ఒరే! నార్జూరీ చెంబూ, గావంచాకూడ పోయినాయిరా.

వెంకటావధానులు—మీయేడుపులు తగలేసిరి! ఎప్పుడూ ఒకమోస్తరుగానే యేడిచారు!

సుబ్బన్నదీక్షితులు—ఒకమోస్తరు యేడుపు కాకపోతే కొత్తమోస్తరు యేడుపేదో వొకమాటు యేడిచి చూపించి యేడవోయ్.

సైనికుఁడు—అయ్యో! మీరిచ్చటఁ బో రాడకుఁడు.

వెంకటావధానులు—ఆవచ్చు వారెవరంటే వినుపించుకోలేమి!

రాంభొట్లు—(తేఱిచూచి)—మనరాణాకాదుకదా?

సుబ్బన్న దీక్షితులు—అవునవును! మనరాణావలెనే కనిపిస్తున్నాడు. అబ్బే! కాదు కాదు! అవునవును! కాదు కాదు! అవునురో! అతఁడు మనరాణాకాడు! (గంతుల వైచుచు బలుకును)

వెంకటావధానులు—ఇప్పుడుచివరకు యీ నాట్యమువలన తేలిం దేమిటి? అతఁడు రాణా అవునా కాడా?

కుంకంభొట్లు—అతఁడు రాణాలాగ దుస్తులు వేసుకొన్నాడు. అతడెవడై యుంటాఁడు?—యెవడైనా సైనికుడా యేమిటి?

సైనికుఁడు—అతఁడు యోధపురాధీశ్వరుఁడైన మహారాజ్ గజసింహుఁడు.

వెంకటావధానులు—అతడు మీవారును ముట్టడించడానికి—రాచతురకవానితో—[సుబ్బన్న దీక్షితుల నుద్దేశించి] ‘రాచతురకవాడా లేక తురకరాచవాడా? యేమంఛావు’

సుబ్బన్న దీక్షితులు—ఎవఁడైతేనేమి! చెప్పుము.

వెంకటావధానులు—అతఁడు మీవారును ముట్టడించడానికి రాచతురకవాడితో వచ్చిన మహాత్ముఁడు కాఁడూ?

సైనికుఁడు—అవును.

రాంభొట్లు—వాడు రాజపుత్ర జాతివాడేనా?

సుబ్బన్న దీక్షితులు—రాజపుత్ర జాతివాఁడైతే, ఆదుర్మార్గుఁడు రాజపుత్రులకు శత్రువెందు కవుతాడు !

కుంకంభొట్లు—రాంభొట్లూ! ఆరాచతురకవాని పేరేమంఛావు?

రాంభొట్లు—సంపత్తు!

వెంకటావధానులు—ఛీ! నోరుముయ్యి. నా మేనమామ తురకవాడట్రా?

రాంభొట్లు—నీమేనమామ తురకని యెవరన్నారు! మాటిమాటికి ఛీ ఛీ అంఛావు.

వెంకటావధానులు—సంపత్తు నామేనమామ.

సుబ్బన్నదీక్షితులు—తురక రాచవాఁడిపేరు సంపత్తుకాదు. పుష్పోత్తు!

సైనికుఁడు—(నవ్వుచు) —పుష్పోత్తుకాదు —మహాబత్తు!

రాంభొట్లు—అయితే వాడు తురకరాచవాడా? లేక రాచతురక వాఁడా?

కుంకంభొట్లు—తురకరాచవాడు!

వెంకటావధానులు—ఛీ రాచతురకవాఁడు!

సుబ్బన్నదీక్షితులు—ఛీ! ఛీ!! తురకరాచవాడు!

వెంకటావధానులు—ఛీ! ఛీ!! ఛీ!!! రాచతురకవాడు!

రాంభొట్లు—నువ్వే! నువ్వే!! నువ్వే!!!

(ఇంతలోఁ గొందఱు సైనికుల వెంటనిడుకొని గజసింహుఁడు ప్రవేశించును)

గజసింహ—యోధుఁడా! దుర్గద్వారము బంధింపఁబడి యున్న దేమి?

సైనికుఁడు—అవును! బంధింపఁబడియే యున్నది!

గజసింహ—అటులైన తక్షణమే ద్వారముఁ దెఱువుము. ఇపుడీ దుర్గముమాది!

సైనికుఁడు—రాణా యాజ్ఞలేనిదే దుర్గద్వారముఁ దెఱువఁజాలను!

గజసింహ—రాణాయాజ్ఞయా! ఇది రాణాయాజ్ఞయే! మీరాణాయిపు డమరసింహుఁడుకాఁడు! మహారాజ్ గజసింహుఁడు!

సైనికుఁడు—అటులా! నేనావిషయము నెఱుంగను! కాని మారాణా అమరసింహుని యాజ్ఞలేనిదే నేనీ దుర్గద్వారముఁ దెఱువను!

గజసింహ—సైనికులారా! ఈవదఱుఁబోతు కడనుండి తాళముచెవి నూడఁబెఱికి కొనుఁడు!

సైనికుఁడు—నాప్రాణములుండ మీరలట్లొనరింపఁజాలరు. [ఖడ్గము నొరనుండి వెలికిఁదీయును.]

గజసింహుఁడు—(సైనికులనుద్దేశించి) అరే! మీరేల్పేలరిని నఱకివే యుఁడు.

వెంకటావధాని—(అన్యపురవాసుల నుద్దేశించి) మీ రల్లాఊరికే నిలుచోని వేడుక జూస్తున్నా రేమిటీ! ఈరాక్షసుడు మహానిక్కుతున్నాడు—చూస్తారేం—నఱకండి—

సుబ్బన్నదీక్షితులు—అవునవును! యింకూరుకోవద్దు! యిదిగో నా ఝారీ చెంబు (అంగవస్త్రమును చెంబునకుఁ గట్టును)

కుంకంభొట్లు—ఇదిగో! ఇదిగో!! పదు! పట్టుకో! పట్టుకో!! (ముందునకు జూచుచు గంతులవైచుచు వెనుకకుఁ దగ్గును)

రాంభొట్లు—నాఝారీ పోకపోతేనా!—

కుంకంభొట్లు—(వెనుకకువచ్చి రాంభొట్లునుముందునకుఁ ద్రోయును) రాంభొట్లుసుబ్బన్న దీక్షితుల మీఁదను, అతఁడు వెంకటావధాని పైనను, అందఱును కలసి గజసింహునిమీఁదను బడుదురు.

గజసింహ—సైనికులారా!

గజసింహుని సైనికులు పురవాసులపైఁ బడఁజొచ్చిరి. అప్పుడు వెనుకనుండి మొగలు సైన్య పరివృతుండై రాణా అమరసింహుఁడు వచ్చును.

అమర—"సైనికులారా! ఆగుఁడాగుఁడు!!

[గజసింహుని సైనికులు మొగలాయి సైన్య[illegible]ంచి నిలువం బడిపోదురు. (బ్రాహ్మణులు పరుగెత్తుదురు]

రాణా—ఓహో! గజసింహమహరాజా! నేలఁ గూలితిరేమి! లెండు! స్వామీ! ఇచటికి మీరేలవచ్చితిరి?

గజసింహ—(లేచి)—నేనీదుర్గమును బ్రవేశింపవలయును. ఇదినాది!

రాణా—మహాశయా! నేఁడు తాము రాణాకతిథులయ్యెదరు! అమరసింహుఁడు యథోచితముగఁ దమకతిథి సత్కారమును గావిం

చను — మొగలాయి శునకమా! నీకుఁదగిన యతిథిసత్కారమిది!
కాలితోఁదన్ని గజసింహుని నేలపైఁ గూల్చును)

రాణా — దుర్గరక్షకా! నీసాహసమునకుఁ గడుమెచ్చుకొంటిని. తగిన పారితోషికముఁ బడయఁగలవు. ఇఁక దుర్గద్వారమును దెఱువుము [ద్వారముఁ దెఱువఁ మొగలు సైనికుల నుద్దేశించి, సైనికులారా! ఇఁక మీరరుగుఁడు [సలామొనరించి సైనికులు నిష్క్రమింతురు.]

రాణాదుర్గాభ్యంతరమునఁ బ్రవేశింపగనే ద్వారము మరల మూయఁబడును

---

Referring to the peace and to the subsequent events made between Amarasinha and the Emperor James says :—

"Seldom has subjugated royalty met such consideration; yet, to a lofty mind like Umra's this courteous condescension but increased the severity of endurance. In the bitterness of his heart, he cursed the magnanimity of Khoorum, himself of rajpoot blood and an admirer of Rajpoot valour which circumstance more than the force of his arms had induced him to surrender; for Khoorum demanded but the friendship of the rajpoot as the price of peace, and to withdraw every Mahomedan from Mewar if the Rana would but receive the emperor's firman outside of his capital. This his proud soul rejected; and though he visited prince Khoorum as a friend, he spurned the proposition of acknowledging a superior, or receiving the rank and titles awaiting such an admission. The noble Umra, who "Rather than be less, cared not to be at all," took the resolution to abdicate the throne he could no longer held but at the will of another. Assembling his chiefs, and disclosing his determination, he made the teeka on his son's forehead and observing, that the honour of Mewar was now in his hands, forthwith left the capital and secluded himself in the *No chouki*;

## ష ష్ఠ దృ శ్య ము

మీవారు నందలి యొకగిరిపథము—సాయంకాలము
సత్యవతియు నామె పుత్త్రుఁడైన అజేయసింహుఁడును
గాయనులును కలసి పాడుదురు-

గీతి

అస్తమించె మీవారు చండాంశుఁ డిపుడు;
అంబరంబున గ్రమ్మె కృష్ణాంబుదములు;
ధరణిఁ గూలె నుదయపురధ్వజముగూడ,
మసనమైపోయె మనసీమవ్యసన మొసఁగి;
చిమ్మచీఁకటి బర్వె నీసీమయందు;
సమసె, ఆశాసుఖస్వప్నసంచయంబు
అకట యేపాటపాడుదుమమ్మ యిపుడు.

---

nor did he from that hour cross its threshold, but to have his ashes deposited with those of his fathers."

A brief sketch of Umra's character.

"All comment is superfluous on such a character as Rana Umra. He was worth of Pertap and his race. He possessed all the physical as well as mental qualities of a hero, and was the tallest and strongest of all the princes of Mewar. He was not so fair as they usually are, and he had a reserve bordering upon gloominess, doubtless occasioned by his reverses, for it was not natural to him; he was beloved by his chiefs for the qualities they most esteem, generosity and valour, and by his subjects for his justice and kindness, of which we can judge from his edicts, many of which yet live on the column of the rock."

2

విపుల రాజ్య మహోజ్జ్వల విభవమెల్ల
మన యభాగ్యంబుచే నశించిన కతాన
ప్రీతి స్వేచ్ఛా మహానంద గీతములను
బాడనే పాడవు చలత్పతత్రితతులు
తేనె తేటల సోనల తీయతావి
నల్లడగుబులొ్కనంగ, కన్బండువుగను
పూయనే పూయవు మనోజ్ఞ పుష్పవనులు
చల్లగా వాసనల వెదఁజల్లుకొనుచు
వీచనే వీచదల్లనఁ బిల్లగాలి
చక్కగా వచ్చి చిన్నారి చందమామ
నవ్వనే నవ్వఁడు వినీలనభమునందు.

(3)

కాననంబులు దుఃఖమగ్నంబులయ్యె
పల్లెలును పట్టణంబులు పాడువడెను
పౌరులెల్ల నిరానంద వదనులైరి
రమ్యభవనంబు లార్తి పూర్ణంబులయ్యె
వీరులును శూరులును స్వర్గవీధి కేగ
వాడికరవాలములు త్రుప్పువట్టి పోయె
అనలగుండంబు డంబుచేనవని మెఱయ
దేశమంతయు వీరసతీపవిత్ర
భస్మరాసులతో నిండి భయదమయ్యె
స్వర్గసుందరమైన మావారుసీమ
అకట ఘోరశ్మశాన మట్లయ్యె నేడు.

(4)

యవనుల కఠోరహస్తంబు లందుఁజిక్కి
దాసియై విలపించు మాతల్లి నకట!
యూరడించెడు వారెల్లెరి నేడు
ఇపుడుమనమున్న దుస్థితులెల్ల మఱచి
గొంతుసారించి, మీవారుకొండలెల్ల
మారుమ్రోఁగగ మనపూర్వమహిత కీర్తి
గీతములఁ బాడి మన దేశమాత హృదయ
మునకు నొసఁగుద మమల సాంత్వనసుఖంబు.

(మువ్వురు సైనికుల వెంటనిడుకొని హెదాయత్ అలీఖాను ప్రవేశించును.)

హెదాయత్—(సత్యవతి నుద్దేశించి) నీవెవతెవు?

సత్యవతి—నేను గాయకురాలను.

హెదాయత్—ఊరూర గిరిప్రదేశములందు ఈవిధముగనే బాడుచు గ్రుమ్మఱుచుందువు గాదా?

సత్యవతి—అవును. పాడుటయే నావృత్తి.

హెదాయత్—నీవిపుడు పాడిన పాటను పాడరాదు.

అరుణ—(స్వగతమున)—మేము పాడుకుంటే వీడికేకడు పుట్టెందు లకో!

సత్యవతి—ఎందుకు పాడరాదు?

హెదాయత్—ఈదేశమిపుడు మీదికాదు—మొగలాయీలది.

సత్యవతి—మొగలులకు జయమగుగాక! మీవారుస్వాధీనమైయున్నంతకాలము మేము బవరముసలిపితిమి. ఇపుడవనత మస్తకయై మా జనని మొగలు ప్రభుత్వమును స్వీకరించెఁ గావున మీతో మాకిఁక నెట్టివివాదములేదు. అట్లని మేమిఁకవిలపింపరాదా? అందులకుఁ

గూడ మేమునోచు కొనలేదా? పృథివి యందెల్లరుజనయిత్రిని ప్రేమింతురు. కేవలము హతభాగ్యులైన మీవారు వాసులొక్కఱు మాత్రమట్లొనరింపరాదా?

హిదాయత్—వేయిచెప్పుము! లక్షచెప్పుము! నీవాపాటను పాడ రాదు.

అరుణ—మేముపాడెదము. ఎవరడ్డెదరో చూచెదముగాక—అమ్మా! పాడుము.

హిదాయత్—మీరీపాటను పాడినచో మేము మిమ్ము బంధింప వలసివచ్చును.

సత్యవతి—సైనికా! అటులే కావింపుము. మేము వెఱచువారము గాము. కారాగారమందు గూర్చుండి మాదుఃఖగానముతో నా గారగభీరాంధకారమును గూడ ధ్వని చేతుము. తనయా! పాడుము.

హిదాయత్—మంచిది! అటులైన నీవు నాఖైదీవైతివి.

[ముందుకు వచ్చును.]

అరుణ—ఖబర్దార్! (తరవారిని యొరనుండి చివాలున వెలికిఁ దీసి) బ్రతికి వుండాలని నీకు ఆశ ఏమాత్రం వున్న మాఅమ్మను ముట్టుకోకు.

హిదాయత్—(వెనుకకుఁ దగ్గి) ధుండగీడా! కరవాలమును దాఁచి వైచుము.

అరుణ—మాకు- రసపుత్రులకు-ఆ అభ్యాసం లేదు. శక్తివుంటే యుద్ధము చేయి. లేకుంటే కాలికొద్ది పారిపో.

సైనికు లరుణుని ముట్టడింతురు. అరుణుఁడు వారితో భీషణ సంగ్రామ మొనరించును.

సత్యవతి—శబాస్! పుత్రా! శబాస్! నీతల్లిని రక్షించుకొమ్ము.

[ఒక సైనికుఁడు నేలపైఁ గూలును.]

సత్యవతి...తండ్రీ! శబాస్! శబాస్! ప్రాణము లున్నంతవఱకు కత్తి విడువకుము! ఇటులే యుండవలెను!—ఆహా! ఏమి యీయానంద దృశ్యము!

[సైనికులు చావనుండుటజూచి హెదాయతు వారలకు సాయము నలుపసాగును. జానువులపైఁ గూర్చుండి అరుణసింహుఁడు పోరు సలుపును. కఱకు తుపాకులు నల్వురు వానిని ముట్టడింతురు. పుత్రునకు మరణాసన్నమగుటఁ గాంచి, సత్యవతి క్షణకాలము కన్నులు మూసుకొనును. అట్టితఱి సైన్యసమేతముగ మహబత్ఖాను వెనుకనుండి వచ్చి "హెదాయత్! ఆఁగుమాఁగుము!"

[మంత్రముగ్ధులవలె నందఱు నిలుచంబడి పోయిరి.]

మహబత్—హెదాయతూ! నీకేమియు బిడియము లేదా? పోతులవలె బలిసియున్న నలుగురు సైనికులతో ఒక్క బాలకుని మార్కొందువా? లజ్జాకరము గాదా? కత్తులఁగూడ బయటకు దీసిరా! బలే! వత్సా! మాతనుఁ గాపాడనుసురులనర్పింప దొరకొంటివి! నీవు కడు ధన్యుఁడవు! ఈవిధముననే యసువుల పీడవలయును! వత్సా! చిరంజీవివై యుండుము!

[ఇంత దనుక రెండుచేతుల పిడికిళ్ళఁబట్టి తన రొమ్మున నుంచుకొని కొమరుని నానందముతో జూచుచున్న సత్యవతి మహబత్ఖాను వైపునకు పోఁబోయి మరల వెనుకకువచ్చి మోము వంచుకొని నిలువఁబడును.

మహబత్—[సత్యవతి ననిమేషలోచనుఁడై విలోకించి] "అక్కా! నీతో నేమి వచించుటకు నాకు నోరాడకున్నది. ఇపుడు నిన్ను "అక్కా" యని పిలువఁ దగనివాఁడ నైపోతిని! ఏమందును! అక్కా! నన్ను మన్నింపుము.

సత్యవతి—భగవాన్! ఇన్నిదినంబులకు నాయనుఁగు దమ్ముని జూపి

తివా; చూపియుఁ బ్రేమపురస్సరముగ వానిం గవుంగిలించుకొను టకు దగు సాహసం బొనఁగుచుండుట లేదేమి? ఆహా! 'అక్కా' యను ప్రేమంపు పలుకెన్ని దినములకు నాచెవి సోకెను!

అరుణ—అమ్మా! ఈయన యెవరు?

సత్యవతి—ఇతఁడు మొగలు సేనాధిపతియైన మహాబత్ఖాను!

మహాబత్—బిడ్డా! నేను నీ మేనమామను!

సత్యవతి—నాయనా! ఇఁక నడువుము. మనము పోదము.

మహాబత్—ఎచటకుఁ బోయెదరు? అక్కా! నన్ను క్షమించిపొమ్ము.

సత్యవతి—నీ వెట్టి యఘమొనరించితివో యెఱుఁగుదువా?

మహాబత్—ఎఱుంగుదును. స్వహస్తములతో స్వగృహంబున కగ్గి వెట్టి పైశాచికోత్సాహమునఁ దద్గృహాత్థితధూమరాశిని విలోకించితిని.

సత్యవతి—అంతేనా?

మహాబత్—ఇఁకేమున్నది?—మసల్మాను నైతిననియా? మసల్మానునై పాపం బొనర్చితినని నేఁ దలంపను—ఎవరి విశ్వాసమేడ వారట్లు నడచెదరు. లోకులు తమతమ విశ్వాసమును బట్టి ప్రవర్తించెదరు. నేనట్లే గావించితిని. కాని—

సత్యవతి—మంచిది!—బిడ్డా! రమ్ము!

మహాబత్—అక్కా! నిలువుము. అట్లగుచో, ఆపాపము మనుష్య హృదయాంతరాళ మందలి కోమలప్రవృత్తులనన్నిటి నొక్క మాఱుగా విడఁగొట్టు నంతటి భయానకమైనదా? సోదరీ! నారీ హృదయము పవిత్రతపోవనంబనియు నాత్మోత్సర్గశీలాభూమి యనియు, ప్రణయనందనోద్యానవనంబనియు నే నెఱుంగుదును. ఆచారనియమ మట్టి నారీహృదయమునుగూడఁ, పాషాణప్రాయంబు గావింపఁగలుఁగునంత కఠోరమైనదా? నీవు హిందూరమణివనియు

నేనంపుమునల్మానుననియు, నీవుప్రవీక్షిత కాంతవనియు నేనత్యాచారుడఁ
ననియు ముహూర్తకాలము మాత్రము నీవు మఱచి పొమ్ము.
నీవు మానవివనియు, నేను మానవుఁడననియు, నీవక్కవనియు,
నేఁదమ్ముఁడఁననియు మాత్రము దలంపుము. శైశవకాలమందు
నీవు నన్నుఁ జంకనిడుకొని చరించుటయు, చుంబనవృష్టిచే
నాగండభాగమును దడుపుటయు నీతొడపైఁ గూరుచుండఁబెట్టు
కొని చందమామను జూపించుచు గోటిముద్దలఁ బెట్టుటయు,
నాచిన్నిపఱుపుపైఁ బండుకొనఁబెట్టి జోలఁబాడుచు, ప్రేమపూర్వక
ముగ జోకొట్టుటయుఁ దలంచుకొనుము. ఇప్పుడుకూడ—మనమా
మాతృహీన సోదరీసోదరులమని దలంపుము! అక్కా!

సత్యవతి—భగవాన్ !—

మహాబత్—అక్కా!—

సత్యవతి—ఇఁక సహింపఁజాలను—ఈహృదయావేగము నిఁక భరిం
ప జాలను. జరుగనున్నది జరిగిపోయెను—తమ్ముఁడా! నీసర్వాప
రాధములను మన్నించితిని. నిన్ను మన్నింప నేను భగవానుని
కూడ ప్రార్థించుచుంటిని. తమ్ముఁడా! నాకడ నీవు మొగలాయి
సేనాధిపతివైన మహబత్ఖానువు గావు—నాయనుంగు దమ్ముండ
వైన మహీపతి సింహుండవు—నాయనా! ఇఁకనీవపుగ వచ్చును.

మహాబత్—(ఆనందబాష్పముల విడచుచు) అక్కా! పోయివచ్చెదను.

[ప్రణామమాచరించును.

సత్యవతి—తమ్ముఁడా! ఆయుష్మంతుఁడవుకమ్ము. వత్సా! రమ్ము.

హేదాయత్—నిలువుము! ఎచటకుఁ బోయెదవు? మేము నిన్ను
బంధించెదము.

మహాబత్—నాసమ్ముఖమందు నాసోదరి నీడనైన స్పృశింప నెవ్వరికిని
సాధ్యముకాదు!—అక్కా నడువుము!

హెదాయత్—మహబత్! నీవిఁక సేనాధిపతివి గావు. నీపలుకుల మే మిప్పుడు లెక్క సేయము! సాహజాదాఖురమ్ ఇపుడు మా సేనాధిపతి.

(షాజహాను ప్రవేశించును.)

షాజహాను—మంచిది! అటులైన నీయాజ్ఞను స్వయముగ నేనే యొసఁగుచుంటిని! అమ్మా! నిర్భయముగా మీనిలయమునకు బొమ్ము.

హెదాయత్—సాహోజాదా! (స్వామీ!) విద్రోహగానంబు సలుపుచు ఈమె పట్టణములందు, పల్లెలందును గ్రుమ్మరుచుండును.

షాజహాను—దూరమునుండి నేనాగానమును వింటిని. అదియెక్క హతాశమయగభీరదుఃఖగానము!

హెదాయత్—స్వామీ! దానివలన దేశమం దశాంతి యుదయింపదా?

షాజహాను—అట్టి యశాంతి నెట్లు చల్లార్పవలయునో మొగలు చక్రవర్తి యెఱుంగును. హెదాయతూ! మీవారు రాజ్యమంగాదు. సమస్త భారతవర్షమునందుఁ గూడ భారతీయులు తమతల్లిని సంస్తవ మొనరించుచు, గానము సలిపినంతనే యీవిపుల మొగలు సామ్రాజ్యము శరన్మేఘశకలమువలె నెగిరి పోయినను పోనిమ్ము. హెదాయతూ! మొగలు సామ్రాజ్యమట్టి యిసుక గోడలపై నిర్మింపఁబడి యుండలేదు!—మొగలు సామ్రాజ్యము భారతీయుల గాఢస్నేహంబుపైఁ బ్రతిష్ఠితమైయున్నది! సంగతంబై,న్యాయోచితంబై ధర్మపురస్సరమై,పవిత్రమై,భక్తిపూర్వకమై మహత్తరమైనమాతృపూజకు మొగలుసామ్రాట్టువిఘ్నముఁ గావింపఁడు! ఆపవిత్ర పూజార్థ మాతఁడు నిజసామ్రాజ్యమునుగోల్పోవవలయునన్నను, నిక్కమముగఁ గోల్పోవును! హెదాయత్! గ్రహించితివా?

హెదాయత్—స్వామీ! గ్రహించితిని.

షాజహాన్—అమ్మా! పాడుము! గానము సలుపుచు నీవు మీవారు నందు తిరుగు చున్నందులకు నేను దుఃఖమొందు చుండుటలేదు. కాని నీగానమును వినువారు నేఁడు మీవారులో నెవ్వరును లేరని దుఃఖించుచుంటిని! అమ్మా! పాడుము! యేమియు భయము లేదు. గానమును విన నేను మిగులఁగుతూహలినగుచుంటిని, మీజనని యతీత గౌరవమహిమలతోఁ బవిత్రాశ్రుజలమునుఁ గలిపి నేను శంకింపఁగలను—అమ్మా! పాడుము! బాలకా! పాడుము! నేఁగూడ మీతోఁగలసి పాడుదును! హెదాయత్! నీవుకూడఁ బాడుము! సైనికులారా! పాడుఁడు!

[పాడుచు నందఱు నిష్క్రమింతురు]

సప్తమ దృశ్యము

ఉదయసాగరతీరము—సంధ్యాకాలము
మానసి యేకాకినియై యుండును.

మానసి—నావిూదినుండి యొక జంఝూమారుతము వీచిపోయినది. మరల సాగరగంభీరపురాతన మృదులసంగీతము నాచెవి సోకుచున్నది. ఇపుడది పూర్వముకంటె నూఱురెట్లు మధురమైయున్నది. ఆకసమున మబ్బులెచటికో పోయినవి. తిరుగ గగనసీమనక్షత్రోజ్జ్వలమై యవారిత నీలిమరూపముఁదాల్చి నేత్రపర్వంబొనర్చుచుండె!—పూర్వముకంటె నిపుడది యధికనిర్మలంబై దోఁచుచున్నది! జీవనక్షుద్రసుఖదుఃఖసీమ నతిక్రమించి నాకర్తవ్యపథము నేడు బహుదూరముగఁ బ్రసరించియున్నది.

(కల్యాణి ప్రవేశించును)

మానసి—ఎవరు? కల్యాణీ!

కల్యాణి—అవును రాజకుమారీ!

మానసి—మరల రాజకుమారి యనదవేల? నీతో నాకొకనూతన సంబంధము కలిసినదిగదా!—కల్యాణీ! ఇదేమి నీవు మరల శోకించుచుంటివి? ఛీ! ఊరకుండుము.

కల్యాణి—ఇఁక విలపింపను. కాని దుఃఖము దుస్సహమైయుండ నేను నీకడకుఁ బరుగెత్తి వచ్చితిని. నాకుప్రశాంతికొసం గెదవనివచ్చితిని.

మానసి—కల్యాణీ! నీదుఃఖభారమునంతయు నాపైఁ బడవైచి, నాసుఖంబునంతయు నీవు గైకొమ్ము!

కల్యాణి—నీసుఖమా!

మానసి—అవును సుఖమే! దుఃఖము నన్నుఁబీల్చి పిప్పిఁ గావింపదలంచినది—కాని దానికి సాధ్యముకాలేదు. ఇఁక సాధ్యము కాదు. దుఃఖమును నేను ఘాతుకజంతువు బంధించినట్టు బంధించివైచి, నాకులోఁబఱచుకొని నిజకార్యనిర్వహణార్థము దాని నుపయోగించుచుంటిని. కల్యాణీ! దుఃఖము నాకెంతయో యుపకారమొనరిచినది. ఇంతకుఁ బూర్వము నేను సుఖరాజ్యమందు వసించుచునను. అట్టి తఱి దుఃఖరాజ్యము దూరమునుండి యొకమంచు తెరవలెఁ దోఁచుచుండెడిది. కాని యిపుడు నేను దుఃఖరాజ్యమందు వసించుచు దాని నిజరూప మెఱుంగ గలిఁగితిని. ఇపుడు నేను శాత్రవుల గుఱుతింపఁగలిఁగితిని. ఇఁకనేను మలిన సందిగ్ధావస్థయందుండుట యసంభవము. ఇంతకుఁ బూర్వము జీవన మసంపూర్ణమైయున్నది. నేఁడు పూర్ణంబై గన్పట్టుచున్నది.

కల్యాణి—సోదరీ! నీవు కడుధన్యురాలవు!

మానసి—కల్యాణీ! నీవుకూడ ధన్యురాలవు కాఁగలుగుదువు.

కల్యాణి—సోదరీ! ఎట్లు?

మానసి—ఈకార్యమున నాకు సాయపడుము. మనుష్యకల్యాణార్థము

మనమిసపురము మనజీవితముల నుపయోగింతము. నీకల్యాణీ
నామధేయము సార్థకమౌగాక!—నాకుఁ దోడ్పడెదవా?

కల్యాణి—నిక్కముగ!

మానసి—ఊఱట గలుఁగునో కలుగదో చూడుము!—కల్యాణీ! ఈ
వ్రత మొనరించువారికి సుంతైన విచారముండదు!

కల్యాణి—మంచిది! దానిమూలమున నావ్యర్థప్రేమ పూర్ణమౌగాక!

మానసి—సోదరీ! నీవిపుడుకూడ మహాబత్ఖాను సేవగించుచుంటివా?

కల్యాణి—సోదరీ! ఆనాఁడొడలెఱుంగక పరుషభాషణములతో నాతని
సమక్షమున నట్టిభావమును వ్యక్తీకరించి వచ్చితిని. ఆప్రేమమయు
నుపేక్షజేయుటకు నాకుశక్తిలేదని నేనిపుడు గ్రహించితిని. బాల్య
మందలి యెవ్వని మధురస్మృతితో నేను యౌవనమును బడసితినో;
యౌవనంబున నెవని నాజీవనధ్రువతారయని దలంచి యిలువెడలి
తినో;—ఈహతాశాంధకారమున నెవనిగూర్చి చింతాగ్ని నా
యంతరంగమున రావణుని కాష్టమువలె భుగులు భుగులు మని
యవిరతమై జ్వలించుచున్నదో,—అట్టివానినేవగింప నాకు సాధ్య
ముకాదు. నాహృదయావేగముచే మాత్రమపుడు నేనట్లంటిని.

మానసి—కల్యాణీ! కడచినదానికై వగవవలదు!—మనుష్యత్వమం
దీవు నీ ప్రేమను వ్యాప్తమొనరింపుము. అట్లొనర్చిన నీయుల్లము
చల్లవడును. విశ్వప్రేమ ప్రతిదానము నపేక్షింపదు—యోగ్యా
యోగ్య విచారము సలుపదు. ఆసేవఁగావించుటే సుఖము!—

(సత్యవతి ప్రవేశించును)

సత్యవతి—మానసీ! నీజనకుఁడు నిన్నుఁ బిలచుచున్నాఁడు.

మానసి—జనకుఁడు తిరిగివచ్చెనా?

సత్యవతి—వచ్చెనుతల్లీ.

మానసి—మొగలాయీలతో సంధిజరిగెనా యేమి?

సత్యవతి—లేదు. ఖురమ్ లేఖామూలమున స్నేహభిక్షవేడుట ముఖాముఖి ప్రార్థనయనియే రాణా గ్రహించెను. అందొకటి గగనకుసుమము—ఒకటి మృగతృష్ణ!

మానసి—అమ్మా! ఏల?

సత్య—క్షణకాలము నిస్తబ్దమైయుండి] మైత్రియెప్పుడును సమక్షమందే జరుగఁగలదు—దగ్గరనున్నపుడే యొండొరుల కరస్పర్శమువలన సఖ్యము సాధ్యమగును! పదాఘాతమునకును పృష్టభాగమునకును సఖ్యము కానేరదు!—జయధ్వనికిని, ఆర్తనాదమునకును సఖ్యము కాఁజాలదు! దుర్గనిర్గతుఁడై రాణాచక్రవర్తి ప్రమోలశరణాగతుఁడై నిలువంబడవలెనని ఖురముయొక్క యభీష్టము! మానసీ! రాణా ప్రతాపసింహుని తనూజునకీ యవమానముకంటె మృత్యువే మేలు!

మానసి—జనకుఁడేమి చేయును?

సత్యవతి—రాణా నేఁడు సామంతుల నాహ్వానించి, వారి సముఖమున నిజాత్మజుని సింహాసనారూఢుఁగావించి, రాజ్యభారమును త్యజించి జాయాసమేతుండై, యతఁడు నిజసీమనువిడచి తపమొనరింప హిమవత్పర్వత పార్శ్వస్థగహనసీమ కరిగి కాలము పుచ్చును—మానసీ! నేఁడు మీవారు పతనమాయెను!

మానసి—అమ్మా! మీవారు పతనము నేఁ డారంభమయ్యెనందువా! కాదు. ఆమెపతనము నేఁటిదికాదు. మనజనని పతనము చాలకాలమునకుఁ బూర్వమే యారంభమైనది. ప్రస్తుత ఘటనమాపతన శృంఖలయందలి యొకగ్రంథి మాత్రమే!

సత్యవతి—అమ్మా! ఆపతన మెప్పుడారంభమైనది.

మానసి—ఏదినమున మీవారుజనని తనకన్నులకు గంతలఁగట్టుకొని యాచారహస్తములఁ బట్టుకొని నడువ గడంగెనో;—ఏదినమున నామె నిజవివేచనమును మఱచెనో ఆదినమందే ఆమెపతనమారంభ

మైనది. వీరమాతా! స్రోతము ప్రవహించునంతకాలము నీరు నిర్మలమై యుండును. కాని ప్రవాహ మెపుడు తగ్గునో, అపుడే సలిలమందుఁ గీటకములుఁ జన్మించును. ఆనీరంతయు క్రిమి ప్రపంచ మయమై దుర్గంధమయమైపోవును! ఆవిధంబుననే రసపుత్రజాతి యందు నేఁడు నీచస్వార్థక్షుద్రభ్రాతృద్రోహవిజాతి విద్వేషము లుద్భవమైనవి. అత్యుదారమైన మనసనాతన హిందూధర్మము నేఁడు ప్రాణహీనాచారాస్థిపంజరమైయున్నది. ఎవరి ధర్మమంత రించెనో—ఎవరి మతము క్షీణించెనో, వారికి పతనము గలుగ కుండునా! మనజాతి యెట్టికిల్బిషంబుతో నిండియున్నదో యెరుగ నెవ్వరును యత్నింపలేదు. మీవా రంతరించెనని యాక్రందన మొన రించిన నేమిప్రయోజనము!

సత్యవతి—ఈదుఃఖమునకటులైన నిదియా, సాంత్వనము?

మానసి—కాదు. ఇంతకంటెఁ గూడ నెక్కుడైన సాంత్వనముకలదు. మీవారు పోయినను, మీవారుకంటె నధికంబులగు శుభసంపత్తులు మనకు జేకూరఁగలవని దలంచుటే యాసాంత్వనము! నాసోదరుఁడు నైతికబలమందు సమర్థుఁడై, దుఃఖనైరాశ్యగాఢాంధకారములందు ధర్మమునే జీవనధ్రువతారగాఁ జేసుకొనవలెనని నేఁగోరుచుంటిని! అట్లొనరింపకున్న, నతఁడుచ్ఛిన్నుఁడై పోవును. అతఁడట్లయినచో నేను విచారింపను గూడ విచారింపను.

సత్యవతి—సోదరుఁడుచ్ఛిన్నుఁడై యుండ నీరవవై నిలువబడి చూచు చుండఁగలవా?

మానసి—ఎందులకుండలేను! వానిని మఱచిపోవ శక్తి వంచనలేక యత్నించెదను. 'నాప్రయత్నము భగ్నమగుచో—జగదీశ్వరుని మంగళనియమము పూర్ణము గావలెనని కోరుదును. స్వార్థముకంటె జాతీయత్వమెట్లధికమో, జాతీయత్వముకంటె మనుష్యత్వమట్లే

యధికము. జాతీయత్వము మనుష్యత్వమునకు విరుద్ధమగుచో మను
ష్యత్వమహార్ణవంబున నది విలీనమై పోవుగాక! దేశమంతరింప
నిమ్ము! స్వాతంత్ర్యము చావనిమ్ము—రసపుత్రజాతికి మరల మను
ష్యత్వము వచ్చుగాక !

సత్యవతి—అమ్మా! అది సాధ్యమగునా ?

మానసి—ఏల సాధ్యము కాదు! మనమే దానిని సాధింపవలయును.
మనమే యాతపంబు నాచరింపవలెను. ఉచ్చసాధనమెన్నఁడు నిష్ఫ
లంబు కానేరదు. మనజాతి మరల మనుష్యత్వం బొందును.

సత్యవతి—అదెప్పుడు ?

మానసి—ఏదినమున రసపుత్రు లధర్మకాచారములకుఁ గ్రీతదాసులౌట
చాలించి మరల దమ ధర్మమును దామేభావించుకొన నేర్తురో—
ఏదినమున వారి హృదయాంతరాళమున మరల భావస్రోతఃప
హించునో—ఏదినమున వా రుచితానుచితముల కర్తవ
ముల వివేచించుకొని పరులనుతికై యపేక్షింపక, ఎవరి
పమునకై బొమముడిపాటు నొందక నిర్భయంబుగ గర్త
నిర్వహణధూర్వహులు కాఁగలరో—ఏదినమునవారలు దురాచా
ప్రబోధకములగు యుగయుగాంతరజీర్ణగ్రంథముల విసర్జించి,
సదాచారములఁ బరిగణించి, నవధర్మాచరణ మొనరించెదరో, ఆదిన
మందే వారలు మనుష్యులగుదురు !

సత్యవతి—మానసీ! నీవనిన నవధర్మమెయ్యది ?

మానసి—ప్రణయమే ఆధర్మము! మానవుఁ డాత్మసుఖమును మఱచి
సోదరులను, జాతిని, మనుజులను, మనుష్యత్వమును ప్రేమింప
నేర్చుకొన వలయును. అతఁడు తన కొఱ కేమియుఁ జేసుకొనఁ
గూడదు. ఈశ్వరాజ్ఞానియమంబున వాని భవిష్యము తనకు దానే
యేర్పడును. జాతీయోన్నతపథము శోణితప్రవాహమధ్యమునుండి

నిర్ణీతమైవచ్చిపడదు. జాత్యున్నతిపథము ప్రణయాలింగనము నుండి యేర్పడును! ఏపదమును వంగవర్షోద్భవుడైన శ్రీచైతన్య దేవుడు సూచించెనో—ఏమార్గము నాంధ్రమండలోద్భవపూర్వసంయమీంద్రులు జూపిరో, ఆపథమననుసరించి మనము చనవలయును! అట్లొనరింపనిచో నిక్కువముగ మనము నీచులమై, కుటిలులమై, స్వార్థసేవకులమగుదుము. అట్లే రాణాప్రతాపసింహుని స్మృతిని హృదయమున నుంచుకొని అతీతమహిమనిర్వాణప్రదీపమును తొడపై నుంచుకొని చిరకాలము హాహాకార మొనరించినను ప్రయోజనములేదు!

[అందరు నిష్క్రమింతురు.]

అ ష్ట మ దృ శ్య ము.

ఉదయసాగరతీరము—మేఘాచ్ఛన్నసంధ్యాకాలము.

(రాణా అమరసింహుడు డేకాకియై యుండును)

రాణా—మీవారునభము క్రోధంబుచే గర్జించుచున్నది. మీవారు మహీధరములు సిగ్గునగ్రుంగి పోవుచున్నవి. మీవారుహ్రదంబులు శోకంబుచేఁ దమశిరముల నొడ్డునకుఁ గొట్టుకొనుచున్నవి. రోషంబుచే మీవారు కులదేవతలు పెడమోము పెట్టుకొనినారు. నాకరములనుండి నా మీవారు—రాణాప్రతాపసింహుని మీవారు నేఁడు పతనమై పోయినది. నేనెట్టిపాపిని...(పచారుచేయుచుండ మహబత్ఖాను ప్రవేశించును)

రాణా—ఓహో! మహబత్ఖాను గారా! వందేగి ఖాన్సాహెబుజీ!

మహబత్—మీవారు రాణాకు జయముగుగాక!

రాణా—మ్లేచ్ఛభృత్యా! ఒక్కహత్యావిద్యయందు మాత్రమే నీవు విశారదుఁడవుగావు. వ్యంగము పలుపుటలో గూడ నీవు నిపుణుం

డవు! నిక్కముగ "మీవారు రాణాకు జయమే యొసఁగుగాక!"

మహబత్ — రాణా! నేనుపరిహాసముఁ గావింపలేదు.

రాణా — కావించినను గావింపక పోయిన నొక్కటియే! పోని మ్మావిషయమెందులకు! — మహబత్! నేనొకమారునీదర్శనమును గోరితిని.

మహబత్ — ఎందులకో సెలవిండు.

రాణా — ఆహా! ఏమినీవినయము! —— మహబత్! నాయుద్దేశ్యమేమోవినుము. నీవుతక్క నొరులెవ్వరు గావింపనేరని యొక్కపనికై నిన్నుబిలచితిని.

మహబత్ — అదేమియో యానతిండు.

రాణా — మహబత్! ముందుగ నీవొకమారు నన్నుఁ దేఱిచూడుము. నీవునాకేమగుదువో తెలుపుము.

మహబత్ — నేను మీసోదరుండను.

రాణా — సోదరుండవయ్యు, సోదరోచిత కార్యమునే సలి తామహా ప్రపితామహుల మీవారును నీవు మొగఁ దలిత మొనరించితివి! మాతృదేవతా వక్షస్స్థల రక నీకరద్వంద్వమును రంజితమొనరించుకొంటివి.

మహబత్ — రాణా! నేనుచక్రవర్తి యుప్పుదిని బ్రతుకుచున్నాను,

రాణా — మహబత్! అదెప్పటినుండి! పోనిమ్ము! నీకర్తవ్యమును నీవు సలిపితివి. ఆవిషయముననీతో వితండవాదమొనరించుటవృథ. ఎవడు విధర్మియయ్యెనో ; — ఎవఁడు మొగలాయీల యుచ్ఛిష్టమును భుజించుచుండెనో, దాని కీకార్య మనుచితము గాదు. ఎవఁడు మూర్తీభవించిన యనియమము వలెఁ గన్పట్టుచుండెనో ఎవ్వఁడు ఉద్దామ స్వేచ్ఛాచార నిష్ఠీవనము గతిఁదోచుచున్నాఁడో వాని కీ కార్యమనుచిత మెట్లగును? నీవు మీవారును ధ్వంసమొనరించితివి.

ఆకార్యమింకను పూర్తి కాలేదు! మీవారుతోఁ గూడ మీవారు రాణానుగూడ హత మొనరింపుము! ఇదిగో ఈకత్తిని గై కొనుము.

[కృపాణము నీయఁబోవును]

మహబత్ — రాణా! —

రాణా — ప్రతివాద మొనరింపకుము. వేగనన్ను వధింపుము. నన్నుఁ జంపినమాత్రాన నీకళంక మెక్కుడు కాఁజాలదు. నీకప్రియమైన కార్యము నేదేని గావింపుమని నిన్నడుగుచుండుట లేదు. నారక్తమును ద్రావుటకై నీవుచాల పిపాసాబాధితుఁ డగుచుంటివి. నీదక్షిణహస్తముతో నాహృత్పిండము నూడబెఱికివేయ మిగులనాత్రముతోఁ గరిపించుచుంటివి? ఇదిగోనాహృత్పిండమును గైకొమ్ము! నన్నిప్పుడ వధింపుము!

మహబత్ — రాణా! మహబత్ఖానంత హీనుఁడనిదలఁపఁ బోకుఁడు. ...తమున, అగ్నిదాహమున నేను మీవారుభూమిని శ్మశానరించుట నిక్కవమే! అట్లొనరించినను నేనన్యాయయుద్ధ ...రింపలేదు. న్యాయయుద్ధమొనరించితిని.

రాణా — న్యాయయుద్ధమా! మహబత్! దీనిని న్యాయయుద్ధ మందువా? పిపీలికిటఁబట్టఁదగిన యొక క్షుద్రజనపద సేనపై నొక సామ్రాజ్య విపులవాహినీభారము ఒక్కస్ఫులింగముపై వారాశి తరంగప్రపాతము, ఒకశిశువునాత్మపై నిరయముఃస్వప్నము — ఇవన్ని యన్యాయములుగ నేదోఁచెనా! న్యాయయుద్ధమా! — పోనిమ్ము నీవే జయోపేతుఁడవైతివి. నీవు మొదలిడిన కార్యము నిపుడు నిశ్శేషింపుము. ఈకృపాణమును దీసికొమ్ము! ఈకరవాలమును రాణాప్రతాపసింహుఁడు, మరణకాలమున నాకొసఁగి «ఈఖడ్గంబున కెట్టియవమానము రాకుండఁజూడు» మని వచించెను. పాపినై నేనీ యాయుధము నవమానించితిని. ఆయవమానము నేఁడు

నారక్తముతోఁ గడుగఁబడుఁగాక !

మహబత్—రాణా ! మహాబత్ఖాను యోధుఁడుకాని హంతకుఁడు కాఁడు.

రాణా—అట్లైన పోరుసలుపుము. నీయస్త్రమును దీసికొనుము !

[కత్తిని ధ్వనిజేయును]

మహబత్—రాణా ! నేను మీవారునకు విరుద్ధముగ నస్త్రమును పరిత్యజించి వైచితిని.

రాణా—మహబత్ ! అదెప్పటినుండి ?—కృపాణమును వెలికిఁదీయుము—కరవాలమును ఝుళిపింపుము. నేఁడు, మీవారు మహాశ్మశానమున, మాతృశవమును స్కంధమున నిడికొని, ద్వంద్వయుద్ధమునకు నిన్నాహ్వానించుచుంటిని !

మహబత్—రాణా ! వినుఁడు—

రాణా—నేనేమియు వినను ! మహబత్ ! భీరూ ! మ్లేకులభ్రష్టా ! కులాంగారమా ! రణంబునకురమ్ము ! వవనియు, నద్వితీయ వీరుండవనియు భారతవర్షమంప్రమోగునట్లు లోకులు నిన్ను నుతించుచుండుటకుయో, నీవీర్యమెట్టిదియో నేఁజూచెదను. అస్త్రమును దీసికొమ్ము ! నిన్నువదలను ! అధముఁడా ! నరకకీటమా ! భూతమా ! త్వరపడుము ! సంకోచింపకుము !

మహబత్—రాణా ! మంచిది—అట్లైన నీచిత్తము వచ్చిన తెఱంగున నాచరింతును. [తరవారి నొరనుండి వెలికిఁదీయును] రాణా ! జాగ్రత్త ! మహబత్ఖానునకు బ్రతిద్వంద్విభారతవర్షమున నెవండైన నున్నచో నీవే !—అయిననుజాగ్రత్త !

[ఇరువురు ఖడ్గములఁ ద్రిప్పుదురు !]

రాణా—నేఁడన్న దమ్ములసమరము !—జగంబున నెవ్వరెన్నఁడు

జూడనివింత! పృథివియందుఁ బ్రళయమగుగాక!

కోపమున నిరువురు ద్వంద్వయుద్ధమునకు మొదలిడగనే మానసిపరుగెత్తివచ్చి వారి నడుమ నిలువఁబడును—

మానసి—తండ్రీ! ఇదేమి! ఇదేమి! (మహబత్ఖాను వైపునకు దిరిగి) శాంతింపుఁడు! శాంతింపుఁడు!!

రాణా—మానసీ! నీవు దూరంబుగనరుగుము! ఈభండనమున కంత రాయమును గలిగింపకుము.

మానసి—తండ్రీ! శాంతివహింపుఁడు! జరుగవలసిన సర్వనాశ మేమో జరిగిపోయెను. ఆనాశమును నిజసోదరరక్తరంజిత మొన రించుకొనకుఁడు. శోకసాంత్వనము హత్యకాదు. దానిసాంత్వనము మరల మనుష్యుల మగుటయే!

రాణా—మనుష్యుల మగుటయా!—మానసీ! ఎట్లెట్లు?

—శత్రుమిత్రజ్ఞానమును మఱచి, విద్వేషమువిడిచి నిజదేశ కాళిమముల, విశ్వప్రేమతోఁ గడిగివైచి పవిత్రాత్ముల మమేని మరలమనము మనుష్యులము కాఁగలము. (తెర వైపునకుదిరిగి) చారణీగణంబులారా! గానము సలుపుఁడు. మీరు నాకడ నేర్చుకొనిన "ఇల మనుష్యత్వమెన్నఁడు వీడజనదు" అను గీతమును పాడుఁడు.

కాషాయవస్త్రములదాల్చి గాయకురాండ్రటఁ బ్రవేశింతురు. అమరసింహ మహబత్ఖానులు నివ్వెరపడిచూచుచుందురు. మానసి వారితోఁగలిసి పాడుచుండును.

గీ. తి

ఇంతలో రాజ్యమంతయు నంత మొంద
వంతఁజెందుట మానుఁడు భ్రాతలార!

అనుజులే శత్రులైపోవ నాజియందు,
పరులనిందింపనేల బాపాత్ములంచు?
దుఃఖమయవర్తమానముఁ దొలఁగిపోవ,
సత్వసంపన్నులగుచు భ్రాతృత్వధ్వజము
వేగనిల్పుఁడు ముదమున విశ్వమందు;
ఆత్మసుఖమును విడి నిర్మలాత్ములగుచు,
పరులకై వసియింపు డీధరణియందు;
అవనియంతయు మీయదియంచుఁదలఁచి,
శత్రువులగూడ ప్రియులైన సహజులనియు
నెమ్మనంబున భావించి, నెమ్మితోడ
వారియొగ్గులమరచియు వారికున్న
మంచిగొనములఁ గీర్తించి మసలుఁడెపుడు;
కపటమిత్రుల నెల్లరఁ గరుణలేక,
దరిమివేయుఁడు దవ్వగాఁ ద్వరితముగను
పాపపథములఁ ద్రొక్కకఁ బరగనెపుడు
పుణ్యమార్గవిహారులై పూజ్యులగుచు
చిత్తమునఁ బరమేశ్వరుఁ జేర్చియుంచి
ధర్మదేవతఁ గొలువుఁడు తప్పకెపుడు;
పుడమిరాజ్యముపోయిన పోవనిండు;
అనుజులందఱు నరిగిన యరుగనిండు;
మాత మీవారుమడిసిన మడియనిండు;
యిల మనుష్యత్వమును త్యజియింపకుండ!—

రాణా—మహాబత్!

మహాబత్—అమర్!

రాణా—నీయందిసుమంతయైనదోసంబు లేదు. తప్పంతయునాయదియే!

196 — 8

మే వా రు ప త న ము

నన్ను క్షమింపుము!

మహాబత్—అన్నా! నన్ను మన్నింపుము!

[అన్నదమ్ములు కౌఁగలించుకొందురు]

య వ ని క ప త న మ గు ను

స ం పూ ర్ణ ము



# నిబంధనలు

—:o:—

౧. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముం దుగా ౦—౮—౦ లు చెల్లింప వలయును.

౨. ఇందు రెండేసిమాసముల కొక్కటిగ వెలువడు చుండు క్యాలికో బైండు గల ప్రతిగ్రంథమును రు ౧—౦—౦ వెలకుఁ జందాదారులకుఁ బంపు చుందుము.

3. గ్రంథములఁ బంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

౪. చందాదారు లగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొన వలెనను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములుగూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొన వలెను.

౫. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమము లేదు. కోరినవారి కే పంపుచుందుము.

౬. సంవత్సరము చందా—అనగా ముందు ప్రకటింపబడు ఆరు పుస్తకములకు రు ౭—౨—౦ లు ముందుగఁ బంపువారికి ఆరుపుస్తకములు వెలువడినప్పుడు ప్రతిపుస్తకమును అన్ రిజిష్టర్డు పార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆరుపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను ౦—౧—౨—౦ లును రిజిష్టరు ఖర్చు ౦—౧—౨—౦ లును రు ౧—౯—౦ కూడివచ్చును.